

# దేవీ భాగవతం

నైమిశారణ్యంలో ఉండే మునులకు సూతుడు, తాను వ్యాసుడి ద్వారా విన్న అనేక పురాణాలు చెప్పాడు. ఏదో సందర్భంలో సూతుడు శౌనకాది మునులతో దేవీభాగవతం అనే పురాణం ఒకటి ఉన్నట్టు అని ఉన్నాడు. ఒకనాడు శౌనకుడు సూతుడికి ఆ విషయం జ్ఞాపకం చేసి, ఆ భాగవత పురాణం చెప్పమని కోరాడు. సూతుడు సరేనని మునులకు దేవీ భాగవత పురాణం చెప్పి వినిపించాడు.

సూతుడు ఆదిశక్తిని గురించి ఇలా చెప్పాడు :

''ఆమె మహాశక్తి. ఆమెయే విద్య. అన్ని లోకాలూ ఆమెనే ఆశ్రయించి ఉన్నాయి. సృష్టి స్థితిలయాలను కలిగించేది నిజంగా ఆదిశక్తే. ఆమె ప్రేరణ ద్వారా త్రిమూర్తులు ఆ విధులు నిర్వర్తిస్తారు. బ్రహ్మ విష్ణు నాభినుంచి పుట్టాడు; విష్ణువుకు ఆధారం ఆదిశేషుడు; ఆదిశేషుడు జలం ఆధారంగా ఉన్నాడు; ఆ జలానికే ఆధారం మహాశక్తి. లోకమాత. అలాటి దేవికి సంబంధించినది దేవీభాగవతం.''

సూతుడి వల్ల దేవీభాగవతం వినాలన్న కుతూహలంతో ఉన్న మునుల తరఫున శౌనకుడు సూతుడితో, ''ఒకప్పుడు బ్రహ్మ మాకు ఒక చక్రం ఇచ్చి, దాని నేమి ఏ ప్రదేశంలో విరిగిపోతే ఆ ప్రదేశం పవిత్రమైనదనీ, అక్కడ కలి ప్రవేశించదనీ చెప్పాడు. ఆ చక్రం ఇరుసు ఇక్కడ

1. సూతుడూ–శౌనకాది మునులూ



విరిగిపోయింది. అందుచేత దీనికి నైమిశం అనే పేరు వచ్చింది. మేం ఇక్కడే ఉండిపోయాం. తిరిగి కృతయుగం వచ్చే దాకా ఇక్కడే ఉండి, కలి భయం లేకుండా ఉంటాం. ఇక్కడ మాకు పుణ్యగోష్ఠి తప్ప మరేమీ లేదు. అందుచేత నువు మాకు పుణ్యప్రదమైన దేవీ భాగవత పురాణం వినిపించు," అన్నాడు.

తిరిగి సూతుడు ఇలా చెప్పాడు :

"వ్యాసమహాముని నాకు ఎలా చెప్పాడో అలాగే నేను మీకు దేవీభాగవతం చెబుతాను. ఇప్పటికి ఇరవై ఏడు ద్వాపరాలు గడిచి, ఇరవై ఎనిమిదో ద్వాపరం జరుగుతున్నది. ప్రతి ద్వాపరంలోనూ ఒక వ్యాసుడు పుట్టాడు. వేదాలను విభజించి, పురాణాలు రచించిన సాత్యవతేయుడు అనే వ్యాసుడు (సత్యవతి కొడుకు) మా గురువుగారు. ఆయన తన కొడుకైన శుకుడికి ఈ దేవీభాగవతం చెప్పుతూంటే నేను భక్తి శ్రద్ధలతో గ్రహించాను. 'అల్లుడి వెంట తిను; కొడుకు వెంట చదువు' అంటారు గద పెద్దలు. ఈ దేవీభాగవతం విని శుకుడు తరించాడు. నిజానికి ఈ పురాణం విన్నవారు కష్టాలుపడటం సాధ్యం కాదు."

ఇది విని మునులు సూతుణ్ణి, "శుకుడు వ్యాసుడికి ఎలా కొడుకు అయాడు? అతను అరణిలో పుట్టాడని గదా చెబుతారు?" అని అడిగారు. అప్పుడు సూతుడు మునులకు శుకుడి జన్మ వృత్తాంతం ఇలా చెప్పాడు :

ఒకప్పుడు వ్యాసుడు సరస్వతీ నదీ తీరాన తపస్సు చేసుకుంటూ, పక్షులు దంపతులుగా జీవిస్తూ పిల్లలను కనటమూ, వాటి నోటికి ఆహారం అందించి, అవి తింటుంటే చూసి ఆనందించటమూ గమనించి, తనకు కూడా సంతానం కలిగితే ఎంత బాగుంటుందో గద అనే చింతలో పడ్డాడు. చక్కగా పెళ్ళి చేసుకుంటే భార్యతో సుఖపడవచ్చు, కొడుకులను కనవచ్చు. కొడుకు పెరిగి పెద్ద

వాడై, వాడు పెళ్లి చేసుకుంటే ముద్దుల కోడలిని చూసి మురిసిపోవచ్చు. కొడుకులుంటే ఎన్ని లాభాలు! ముసలితనంలో ఎంతో శ్రద్ధగా సేవలు చేస్తారు.

అలా అనుకుని వ్యాసుడు కొడుకుల నిమిత్తం తపస్సు చెయ్యటానికి కాంచనాద్రికి వెళ్ళి, ఏ దేవుణ్ణి ఆరాధిస్తే తనకు శీఘ్రంగా కోరిక నెరవేరుతుందా అని ఆలోచిస్తూండగా, ఆయన ఉన్న చోటికి నారదుడు వచ్చాడు. అతన్ని చూడగానే వ్యాసుడు నమస్కరించి, "స్వామీ, సమయానికి వచ్చావు. నా కోరిక తీర్చటానికే వచ్చి ఉంటావు," అన్నాడు.

"సర్వజ్ఞుడివి. నీకు ఒకరి సహాయం అవసరమా? ఏమయినా నీ కోరిక ఏమిటో చెప్పు," అన్నాడు నారదుడు.

"కొడుకు లేని వాడికి పరలోకం ఉండదుట. ఏ దేవుణ్ణి ప్రార్థించితే నాకు కొడుకునిస్తాడు? చెప్పు, నారదా?" అని వ్యాసుడు అడిగాడు.

అప్పుడు నారదుడు ఇలా అన్నాడు: "ఒకప్పుడు, నా తండ్రి అయిన బ్రహ్మకు ఇదే సందేహం కలిగింది. ఆయన విష్ణులోకానికి వెళ్లి, విష్ణువును చూసి, "నువే సర్వోత్తముడవనుకుంటున్నాను. నీ కన్న గొప్పవాడుంటే చెప్పు," అని అడిగాడు.



దానికి విష్ణువు, "నువు సృష్టించే వాడివనీ, నేను పెంపొందించే వాడిననీ, శివుడు హరించేవాడనీ జనం అనుకుంటారు. ఇది పొరపాటు. తేజస్సుతో కూడిన ఆది శక్తి మాత్రమే సృష్టి చేస్తుందని బుద్ధిమంతులు గ్రహిస్తారు. మనం సృష్టి స్థితిలయాలు చేస్తున్నామంటే అందుకు కారణం నీకు రజస్సూ, నాకు సత్త్వమూ, శివుడికి తమస్సూ తోడ్పడుతున్నాయి. లేనిపక్షంలో మనం గవ్వవిలువ చేస్తామా? నేను ఈ శేషతల్పం మీద పడుకున్నా, లక్ష్మి వెంట ఆరామాలలో విహరిస్తున్నా, పొగరుపట్టిన రాక్షసులను చంపినా ఆ శక్తి దయవల్లనే గదా? వెనక నేను మధు



''వ్యాసుడు లోకమాతను గురించి తపస్సు చేశాడు.'' అని సూతుడు మునులకు చెప్పాడు.

వెంటనే మునులు, ''విష్ణువు తల తెగటం ఎలా జరిగింది? ఆయనకు గుర్రం తల ఎలా అతికారు? ఇదంతా నమ్మదగిన విధంగా చెప్పు.'' అని సూతుణ్ణి అడిగారు.

### హయగ్రీవావతారం

పూర్వం విష్ణువు రాక్షసులతో పదివేల సంవత్సరాలు యుద్ధం చేసి, అలసిపోయి, ఎక్కుపెట్టి ఉన్న వింటిమొన మీద గడ్డం ఆనించి నిద్రపోసాగాడు. ఆ సమయంలో దేవతలు యజ్ఞం తలపెట్టి, విష్ణువు కోసం వెతుక్కుంటూ వచ్చి, అతను నిద్రలో ఉండటం చూసి, ఏం చెయ్యాలో తోచని స్థితిలోపడ్డారు. అప్పుడు శివుడు బ్రహ్మతో, ''నువు ఒక పురుగును తయారుచేసి, దానిచేత విష్ణువు వింటినారిని కొరికింపజెయ్యి. నారితెగగానే వింటిమొన పైకి లేస్తుంది. వెంటనే విష్ణువు నిద్రలేస్తాడు. యజ్ఞం సాగుతుంది.'' అన్నాడు.

బ్రహ్మ పురుగును సృష్టించి, విష్ణువు వింటినారిని కొరకమన్నాడు.

దానికా పురుగు, ''మహాత్మా, ఎలా చేసేది ఈ పని? మహాపాపం కాదా?

కైటభు లనే దానవులతో అయిదువేల ఏళ్లు పోరాడి, చివరకు జయం పొందింది శక్తి సహాయంతో కాదా? నేను స్వతంత్రుడనని ఒక్కనాటికి అనుకోకు. ఒకసారి వింటినారితో నా తల తెగిపోతే, నువు దేవశిల్పిచేత ఒక గుర్రం తల నాకు ఏర్పాటు చేయించావు. ఆ విధంగా నేను హయగ్రీవుణ్ణి అయానుగదా. అందుచేత నేను శక్తికి అధీనుణ్ణే. శక్తిని మించినది లోకాలలో మరొకటి ఉన్నదని నేను చెప్పలేను.'' అన్నాడు.

ఇలా చెప్పి నారదుడు వ్యాసుడితో, ''నువు ఆదిశక్తిని కోరుకున్నావంటే నీ కోరిక ఈడేరుతుంది.'' అన్నాడు.



తల్లీ పిల్లలను విడదీయుటమూ, భార్యా భర్తలకు ఎడబాటు చేయుటమూ, నిద్రా భంగం కలిగించటమూ బ్రహ్మహత్యలాటి మహాపాపాలు. ఈ పని నన్ను చేయ మన్నారా ?'' అని అడిగింది.

''నువ్వేమీ విచారించకు. యజ్ఞంలో అగ్నికి ఆహుతి చెయ్యని పదార్థమంతా నీకిస్తాం," అని బ్రహ్మ పురుగుతో అన్నాడు.

పురుగు సంతోషించి వింటినారిని కొరి కింది. అప్పుడు పెద్ద ధ్వని పుట్టింది. భూమి అదిరింది. వింటికొన చప్పున పైకి తన్నటంలో విష్ణువు తల కాస్తా ఎగిరి పోయింది. అది చూసి దేవతలు దిమ్మర పోయి, ఏం చెయ్యాలో తెలీక, ''నువ్వే సర్వేశ్వరుడివి గదా, అన్నిలోకాలనూ భరించే వాడివిగదా ! నీ గతి ఇలా అయిం దేమిటి? ఏ రాక్షసులూ చెయ్యలేని ఈ పని నీ కెవరు చేశారు? నువు మాయకు కూడా అతీతుడివే, మాయ నిన్ను ఇలా చేసి ఉండటం సాధ్యమా ?'' అని విలపించారు.

దేవగురువైన బృహస్పతి వారితో, ''ఏడుస్తూ కూచుంటే ఏమవుతుంది? జరిగిన దానికి ఉపాయం ఏదన్నా చూడండి,'' అన్నాడు.

''దేవతలంతా చూస్తూండగానే విష్ణువు తల తెగి, ఎగిరిపోయింది గదా! మన ప్రయత్నం వల్ల ఏమవుతుంది? దైవబలం వల్లనే ఏమైనా జరగాలి,'' అన్నాడు ఇంద్రుడు.

అప్పుడు బ్రహ్మ, ''దేనికైనా జగ దీశ్వరి అనుగ్రహం కావాలి. ఆవిడే సృష్టి స్థితి లయ కారకురాలు. అందుచేత మీరంతా ఆ ఆదిశక్తిని ప్రార్థించండి,'' అన్నాడు దేవతలతో.

దేవతలు ఆదిశక్తిని ప్రార్థన చేశారు. వారిని కరుణించి దేవి ప్రత్యక్షమయింది.

''తల్లీ, ఈ విష్ణువుకు ఈ గతి ఎందుకు పట్టింది? అతని తల ఏమయింది ?'' అని దేవతలు దేవిని అడిగారు. దేవి వారితో ఇలా చెప్పింది :

"విష్ణువుకు ఈ గతి ఎందుకు పట్టిందని అడిగారు మీరు. కారణం లేకుండా ఏదీ జరగదు. ఒకనాడు విష్ణువు పడకటింట లక్ష్మిని చూసి నవ్వాడు. అది చూసి లక్ష్మి కంగారుపడింది. విష్ణువు తన ముఖం చూసి ఎందుకు నవ్వాడు? తన ముఖం అంత అనాకారిగా ఉన్నదా? తనకన్న అందగత్తెను ఎవతెనైనా చూసి మోహించాడా? ఇలా అనుకుని లక్ష్మి సవతి పోరుకన్న మొగుడు చావటమే మంచిదనుకుని, తన భర్త తల సముద్రంలో పడుగాక అని శపించింది. ఆ శాపం తగిలి విష్ణువుకు ఈ గతి కలిగింది. ఇది ఇలా ఉండగా, హయగ్రీవుడనే రాక్షసుడు వెయ్యి సంవత్సరాలు నా కోసం తపస్సు చేశాడు. నేను ప్రత్యక్షమై, వరం కోరుకోమంటే, ఎవ్వరిచేతా తనకు చావు రాకూడదని కోరాడు. పుట్టిన ప్రాణికి చావు తప్పదు గనక మరేదన్నా వరం కోరుకోమన్నాను. అందుకు వాడు తాను హయగ్రీవుడు గనుక హయగ్రీవుడి చేతనే చచ్చేలాగ వరం కోరాడు. నేను అలా వరం ఇచ్చాను. వాడిప్పుడు లోకాలన్నిటినీ క్షోభింపజేస్తున్నాడు. మూడు లోకాలలోనూ వాణ్ణి చంపగలవాడు లేడు. కనక మీరు ఒక గుర్రం తల తెచ్చి, విష్ణువు శరీరానికి తగిలించి హయగ్రీవుణ్ణి సృష్టించండి. అలా చేస్తే ఈ విష్ణుహయగ్రీవుడు ఆ రాక్షస హయగ్రీవుణ్ణి చంపేస్తాడు."



ఇలా చెప్పి ఆదిశక్తి అంతర్హితురాలు కాగానే, దేవతలు దేవశిల్పిని పిల్చి, గుర్రం తల తెచ్చి విష్ణువు శరీరానికి అతకమన్నారు. దేవశిల్పి అలాగే చేశాడు. విష్ణువు హయగ్రీవ రూపంలో అదే పేరు గల రాక్షసుణ్ణి చంపి, లోకాలకు ఆనందం చేకూర్చాడు.

## మధుకైటభులు

తరవాత మునులు సూతుణ్ణి మధుకైటభుల కథ చెప్పమని కోరారు. అప్పుడు సూతుడ వారికా వృత్తాంతం ఇలా చెప్పాడు:

పాలసముద్రంలో శేషతల్పం మీద విష్ణువు నిద్రపోతున్న సమయంలో అతని చెవుల నుంచి ఇద్దరు రాక్షసులు పుట్టుకొచ్చి, నీటిలో ఈతలు కొట్టుతూ, తమ పుట్టుకకు ఆధారం ఏమిటా అని ఆశ్చర్య పడ్డారు. వారిలో కైటభుడు అనేవాడు మధువుతో, "ఈ మహాసముద్రానికీ, మనకూ ఏదో ఆధారం ఉండి ఉండాలి," అన్నాడు.

వాడు అలా అనగానే ఆకాశం నుంచి ఒక మాట వినిపించింది.

మధుకైటభులు ఆ మాట పట్టుకుని జపించసాగారు. ఇంతలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసినట్టయింది. రాక్షసులు దాన్ని చూసి, అది శక్తితేజస్సే అని నిశ్చయించి, తమకు వినిపించిన ధ్వనిని మంత్రంగా భావించి, వెయ్యేళ్ళు తపస్సు చేశారు. ఆ తపస్సుకు మెచ్చుకుని దేవి వారిని వరం కోరుకోమన్నది. వాళ్లు స్వేచ్ఛామరణం కోరారు. ఆమె వారు కోరిన వరం ఇచ్చింది.

తరవాత వాళ్లు జలంలోనే సంచరిస్తూ, ఒక చోట బ్రహ్మను చూసి, తమతో యుద్ధానికి రమ్మని పిలిచారు.

"మాతో యుద్ధం చెయ్యి. యుద్ధం చెయ్యలేకపోతే నీ పద్మాసనం విడిచిపెట్టి, ఎక్కడికైనా వెళ్ళిపో," అన్నారు వాళ్ళు బ్రహ్మతో.

బ్రహ్మ భయపడి, యోగసమాధిలో ఉన్న విష్ణువుతో, "మేలుకో, నాయనా! ఇద్దరు రాక్షసులు నన్ను చంపుతామంటూ వచ్చారు. నన్ను కాపాడు," అని వేడుకున్నాడు.

ఈ మాటకు విష్ణువు యోగనిద్ర నుంచి లేవలేదు. అప్పుడు బ్రహ్మ ఆదిశక్తియైన యోగనిద్రనే ప్రార్థనచేశాడు:

"తల్లీ, ఈ రాక్షసుల నుంచి కాపాడటానికి విష్ణువును లేవగొట్టు. లేదా, నువ్వే నన్ను కాపాడు," అన్నాడు బ్రహ్మ. వెంటనే యోగనిద్ర విష్ణువును విడిచి వెళ్ళిపోయింది. విష్ణువు నిద్రలేచేసరికి బ్రహ్మ పరమానందం చెందాడు.





# దేవీ భాగవతం

## 2. మధు, కైటభుల వధ

ఇలా చెబుతున్న సూతుడికి మునులు అడ్డంవచ్చి, "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయ కారకులనీ, ఆ ముగ్గురిలో విష్ణువు ఉత్తముడనీ విన్నాం. అలాటి విష్ణువును యోగనిద్ర అవహించినప్పుడు అతని శక్తీ, తేజస్సూ ఏమయాయి? ఆదిశక్తికి ఇతన్ని మించిన శక్తి ఎలాకలిగింది? విష్ణువే కారణాలన్నిటికీ కారణమని విన్నాం. నువు శక్తి మాత్రమే అన్ని కారణాలకూ కారణమంటున్నావు. నిజం ఏదో మాకు తెలియటం లేదు," అన్నారు.

### శక్తి స్వరూపం

దానికి సూతు డిలా అన్నాడు:

"మునులారా, మీరడిగిన దానికి సమాధానం శ్రద్ధగా వినండి. నారదుడు మొదలైనవారు అంతుచిక్కని శక్తి ప్రభావాన్ని అర్థం చేసుకోలేక, విష్ణువే సర్వశక్తిమంతుడని భ్రమపడ్డారు. అలాగే కొందరు శివుడే పరదైవమనీ, మరికొందరు సూర్యుడనీ, మరికొందరు అగ్ని అనీ, ఇంకా కొందరు చంద్రుడనీ, ఇంద్రుడనీ, కొందరు ఏదో అనీ, మాయలోపడి, రకరకాలుగా అభిప్రాయపడతారు. ఎవరు ఏ ప్రమాణాలు చెప్పినా, అన్ని ప్రమాణాలకూ అతీతమైన పరశక్తి మాత్రమే నిజమైన శక్తి. అది విష్ణువులో, శివుడిలో, సూర్యుడిలో, వాయువులో, అగ్నిలో కనబడుతూంటుంది."

అలా శక్తిచేత మేల్కొల్పబడి విష్ణువు బ్రహ్మను చూసి, "అబ్బాయీ, నువు



తపస్సు కూడా మానేసి ఇలా ఎందుకు వచ్చావు? నీ బాధకు కారణమేమిటి?" అని అడిగాడు.

"ఇంక నేను తపస్సు చేసుకోవటం కూడానా? నీ చెవుల నుంచి ఇద్దరు రాక్షసులు, మధుకైటభు లనే వాళ్లు పుట్టి, నన్ను చంపుతామంటూ యుద్ధానికి పిలిచారు," అన్నాడు బ్రహ్మ.

"దీనికే భయపడతావా? నేను ఎంత లేసి రాక్షసులను చంపానుకాను?" అని విష్ణువు అంటున్నంతలోనే, ఆ రాక్షసులు వచ్చి పడి, బ్రహ్మతో, "పారిపోయి వచ్చి, ఇక్కడ దాక్కున్నావా? మేం కనుక్కోలేమనే? నిన్ను ఇతను రక్షిస్తాడా? చచ్చేవాడివి నువు ఒంటరిగా చావక, ఇతన్ని తోడు చావమంటావా?" అని మీదికి వచ్చారు.

విష్ణువు బ్రహ్మను తన వెనక్కు రమ్మని, రాక్షసులతో, "తెగ వదరుతున్నారు, మదమెక్కిందా? తొందర పడకండి, మీ తీట తీర్చుతాను," అంటూ యుద్ధానికి సిద్ధపడ్డాడు.

దేవి ఆకాశం నుంచి చూస్తూండగా విష్ణువూ, మధుడూ యుద్ధం ప్రారంభించారు. సముద్రం పొంగి పొరల సాగింది. మధుడు అలిసిపోవటం చూసి కైటభుడు విష్ణువుతో మల్లయుద్ధం ఆరంభించాడు. రాక్షసులిద్దరూ కలిసి పోట్లాడుతూంటే విష్ణువుకు క్రమంగా నీరసం వచ్చేసింది. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. రాక్షసులను ఎలా జయించాలి? తనకు దిక్కేది?

విష్ణువు ఇలా అనుకుంటుంటే రాక్షసులు అతనితో, "యుద్ధం చెయ్యటానికి శక్తి చాలకపోతే, మాకు దాసుణ్ణని దణ్ణం పెట్టు. లేకపోతే నిన్ను చంపి, తరవాత బ్రహ్మను చంపేస్తాం," అన్నారు.

విష్ణువు సౌమ్యంగా వారితో, "అలసిపోయిన వారినీ, వెనక్కు తిరిగినవారినీ, భయపడినవారినీ, యుద్ధంలో పడిపోయిన వారినీ ఎదుర్కోవటం వీరధర్మం కాదు.

అది అలా ఉంచి, మీరు ఇద్దరున్నారు, నేనేమో ఒక్కణ్ణే! ఒక్క క్షణం విశ్రాంతి తీసుకుని యుద్ధం చేస్తాను. కొంచెం ఓర్చుకోండి. మీకు మాత్రం యుద్ధధర్మం తెలియదా?'' అన్నాడు.

''సరే, విశ్రమించు. ఈలోగా మేమూ విశ్రమిస్తాం,'' అన్నారు రాక్షసులు.

అప్పుడు విష్ణువు దివ్యదృష్టితో, ఆ రాక్షసులు వరం పొందిన వారని గ్రహించి, ''అనవసరంగా యుద్ధం చేస్తినే! వీరు స్వేచ్ఛామరణం వరంగా సంపాదించారు. వీరిని ఎలా చంపటం?" అని ఆందోళన పడసాగాడు. చివరకు అతను జగదంబను ధ్యానించాడు:

''తల్లీ, నీ సహాయం లేకుండా నేను ఈ రాక్షసులను చంపలేను. మీదు మిక్కిలి వాళ్ళే నన్ను చంపేస్తారు. నువే వీళ్ళకు వరం ఇచ్చి ఉన్నావు. వీళ్ళు చచ్చే ఉపాయం కూడా నువే చెప్పు.''

దీనంగా వేడుకుంటున్న విష్ణువును చూసి దేవి చిరునవ్వు నవ్వి, "ఈ రాక్షసుల మీద నా మాయ కప్పుతాను. వారిని జయించు,'' అన్నది.

రాక్షసులు విష్ణువుతో, ''ఓడిపోతానని ఎందుకు భయపడతావు? శూరులకు జయాపజయాలు రెండూ సంప్రాప్తమవుతాయి. నీ చేత ఎందరు రాక్షసులు ఓడారు



కారు? ఎప్పుడూ జయమే కలుగుతుందా?'' అని ఎత్తి పొడిచారు.

మధు, కైటభుల యుద్ధం

ఈ మాటకు విష్ణువు మండిపడి, రాక్షసులతో తలపడి, వాళ్ళను పిడికిలితో పొడిచాడు. వాళ్ళు నెత్తురుకక్కుతూ విష్ణువును రొమ్ములో పొడిచారు. ఇలా ముష్టి యుద్ధం సాగింది. విష్ణువు సొమ్మసిలి, రక్తం ఓడుతూ ఉన్న సమయంలో ఆకాశంలో దేవిని చూశాడు.

అదే సమయంలో దేవి రాక్షసుల పైన మన్మథుడి బాణాల లాటి చూపులను ప్రసరించింది. ఆ దెబ్బతో వారు యుద్ధం మాట మరచి మోహపాశానికి చిక్క



పడ్డారు. ఆ స్థితిలో విష్ణువు ఆ రాక్షసులతో, ''ఎంతమంది రాక్షసులనైనా చూశాను గాని, యుద్ధవిద్యలో మీతో సమానులను చూడలేదు. మీ యుద్ధనైపుణ్యం చూసి నాకు చాలా సంతోషమయింది. మీ కోరిక ఏదన్నా ఉంటే చెప్పండి, తీర్చుతాను,'' అన్నాడు.

దేవీప్రభావం చేత మాయామోహితులై ఉన్న రాక్షసులు, విష్ణువు మాటకు అభిమానం తెచ్చుకుని, విష్ణువును తూస్కారంగా చూస్తూ, ''మేం నిన్ను అడిగే వాళ్ళమూ, నువు ఇచ్చేవాడివీనా? కావలిస్తే, నువే కోరు, మేం ఇస్తాం!'' అన్నారు.

''నేను కోరినది ఇస్తారా? నా యుద్ధం చూసి మీకు ఆనందం కలిగిన పక్షంలో నా చేత చచ్చిపొండి,'' అన్నాడు విష్ణువు.

రాక్షసులు కళవళపడి, కొంచెం ఆలోచించి, ''నువు మాటమీద నిలబడే వాడివైతే, మాకు వరం ఇస్తానన్న మాట గుర్తుంచుకుని, నీరులేని విశాలప్రదేశంలో మమ్మల్ని చంపు. అలా అయితేనే నీ చేతిలో మేం చచ్చిపోతాం,'' అన్నారు.

విష్ణువు నవ్వి, తన తొడలు పెంచి, ''రాక్షసులారా, రండి,'' అన్నాడు.

రాక్షసులు విష్ణువు తొడలను మించి తమ శరీరాలు పెంచారు. విష్ణువు తన తొడలనూ, రాక్షసులు తమ శరీరాలను ఇలా పెంచగా, చిట్ట చివరకు రాక్షసుల శరీరాల కన్న విష్ణువు తొడలే పెద్దవి అయాయి. అప్పుడు విష్ణువు తన చక్రాన్ని తలచుకున్నాడు. అది వచ్చి రాక్షసులను నరికేసింది. వాళ్ళ మెదడు, నీటిలోపడి, పెద్ద మిట్ట తయారయింది. అది మొదలు భూమికి "మేదిని" అనే పేరు వచ్చింది.

వ్యాసుడి తపస్సు

ఇంతవరకు చెప్పిన సూతుడితో మునులు, ''ప్రసంగవశాన ఇతర విషయాలు చాలా విన్నాం. కాని కొడుకు కోసం తపస్సు చేయబోయిన వ్యాసుడి కథ అలాగే ఉండిపోయింది,'' అన్నారు.

మునులతో సూతుడు, వ్యాసుడి తపస్సు గురించి, ఇలా చెప్పాడు :

నారదుడు చెప్పిన మంత్రం జపిస్తూ సువర్ణగిరి మీద, కర్ణికారవనంలో వ్యాసుడు తపస్సు ప్రారంభించాడు. ఆయన శక్తిని మనస్సులో నిలిపి తపస్సు చేస్తూంటే, భూమ్యాకాశాలు కంపించాయి. ఇంద్రుడు భయపడి, దేవతలను వెంట బెట్టుకుని శివుడి వద్దకు వెళ్ళి, "వ్యాసుడు తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు. గొప్ప ప్రమాదం వచ్చిపడింది. మమ్మల్ని కాపాడు!" అని ప్రార్థించాడు.

"తపస్సు చేసుకునే వారికి కీడు తలపెట్టరాదు. వాళ్ళు ఇతరులకు చెరుపు చెయ్యరు. వ్యాసుడు కొడుకును కోరి, శక్తితో కూడిన నా కోసం తపస్సు చేస్తున్నాడు," అని శివుడు దేవతలతో చెప్పి, వ్యాసుడి ముందు ప్రత్యక్షమై, అతని కోరిక తీరేలాగు వరమిచ్చాడు. వ్యాసుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు.

అతను అరణి మథించి అగ్నిచేసి, "ఇలాటి అగ్నివంటి కొడుకును నాకు ప్రసాదించగల స్త్రీ ఉన్నదా? అయినా, ఆడది పెద్ద ప్రతిబంధకం," అని అనుకుంటూండగా, ఆకాశంలో ఘృతాచి కనబడింది. సమీపంలోనే మన్మథుడు కూడా కనిపించాడు. వ్యాసుడు మన్మథుడి ప్రభా



వానికి గురి అయికూడా, "ఇది నన్ను మోసగించటానికే వచ్చి ఉంటుంది. పోనీ దీనితో సుఖంగా ఉంటే వచ్చేనష్టమేమిటి? దీన్ని చేరదీస్తే మునులు నవ్వుతారేమో? ఇది నా మీద మనసుంచి నాకు సుఖమే కూర్చుతుందా? లేక, పూర్వం ఊర్వశి పురూరవుణ్ణి చేసినట్టు విరహవేదనలో ముంచేస్తుందా?" అనుకున్నాడు.

మునులు సూతుడు చెప్పే దానికి అడ్డు వచ్చి, "ఎవరండీ, ఆ పురూరవుడు?" అని అడిగారు. సూతుడు ఇలా చెప్పాడు :

### బుధుడి పుట్టుక

బృహస్పతి భార్య తార అనే ఆమె ఉండేది. ఆమె చాలా చక్కనిది. ఒక



నాడు ఆమె చంద్రుడి ఇంటికి వెళ్ళింది. ఆమెను చూసి చంద్రుడు అమితంగా మోహించాడు. ఆమె కూడా చంద్రుణ్ణి చూస్తూనే అతన్ని ప్రేమించింది. ఇద్దరి మనసులూ ఏకం కావటంతో తార చాలా కాలం చంద్రుడి ఇంటనే ఉండిపోయింది. ఆమె తిరిగి రాకపోయేసరికి బృహస్పతి, ఆమెను పిలుచుకురమ్మని ఒక శిష్యుణ్ణి పంపాడు. తార వాడి మాట లక్ష్యపెట్ట లేదు. బృహస్పతి ఎంతమందిని పంపినా ప్రయోజనం లేకపోయింది. చివరకు ఆయన మండిపడుతూ చంద్రుడి వద్దకు వెళ్ళాడు. ఆయనను చూసి చంద్రుడు నవ్వాడు.

"ఒరే, గురువు భార్య తల్లితో సమానం రా! బ్రాహ్మణుణ్ణి చంపేవాడూ, కల్లుతాగేవాడూ, బంగారం దొంగిలించే వాడూ, గురువు భార్యను కామించేవాడూ, వీరి నలుగురితోనూ స్నేహం చేసేవాడూ, పంచమహాపాతకులు. నీకు స్వర్గప్రాప్తి ఉంటుందా? దేవేంద్రుడు. నిన్ను శిక్షించడా?" అన్నాడు బృహస్పతి చంద్రుడితో.

దానికి చంద్రుడు శాంతంగా, "బ్రాహ్మణులకు కోపం తగునా? రేపో మాపో ఈమె బయలుదేరనే బయలు దేరుతుంది. ఇక్కడే కాపరం ఉండి పోతుందా? ఉంటే మాత్రం తప్పేమిటి? ఈ భాగ్యానికి అంతగా విచారించాలా?" అన్నాడు.

బృహస్పతి చంద్రుడికి ఏ సమాధానమూ చెప్పలేక, ఇంటికి తిరిగివెళ్ళి, భార్య కోసం మరికొన్ని రోజులు చూశాడు. భార్య రాలేదు. బృహస్పతికి విచారం పట్టుకున్నది. ఆయన మళ్ళీ చంద్రుడి ఇంటికి వెళ్ళాడు. బయట కాపలావాడు ఆయనను అడ్డగించాడు.

అప్పుడు బృహస్పతి గొంతెత్తి, "ఒరే, దుర్మార్గుడా! ఎంత దారుణానికి ఒడి గట్టావురా! నా పెళ్ళాన్ని నేను చూడ టానికి లేకుండా ద్వారంలో అడ్డం పెడ

తావా? నా భార్య నీకు సొంతమూ, నాకు దూరమూ కావటమా? చూడు, శాపం పెట్టి నిన్నేం చేస్తానో!'' అన్నాడు.

దానికి చంద్రుడు, "నా భార్య, నా భార్య అంటావు! సమస్త లక్షణ సమన్వితురాలైన ఈమె నీ వంటి దరిద్రుడి ఇంట ఉండదగునా? నీకు భార్య కావాలంటే తగిన దాన్ని కట్టుకుని సుఖంగా ఉండు. అన్ని శాస్త్రాలు చదివావుగాని ఏం లాభం? ఆడది తనకు తగిన వాడితో ఉంటుందనీ, తనకు తగనివాణ్ణి విడిచి పెట్టుతుందనీ తెలుసుకోలేక పోయావు! ఇన్ని మాటలెందుకు? నేను తారను విడిచిపెట్టను. ఇక నువు వెళ్ళు. అసూయతో నువు పెట్టే శాపాలు నాకు తగలవు. నీ యిష్టం వచ్చినది చేసుకో!'' అన్నాడు.

బృహస్పతి చేసేది లేక ఇంద్రుడి వద్దకు వెళ్ళాడు. ఇంద్రుడు ఆయనను గౌరవించి కూర్చోబెట్టి, ''స్వామీ, విచారంగా ఉన్నావేమిటి?'' అని అడిగాడు.

''నా భార్యను చంద్రుడు అపహరించి, అడిగితే ఇయ్యను పొమ్మన్నాడు. నా భార్యను నాకిప్పించుదూ!'' అన్నాడు బృహస్పతి.

''స్వామీ, నువు విచారించకు. నేను నీ భార్యను విడిపిస్తాను. చంద్రుడు మొండికేస్తే వజ్రాయుధంతో కొట్టి, వాడి మదం అణుస్తాను. దుర్మార్గుడు ఇంత పని చేస్తాడా?'' అని ఇంద్రుడు దూతకు చెప్పవలసినది చెప్పి చంద్రుడి వద్దకు పంపాడు.

ఇంద్రుడి దూత వెళ్ళి, ఇంద్రుడి తరఫున చంద్రుడికి ఏవేవో నీతులు చెప్పి, తారను విడిచిపెట్టమన్నాడు. చంద్రుడు మండిపడి, ''ఇంద్రుడు ఎంత నీతిపరుడో నాకూ తెలుసు. తార నా మీది ప్రేమను నమ్ముకుని వచ్చింది. ఆమెను ఎలా వదులుతాను? నేను వదలితే మాత్రం ఆమె తన భర్త దగ్గిరికి పోతుందా? నేను ప్రాణాలైనా విడుస్తానుగాని, తారను విడవనని ఇంద్రుడితో చెప్పు.'' అన్నాడు.





# దేవీ భాగవతం

దేవదూత ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్లి చంద్రుడాడిన మాటలన్నీ చెప్పాడు.

"ఇలాటి పాడుపని చేసి కూడా చంద్రుడి కింత సాహసమా ?'' అని ఇంద్రుడు చంద్రుడి మీదికి యుద్ధానికి తలపడ్డాడు. ఇది తెలిసి శుక్రుడు తన శిష్యబృందంతో చంద్రుడికి సహాయం వచ్చాడు. శివుడు బృహస్పతికి సహాయం వచ్చాడు. ఉభయ పక్షాలకూ యుద్ధంసాగింది.

అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి చంద్రుడితో, ''నువు బృహస్పతి భార్యను వదిలి పెట్టు. లేకపోతే విష్ణువుతో చెప్పి నీ మదం అణగిస్తాను,'' అన్నాడు. తరవాత ఆయన శుక్రుడితో, ''బృహస్పతి మీది పగచేత ఇలా చంద్రుడికి సహాయం వస్తావా ? ఇక ఏ ఆడదైనా మొగుడితో కాపరం చేస్తుందా ?'' అన్నాడు.

శుక్రుడు చంద్రుడితో తారను విడిచి పెట్టమన్నాడు. గర్భవతిగా ఉన్న తారను చంద్రుడు బృహస్పతికి ఇచ్చేశాడు. శివుడు మొదలైనవాళ్లు వెళ్ళిపోయారు. తార బృహస్పతి ఇంటికి వచ్చి ఒక కొడుకును కన్నది. ఆ పిల్లవాడికి బృహస్పతి జాతకర్మ చేయబోతూండగా చంద్రుడి దూత వచ్చి, చంద్రుడి తరఫున, ''వీడు నీ కొడుకు కాదు, నాకు పుట్టినవాడు. వాడికి నువు ఎలా జాతకర్మ చేస్తావు ?'' అని అడిగాడు.

బృహస్పతి చంద్రుడి దూతతో, ''నా పోలికలున్నాయి. వీడు నా కొడుకే

3. శుకుడి జననం



చంద్రుడి రూపురేఖలు వీడిలో లేవు.'' అని చెప్పి పంపాడు. దూత చంద్రుడితో అదంతా చెప్పాడు.

వెంటనే చంద్రుడు రాక్షసగణాలను వెంటబెట్టుకుని మళ్ళీ యుద్ధానికి వచ్చాడు.

ఆగిపోయిన దేవదానవ యుద్ధం తిరిగి ఆరంభమయింది.

అప్పుడు బ్రహ్మ వచ్చి, యుద్ధం వద్దని చెప్పి, ఈ పోట్లాటలకు మూలకారకురాలైన తారతో, ''నీ మూలంగా ఎంత బెడద వచ్చిపడిందో చూడు. ఇంతకూ నువు కొడుకును ఎవరికి కన్నావు? చంద్రుడికా? బృహస్పతికా?'' అన్నాడు.

తార బ్రహ్మకేసి చూడలేక, తల వంచుకుని, ''చంద్రుడికే! చంద్రుడికే! చంద్రుడికే!'' అన్నది.

బ్రహ్మదేవుడు వెంటనే పిల్లవాణ్ణి చంద్రుడికి ఇప్పించి, తగువు తీర్చాడు. ఆ విధంగా చంద్రుడికి, బృహస్పతి భార్య అయిన తారకూ బుధుడు పుట్టాడు. ఆ బుధుడికి పురూరవుడు పుట్టాడు. అది ఎలా జరిగిందంటే :

### పురూరవుడి కథ

ఒకప్పుడు సుద్యుమ్నుడనే గొప్ప రాజు ఉండేవాడు. ఒకసారి అతను కొంత మంది మంత్రులను వెంటబెట్టుకుని, గుర్రం మీద వేటకు బయలుదేరి, అమిత మనోహరమైన కుమారవనం చూసి, అందులో ప్రవేశించాడు. వెంటనే సుద్యుమ్నుడూ, అతని వెంట ఉన్న వారందరూ కూడా ఆడవాళ్ళు అయిపోయారు. ఆఖరుకు సుద్యుమ్నుడి గుర్రం కూడా ఆడగుర్రంగా మారిపోయింది. ఇలా ఎందుకు జరిగినదీ సుద్యుమ్నుడు ఊహించలేక, ''ఈ రూపంతో ఎలా రాజ్యం చేస్తాను? భార్యలతో ఎలా కాపరం చేస్తాను? శత్రువులతో ఎలా పోరాడుతాను?'' అంటూ కుంగిపోయాడు.

ఇలా చెబుతున్న సూతుడితో శౌనకాది మునులు, ''అవునండీ? రాజూ, అతని

పరివారమూ స్త్రీలుగా మారటానికి కారణం ఏమిటి?'' అని అడిగారు. సూతుడు ఇలా చెప్పుకుపోయాడు:

ఒకసారి సనకసనందనాది మునులు శివుణ్ణి చూడటానికి కుమారవనానికి వెళ్ళే సరికి, అక్కడ పార్వతి దిగంబరంగా శివుడి వెంట వారికి కనిపించింది. వెంటనే వాళ్లు వెనక్కు తిరిగి నారాయణవనానికి వెళ్ళిపోయారు. అయితే పార్వతి జరిగిన దానికి చాలా సిగ్గుపడింది. ఆమె పడే బాధ చూసి శివుడు, ఆ వనంలోకి అడుగు పెట్టిన ప్రతి పురుషుడూ స్త్రీ అయేటట్టు నియమం పెట్టాడు. సుద్యుమ్నుడూ, అతని పరివారమూ స్త్రీలు కావటానికి అదే కారణం.

తరవాత అతను ఇళ అని పేరు మార్చుకుని తన చెలికత్తెలతో ఆ వనం లోనే ఉండిపోయాడు. చంద్రుడికొడుకైన బుధుడు ఈ ఇళను చూడటం తటస్థించింది. ఆ క్షణంలోనే ఇద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. వారిద్దరికీ పుట్టిన వాడు పురూరవుడు.

తరవాత ఇళ తన కులగురువైన వసిష్ఠుణ్ణి తలచుకుంటే, ఆడ రూపంలో ఉన్న సుద్యుమ్నుడి మనోవేదన గ్రహించి, వసిష్ఠుడు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు అనుగ్రహించి ప్రత్యక్షమయాడు.

''మా రాజైన సుద్యుమ్నుణ్ణి తిరిగి మగవాడయేలాగు వరం ఇయ్యి.'' అని వసిష్ఠుడు శివుణ్ణి వేడుకున్నాడు.





తపస్సు చేసుకునేటందుకు వనానికి వెళ్ళాడు. అతను నారదుడి చేత నవాక్షరీ మంత్రం ఉపదేశం పొంది, ఆ మంత్రం జపిస్తూ తపస్సు చేసుకుంటూండగా, అతని సౌభాగ్యం కొద్దీ, ఒకనాడు మహాదేవి సింహం మీద ఎక్కి ఎదట ప్రత్యక్ష మయింది.

సుద్యుమ్నుడు పారవశ్యంతో ఆ దేవిని స్తోత్రం చేసి, ఆమె అనుగ్రహంతో ముక్తిపొందాడు.

సుద్యుమ్నుడి అనంతరం పురూరవుడు గొప్పగా రాజ్యం చేసి, ఎన్నో యజ్ఞాలూ, బ్రాహ్మణులకు దానాలూ చేశాడు. అతని అందమూ, కీర్తీ ఇతర గుణాలూ చూసి ఊర్వశి అతనిపై కన్నువేసింది. తరవాత ఆమె బ్రహ్మదేవుడి శాపంవల్ల భూమికి రావటం తటస్థించింది. అప్పుడామె పురూరవుణ్ణి కలుసుకుని, అతనితో కాపరం చెయ్యటానికి ఒప్పుకుని, "నాకు రెండు గొర్రెలున్నాయి. అవి నాకు బిడ్డలకన్న ఎక్కువ. నువు వాటిని రక్షించాలి. తరవాత, నువు నాకు దిగంబరుడుగా కనిపించరాదు. మరొకటేమంటే, నువు నాకు తినటానికి తరచుగా నెయ్యి ఇయ్యాలి. ఈ నిబంధనలను నువు ఉల్లంఘించినప్పుడు నేను నిన్ను విడిచి పోతాను," అన్నది.

"నా మాట వ్యర్థం కారాదు. సుద్యుమ్నుడు ఒకనెల మగవాడుగానూ, ఒక నెల ఆడదిగానూ ఉండేటట్టు వరం ఇస్తాను," అన్నాడు శివుడు

ఇలా వసిష్ఠుడి దయవల్ల తిరిగి మగవాడైన సుద్యుమ్నుడు తన రాజధానికి తిరిగివచ్చి, రాజ్యం ఏలసాగాడు. అతను మగవాడుగా ఉన్న నెల రాజ్యం చేసి, ఆడదిగా ఉన్న నెల అంతఃపురంలో నుంచి బయటికి వచ్చేవాడు కాడు. సుద్యుమ్నుడి యీ ప్రవర్తన ప్రజలకు ఏమీ బాగుండేది కాదు.

కొడుకు పెద్దవాడైన దాకా ఈ విధంగా రాజ్యం పాలించి తరవాత సుద్యుమ్నుడు

అందుకు ఒప్పుకుని పురూరవుడు ఊర్వశిని చేరదీసి, ఆమెతో కొన్ని ఏళ్లు కాపరం చేశాడు. అతను పూర్తిగా కామంలో పడిపోయి, ధర్మార్థ మోక్షాల మాట తలపెట్టలేదు. ఊర్వశి కూడా పురూరవుడి ప్రేమలో మునిగి తేలుతూ, స్వర్గాన్నీ, దేవేంద్రుణ్ణీ పూర్తిగా మరచిపోయింది.

ఊర్వశీ పురూరవులు ఇలా ఉండటం చూసి, దేవేంద్రుడు ఊర్వశిని తిరిగి రప్పించుకోగోరి, గంధర్వులతో, "స్వర్గంలో రంభ మొదలైన అప్సరసలు ఎంతమంది ఉన్నా, ఊర్వశి లేక స్వర్గం కళాహీనంగా ఉన్నది. అందుచేత ఏదో విధంగా పురూరవుణ్ణి మోసగించి, గొర్రెలను అపహరిస్తే పని జరుగుతుంది. వెళ్ళి ఆ పని చెయ్యండి." అని, వారిని పంపాడు.

గంధర్వులు పురూరవుడికి తెలియకుండా ఒక చీకటి రాత్రి గొర్రెలను అపహరించారు. అవి అరవసాగాయి. అప్పుడు ఊర్వశి పురూరవుడితో, "నేను కొడుకులకన్న ఎక్కువగా చూసుకునే గొర్రెలను దొంగలు ఎత్తుకుపోతూంటే, ఆడదానిలాగా చూస్తూ ఊరుకుంటావా? నువు రక్షిస్తావని నమ్మి నేను అశ్రద్ధ చేశానుగాని, నువు అసమర్థుడవని తెలియక మోసపోయాను." అంటూ అతన్ని నానామాటలూ అనసాగింది.

ప్రియురాలి మీద జాలిపడి పురూరవుడు, ఒంటిమీద బట్ట లేకుండానే





దొంగల వెంటబడి తరిమాడు. పురూరవుడి ఒంటిమీద బట్టలేని మాట ఊర్వశికి తెలిసివచ్చేలాగ గంధర్వులు మెరుపులు మెరిపించారు. గొర్రెలను తెస్తున్న పురూరవుడు నగ్నంగా ఉండటం చూసి, ఊర్వశి అతని కాళ్ళకు మొక్కి, "నా నియమాలు ముందు చెప్పానుగదా! ప్రతిజ్ఞ ఉల్లంఘించిన నీతో ఇక కాపరం చెయ్యలేను. నేనిక వెళ్ళిపోవాలి. నన్ను మరచిపోకు," అని ఊరడించింది.

ఊర్వశి స్వర్గానికి తిరిగిపోగానే పురూరవుడు మనోవేదన పాలయాడు. అతనికి మతిపోయింది. అతను ఊర్వశినీ, ఆమె చేష్టలనూ తలచుకుంటూ తెగ తిరగ సాగాడు. అనుకోకుండా అతనికి ఊర్వశి కురుదేశంలో కనబడింది.

అప్పుడతను ఆమెను సమీపించి గద్గద కంఠంతో, "నీ మీద ఎన్నడూ ఆగ్రహించినవాణ్ణి కాను, కీడు చేసినవాణ్ణి కాను. ఎన్నడూ నీకు ఎదురు చెప్పలేదు. నీకు దాసుడిలాగా ఉంటూ వచ్చాను. నువు ఏ పని చెప్పినా చేశాను. నన్ను విడిచి వెళ్ళిపోయావు, ఇది న్యాయమేనా? నన్ను ప్రేమించి వచ్చావు. అలాటి దానివి నన్ను ఎందుకు విడిచి వెళ్ళినట్టు? నీ ప్రేమ శాశ్వతమనుకున్నాను. నన్ను ఇలా దుఃఖంలో ముంచుతావా?" అని వాపోయాడు.

అతని మనసు విరచటానికి ఊర్వశి, "మా జాతికి ప్రేమ ఏమిటి? నా కోసం బాధపడక, వెళ్ళి నీ రాజ్యం చూసుకో," అంటూ వెళ్ళిపోయింది.

పురూరవుడికి పట్టిన గతే తనకూ పట్టుతుందేమోనని వ్యాసుడు ఘృతాచిని చూసి అనుకున్నాడు. ఘృతాచి కూడా వ్యాసుడు తనను ఎక్కడ శపిస్తాడోనని, ఆడచిలుకగా మారి ఎగిరిపోయింది. అయితే వ్యాసుడు తీవ్రమైన విరహ బాధలో పడ్డాడు. దాని ఫలితంగా, వ్యాసుడు అగ్నికోసం మధించుతున్న అరణిలో నుంచి శుకుడు పుటాడు.

వ్యాసుడు శుకుణ్ణి చూసి, "ఏమిటీ అద్భుతం! ఇది శివుడి మహిమ కావాలి," అనుకున్నాడు. ఆయన తన కొడుకును గంగకు తీసుకుపోయి, స్నానం చేయించి, జాతకర్మ చేశాడు. ఆకాశంలో దేవ దుందుభులు మోగాయి. భూమి మీద పుష్పవర్షం కురిసింది. నారదుడు మొద లైన వారు పాడారు. రంభ మొదలైన అప్సరలు ఆడారు.

చిలుకరూపం ధరించిన స్త్రీ కారణంగా పుట్టినందుకు వ్యాసుడి కొడుక్కు శుకుడు అనే పేరు వచ్చింది. కుర్రవాడు క్రమంగా పెద్దవాడయాడు. శుకుడి కోసం ఆకాశం నుంచి జింకచర్మమూ, దండమూ, కమండలమూ పడ్డాయి. వ్యాసుడు తన కొడుక్కు ఉపనయనం చేసి, బృహస్పతి వద్ద వేదాభ్యాసం చేయించాడు.

శుకుడు తన విద్యాభ్యాసం ముగియ గానే గురుదక్షిణ ఇచ్చి, తండ్రి వద్దకు తిరిగి వచ్చాడు.

చదువు పూర్తిచేసి తిరిగి వచ్చిన కొడుకును కౌగలించుకుని, వ్యాసుడు ఎంతో సంతోషించి, అతనికి వివాహం చేతామనుకున్నాడు. ఆయన యోగ్యురా లైన ఒక మునికన్యను వెతికి తెచ్చి, శుకుడితో, "నాయనా, నువు వేద శాస్త్రా లన్నీ చదివావు. ఇక పెళ్ళి చేసుకుని, యజ్ఞయాగాలు చేస్తూ, పిల్లలను కనే సమయం వచ్చింది. కొడుకులు లేక పోతే గతులు ఉండవు. కీర్తి ఉండదు. అందుచేత ఒక కన్యను పెళ్ళాడి, పిల్లలను కని, నాకు సంతోషం కలిగించి, పితృ దేవతలకు తృప్తినియ్యి. నా మాట తీసి వెయ్యకు. ఎన్నో ఏళ్ళు తపస్సు చేసిన కారణంగా నువు నాకు పుట్టావు. నీ మూలంగా కీర్తి, సద్గతి కలగాలని ఆశిస్తున్నాను," అన్నాడు.

ఆ మాటకు శుకుడు తండ్రితో, "నాకు పెళ్ళివద్దు. తత్త్వం ఉపదేశించు. చూస్తూ, చూస్తూ నన్ను సంసార సాగరంలోకి ఎందుకు తోస్తావు?" అన్నాడు.





# దేవీ భాగవతం

శుకుడి మాటలకు వ్యాసుడు, "నాయనా, నూరు సంవత్సరాలు తపస్సు చేసి నిన్ను కన్నాను. నాకు ఎదురు రాకు. నీకు యౌవనం వచ్చింది. పెళ్ళాన్ని తెచ్చుకుని, సుఖపడు. ఏ రాజునైనా చూసి డబ్బు తెస్తాను. నీకు డబ్బు కొరత లేకుండా చూస్తాను," అన్నాడు.

"పెళ్లితో సుఖం వస్తుందంటే ఎలా నమ్ముతాను? పెళ్ళి చేసుకుని, నానా కష్టాలూ పడుతూ, అవే సుఖాలనుకుని, సంసార కూపం నుంచి బయటికి రాలేక క్షీణించే వారిని చూస్తున్నాను గదా! దుఃఖంతో కూడిన సౌఖ్యాన్ని సుఖం అనవచ్చునా? సంకెళ్ళ నుంచి విముక్తి ఉంటుంది గాని, ఆడదాని మమకార పాశంలో చిక్కుకున్న వాడికి విముక్తి లేదు. అలాటి సుఖాన్ని ఎలా కోరి వరించను?" అన్నాడు శుకుడు.

"మనసును అదుపులో పెట్టి, నిర్మలంగా ఉంచుకోవటమే ముక్తికి మార్గం. అంతేగాని మరేవీ బంధాలు కావు. న్యాయంగా ధనం సంపాదిస్తూ, అబద్ధ మాడక, శౌచం విడవక, విద్యుక్తమైన ధర్మాలు చేస్తూ గృహస్థు ముక్తి పొందుతాడు, నాయనా. గృహస్థుడుగా ఉంటూ, అతిథులను ఆదరిస్తూ, వానప్రస్థులకూ, సంసారులకూ అండగా ఉంటూ, అన్ని ధర్మాలూ ఆచరించి చివరకు ముక్తి పొందవచ్చు. అందుకనే గదా వసిష్ఠుడు మొదలైనమహర్షులందరూ గృహస్థాశ్రమం

**4.** శుక - జనక సంవాదం



స్వీకరించారు? వేదోక్త కర్మలు జరపాలంటే గృహస్థాశ్రమం తప్ప మరో మార్గం లేదు. దానికి ఇతర ఆశ్రమాలు సాటి రావు. అంతేగాక, పంచేంద్రియాలు మహా బలవత్తరమైనవి. భార్యలేని వాణ్ణి అవి అవలీలగా అధోలోకానికి తోస్తాయి. వాడెంత గొప్ప పండితుడైనా సరే! ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవటానికి పెళ్ళాడాలి. ముసలితనం వచ్చాక తపస్సు చెయ్యాలి,'' అన్నాడు వ్యాసుడు.

శుకుడు ఈ వాదనలను ఆమోదించక, సంసారాన్ని నిందిస్తూ ఇలా అన్నాడు:

''ఇల్లు ఉరితాడు. డబ్బు లేకపోతే అయినవారి మధ్య అవమానం, డబ్బు సంపాదనకు ఎన్నో పాట్లు! మూడు లోకాలూ ఏలే ఇంద్రుడి కన్న సన్యాసి సుఖి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మాత్రం సుఖం ఎక్కడ ఉన్నది? ఏ దానవుణ్ణి ఎలా చంపాలా అన్న చింతే గదా వారికి? ఈ లోకంలో బీదవాడికే కాదు, ధనికుడికి కూడా సుఖం లేదు. నాకు విజ్ఞానాశ్రయమైన మార్గం చెప్పు.''

తన కొడుకు బుద్ధి వైరాగ్యంలోనే ఉన్నదని గ్రహించి వ్యాసుడు, ''నాయనా, ఒకప్పుడు నేను ముక్తినియ్యగల దేవీ భాగవతం రచించాను. దాన్ని చదివి, జ్ఞానివికా,'' అంటూ ఇలా చెప్పాడు:

విష్ణువు మర్రిఆకు మీద పిల్లవాడుగా ఉండి, ''నేనిక్కడ పిల్లవాడి రూపంలో ఎందుకున్నాను? నన్ను ఎవరు సృష్టించారు? ఈ విషయాలు నాకు ఎలా తెలుస్తాయి?'' అని విచారిస్తూంటే, అతన్ని చూసి జాలిపడి దేవి అతనికి సగం శ్లోకం చెప్పి, ''ఇదే సమస్తమూనూ. దీన్ని తెలుసుకుంటే నన్నెరిగినట్టే,'' అన్నది.

విష్ణువు ఆ సగం శ్లోకాన్ని విన్నాడు గాని, అర్థం చేసుకోలేకపోయాడు. అతను ఇలా ఆలోచించాడు: ''దీన్ని నాకిచ్చిన వారెవరు? ఆడదా? మగవాడా? ఏదీ కాదా?''



అతను ఆ సగం శ్లోకాన్ని పఠించ సాగాడు. అంతలో మహాదేవి నాలుగు చేతులలో శంఖ, చక్ర, గదాదులు ధరించి, మేలిమి బంగారు బట్టలు కట్టి, తనలాటి వారే అయిన శక్తులను వెంటబెట్టుకుని విష్ణువు ఎదట ప్రత్యక్షమయింది.

విష్ణువు ఆమెను చూసి దిగ్భ్రాంతుడై ఏమీ అనలేకపోయాడు. అప్పుడామె అతనితో, "మాయ మూలంగా నన్ను మరచావు. ఇప్పుడు నువు సగుణుడివి. నేను సత్త్వశక్తిని. నీ బొడ్డు కమలంలో బ్రహ్మపుట్టి, రజోగుణం గలవాడై అన్ని లోకాలూ సృష్టి చేస్తాడు. అతను చేసిన సృష్టికి నువు పాలకుడవుగా ఉంటావు. ఆ బ్రహ్మదేవుడి కనుబొమల మధ్యనుంచి, క్రోధవశాన రుద్రుడు పుట్టుకొస్తాడు. ఆ రుద్రుడు తీవ్రమైన తపస్సుచేసి, దాని మూలంగా తామసగుణం కలిగినవాడై, ప్రళయకాలంలో, బ్రహ్మ సృష్టించిన ప్రపంచాన్ని నాశనం చేస్తాడు. నువు నా సహాయంతోనే ప్రపంచాన్ని పోషించ వలసినవాడివి కనక సత్త్వశక్తినైన నన్ను గ్రహించు. నేను ఎల్లప్పుడూ నీ వక్ష స్థలంలోనే ఉంటాను," అన్నది.

ఆమెతో విష్ణువు, "నాకు ఒక అర శ్లోకం వినబడింది. దాన్ని నేను ఎలా విన్నానో నువు చెప్పు," అన్నాడు.

"నన్ను సగుణగా నువు చూస్తున్నావు. నీ కా అర్ధశ్లోకం చెప్పినది నిర్గుణస్వరూపి అయిన పరదేవత. ఇది భాగవతమనే పేరు గల మంత్రం. ఆ పరదేవత నీకీ మంత్రం చెప్పింది. దీన్ని విడవకుండా పఠించితే శుభాలు కలుగుతాయి," అన్నదామె.

విష్ణువు ఆ మంత్ర బలంతోనే మధు కైటభులను చంపి, వారికి భయపడి తనకు శరణుజొచ్చిన బ్రహ్మకు దాన్ని ఉపదేశించాడు. బ్రహ్మ నారదుడికీ, నారదుడు వ్యాసుడికీ ఉపదేశించారు.

వ్యాసుడు దాన్ని శుకుడికి ఉపదేశించి, "దీన్నే నేను అనేక సంహితలుగా విస్తరించి రచించాను," అన్నాడు.



శుకుడు ఆ మంత్రాన్ని పఠించుతూ ఆశ్రమంలో ఉండిపోయాడు. అయితే శుకుడు చాలా విచారంగా ఉండటం చూసి వ్యాసుడు, "నా కొడుకువైయుండి విజ్ఞానం కోసం ఇంత విచారం దేనికి? నా మాటలు నీకు నచ్చకపోతే ఇంకొక పని చెయ్యి. మిథిలానగరంలో జనకుడు అనే రాజున్నాడు. అతను 'పరమ శాంతుడూ, గొప్పజ్ఞానీనూ. అతన్ని అడిగి నీ సందేహాలన్నీ తీర్చుకో,'' అన్నాడు.

''రాజరికానికీ, జ్ఞానానికీ ఏమైనా సంబంధం ఉన్నదా? రాజ్యపాలన అన్ని పాపాలకూ మూలం గద! అలాటప్పుడు ఈ జనకుడు ఎలా జ్ఞాని అయినాడో చూడాలని ఉన్నది. వెళ్ళివస్తాను,'' అన్నాడు శుకుడు.

''వెళ్ళిరా, నాయనా! నా ప్రాణాలన్నీ నీ మీదనే ఉన్నాయి. నీ సంశయాలు తీర్చుకుని, వెంటనే తిరిగి వచ్చెయ్యి,'' అని వ్యాసుడు తన కొడుకును సాగనంపాడు.

మిథిలలో శుకుడు

శుకుడు తండ్రికి నమస్కరించి, సెలవు పుచ్చుకుని, దారిలో తగిలిన అనేకదేశాలూ, అరణ్యాలూ, పర్వతాలూ, క్షేత్రాలూ, మునుల ఆశ్రమాలూ చూస్తూ మేరుపర్వత ప్రాంతాన్ని రెండేళ్ళలో దాటి హిమాలయ ప్రాంతాన్ని ఏడాదిలో దాటి, మిథిలానగరం చేరి, అక్కడ వింతలు చూస్తూండగా ద్వారపాలకు డొకడు, ''నువ్వెవరు? ఏం పనిమీదపోతున్నావు?" అని అడిగాడు.

శుకుడు వాడికి ఏ సమాధానమూ చెప్పక, నగరద్వారం వెలపల రాయిలాగా కూర్చున్నాడు.

''మాటా పలుకూ లేకుండా లోపలికి వెళ్ళటానికి అనుమతి అవసరం లేదనుకున్నావా? వేదాలు చదివిన బ్రాహ్మణుడిలాగా కనబడుతున్నావు. నీ కులగోత్రాలూ, ఎక్కడినుంచి వస్తున్నదీ రాజుతో నీకు గలపని ఏమిటో చెప్పకుండా లోపలికి

పోవటానికి వీల్లేదు,'' అని ద్వారపాలకుడు మళ్ళీ అన్నాడు.

దానికి శుకుడు, ''నేను రాజుతో ఏం పని ఉండి వచ్చానో, ఆ పనిని ద్వారం దగ్గిర నువే తీర్చావు, ఇంక విచారం దేనికీ? నేను ఏ కష్టాలనూ లక్ష్యపెట్టక, మేరుపర్వతం దాటి, హిమాలయం దాటి, ఈ రాజును చూడాలన్న దురాశతో రావటం నాదే తప్పు! సాధారణంగా డబ్బుకోసం మనుషులు దేశాల వెంట తిరుగుతారు. ధనాశలేకపోయినా, నాకర్మ కొద్దీ నేను దేశాలన్నీ తిరిగాను. ఎక్కడి మేరుపర్వతం? ఎక్కడి మిథిల? కాలి నడకన ఇంత దూరం వచ్చానంటే అది నా ప్రారబ్ధమే తప్ప, ఫలితం ఏమైనా ఉన్నదా? నేను పడ్డశ్రమకు ఫలిత మేమిటీ అంటే, ఎవడో సేవకుడు నగర ద్వారం దాటి లోపలికి పోకుండా అడ్డ పడ్డాడు!'' అన్నాడు.



ఇతనెవరో గొప్పవాడని ద్వారపాలకుడికి తెలిసింది. వాడు శుకుణ్ణి సమీపించి, వినయంగా, ''అడ్డుపెట్టి నందుకు నన్ను క్షమించి, లోపలికి వెళ్ళండి. మిమ్మల్ని అడ్డగల వారెవరు?'' అన్నాడు.

''నీ విధి నువు నెరవేర్చితే అది తప్పు ఎలా అవుతుంది? నీదేమున్నది? రాజు నిన్నుఅలా ఆజ్ఞాపించాడు. నిజానికి రాజుదీ తప్పుకాదు. ఆలోచించకుండా ఇక్కడికి వచ్చిన నాదే తప్పు.'' అన్నాడు శుకుడు.

ద్వారపాలకుడు అతన్ని లోపలికి వెళ్ళ మన్నాడు. శుకుడు లోపలికి వెళ్ళి రాజ మందిరం చేరేసరికి, అక్కడి ద్వార పాలకుడు అడ్డపడ్డాడు. శుకుడు శిలలాగా అక్కడే నిలబడి వుండగా, అటుగా ఒక మంత్రి వచ్చి, శుకుడికి నమస్కారం చేసి, అతన్ని తీసుకుపోయి, అందమైన రాజోద్యానంలో అతిథిసత్కారాలు జరిపి, అన్ని కళలలోనూ అసాధారణ ప్రజ్ఞగలిగి, అప్సరలను మించే అందగత్తెలైన భోగ స్త్రీలను శుకుడికి పరిచర్యలు చేయటానికి ఏర్పాటుచేసి, వెళ్ళిపోయాడు.



అతనికోసం నియోగించబడిన వేశ్యలు అతనికి రకరకాల భక్ష్యభోజనాలు ఇచ్చి, అతన్ని సంతోషపెడుతూ, అతని అంద చందాలు చూసి మోహించి, తమ మోహాన్ని సూచించారు. కాని శుకుడు ఏమీ చలించలేదు. అతను ఇంద్రియా లను జయించినవాడని గ్రహించి, ఆ స్త్రీలు అతనికి మామూలుసేవలు చేస్తూ, రాత్రి అతను సుఖంగా పడుకోవటానికి పడక అమర్చారు.

శుకుడు ఆ రాత్రి నిద్రపోయి, తెల్లవారు ఝామునేలేచి, తెల్లవారేదాకా ధ్యానంలో ఉండి, కాలకృత్యాలు తీర్చుకుని, మళ్ళీ తపస్సమాధిలోకి వెళ్ళిపోయాడు.

శుక—జనక సంవాదం

జనకుడు శుకుడు వచ్చిన సంగతి తెలిసి, తన పురోహితుణ్ణి వెంట బెట్టుకుని వచ్చి, శుకుడికి అర్ఘ్యం ఇచ్చి, కుశల ప్రశ్నలుచేసి, ఒక గోవును ఇచ్చి గౌర వించాడు.

జనకుడు శుకుడి రాకకు కారణం అడి గాడు. దానికి శుకుడు, ''రాజా, మా తండ్రి వ్యాసుడు నాకు ఉపనయంచేసి, నన్ను పెళ్లి చేసుకోమన్నాడు. నేను సంసార బంధాలకు భయపడి చేసుకోనన్నాను. ధర్మార్థ కామ మోక్షాలు సాధించటానికి గృహస్థాశ్రమం ఉత్తమ మార్గం అని ఆయన అంటే నేను ఒప్పుకోలేదు. మిథిలానగరం వెళ్లి, జనకమహారాజు ద్వారా నీ అనుమానం తీర్చుకో అని ఆయనన్నాడు. నేను మోక్షం కోరు తున్నాను. నా కేది కర్తవ్యం? '' అన్నాడు.

దానికి జనకుడు ఇలా చెప్పాడు :

''మోక్షం కోరినవాడు మొదట ఉపనయం చేసుకుని, వేదం చదివి, గురుదక్షిణ చెల్లించి, గురువు ఆనతిపొంది భార్యను పెళ్ళాడి, ఆచారనియమాలను పాటిస్తూ, కర్మలు చేస్తూ, సంసారం చెయ్యాలి, కొడుకులనూ, మనమలనూ కనాలి, తరవాత అడవులకుపోయి, వానప్రస్థం జరుపుతూ, కామక్రోధాదులను

జయించి, అగ్నులను తనలోనే ఆవహింప జేసి, వైరాగ్యం అవలంబించి, భార్యను వదిలేసి సన్యాసం స్వీకరించాలి. అంతే గాని ఆరంభంలోనే సన్యాసం తీసుకోవటం అసందర్భం. పూర్తి వైరాగ్యం కలిగినాకనే సన్యాసం పుచ్చుకోవాలి. నలభైఎనిమిది సంస్కృతులున్నాయి. అందులో నలభై గృహస్థుడివి, ఎనిమిది సన్యాసివి.''

''రాజా, మనసులో వైరాగ్యం నెల కొన్నప్పుడు సన్యాసం పుచ్చుకోవటంలో తప్పేమిటి?'' అని శుకుడు అడిగాడు.

''నాయనా, ఇంద్రియాలు జయించ రానివి. ఎంత గొప్ప పండితుడు కూడా వాటికి లొంగిపోకతప్పదు. ఇక మామూలు మనుషుల సంగతి చెప్పేదేమిటి? అడు గడుగునా మనిషికి వికారాలే—తిండి కోరిక, నిద్రకోరిక, సుఖాలకోరిక, పుత్ర కాంక్ష ఇవన్నీ సన్యాసికి ఎలా తీరుతాయి? కోరికలను అదుపులో ఉంచేదెలా? అందు కనే అన్ని భోగాలనూ అనుభవించి తర వాత వదిలెయ్యాలి. అంతేగాని ముందు గానే వదిలెయ్యటం ఎలా? ఎత్తున పడు కున్నవాడు పడిపోక తప్పదు గదా! ఎవడైనా సన్యసించి, వైరాగ్యం అవలం బించలేక, భోగాలమీద ఆసక్తి కలవాడైతే వాడికి నరకప్రాప్తే. జ్ఞానం క్రమంగా సంపాదించి తరవాత సన్యసించాలి. మనస్సు ఒకంతట లొంగిరాదు. దాన్ని నింపాదిగా సరి అయిన మార్గానికి తీసుకు రావాలి. గృహస్థుడుగా ఉంటూనే, శాంతం అవలంబించి, లాభంవస్తే పొంగి పోవటమూ, నష్టం కలిగితే కుంగి పోవటమూ లేకుండా, త్యాగమయమైన జీవితం గడిపే వాడికి చివరకు మోక్షం కలుగుతుంది. నన్ను చూడు. నేను ఎన్ని భోగాలైనా అనుభవిస్తున్నాను. ప్రజలు మెచ్చేటట్టు రాజ్యం చేస్తున్నాను. యథే చ్ఛగా జీవిస్తున్నాను. ఐనా మనస్సును అతి నిర్మలంగా ఉంచుకుంటున్నాను. చచ్చి మోక్షం పొందుతాను. నువు కూడా అలాగే జీవించవచ్చు గద!'' అంటూ జనకుడు శుకుడికి ఉపదేశం చేశాడు.





# దేవీ భాగవతం

శుకుడు జనకుడు చెప్పినది విని, "నువు చెప్పినది సంతోషంతో విన్నాను గాని నా సందేహం తీరలేదు. పెళ్ళాడిన తరవాత పెళ్లాంతో సుఖపడితే అందులో చిక్కుకుపోతాడు. సుఖం లభించకపోతే ఖిన్నుడౌతాడు. అలాటివాడు మోక్షం ఎలా పొందుతాడు?" అని అడిగాడు.

"నిర్లిప్తంగా చేసే కర్మలు చెడ్డవే అయినా మంచివి అవుతాయి," అన్నాడు జనకుడు.

"మాయలో చిక్కుకున్న వాడు నిర్లిప్తుడు ఎలా అవుతాడు? దీపం పేరు చెప్పిన మాత్రాన చీకటి పోదుగదా! అలాగే శాస్త్రజ్ఞానం సంపాదించిన మాత్రాన మనిషిలోవున్న అజ్ఞానం తొలగుతుందా? ఆచరణానుభవం ఉండవద్దా? నీలో ధన వాంఛా, పుత్రవాంఛా, స్త్రీ వాంఛా, రాజ్య వాంఛా ఉన్నాయి. నువు జీవన్ముక్తుడివి ఎలా అవుతావు? రాజుగా నువు దుష్ట శిక్షణా, శిష్ట రక్షణా చేయక తప్పదు గద! ఈ భేదాలు పాటించే నీకు మోక్షం వస్తుందని ఎలా నమ్మటం? నేనంటే, నాకు ఏమీ లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు, శత్రువు లేదు, మిత్రుడు లేదు, మానం లేదు, అవమానం లేదు, ఏలటానికి ఒక చిన్న పల్లె కూడా లేదు. నా వంటి వాడికే గదా జీవన్ముక్తి?" అని శుకుడు అడిగాడు.

"సన్యసించి, అరణ్యంలోకి పోయినంతమాత్రాన విచారాలు తప్పుతాయనుకో

5. మత్స్యగంధి జననం



వద్దు. మమకారం వదిలి ఏ మార్గం అవలంబించినా మోక్షం పొందవచ్చు. మమకారం వదలకపోతే ఏ మార్గం అవలంబించి కూడా ముక్తి రాదు,'' అన్నాడు జనకుడు.

శుకుడు తృప్తిపడి, తండ్రి వద్దకు తిరిగి వెళ్ళాడు.

''నాయనా, జనకుడు నీ సందేహం తీర్చాడా ?'' అని వ్యాసుడు శుకుణ్ణి అడిగాడు.

''ఆ జనకుడిలాగా ఉండటానికి నాకు అభ్యంతరం లేదు,'' అన్నాడు శుకుడు.

ఈ మాట విని వ్యాసుడు సంతోషించి, పీవరి అనే కన్యను తెచ్చి శుకుడికి పెళ్లి చేశాడు. శుకుడు నిర్లిప్తత విడవకుండా ఆమెతో కాపరం చేస్తూ, గౌరప్రభుడూ, దేవశ్రుతుడూ, భూరీ, కృష్ణుడూ అనే నలుగురు కొడుకులనూ, వారి తరవాత కీర్తి అనే కుమార్తెనూ కన్నాడు. కీర్తి అణుహుడు అనేవాణ్ణి, విభ్రాజుడి కొడుకును, పెళ్లాడి బ్రహ్మదత్తుణ్ణి కన్నది.

బ్రహ్మదత్తుడు రాజై, పరిపాలన చేస్తూండగా, ఒకసారి నారదుడు కనిపించి మాయా బీజోపదేశం చేశాడు. దానితో బ్రహ్మదత్తుడికి జ్ఞానోదయమూ, వైరాగ్యమూ కలిగి, రాజ్య భారాన్ని తన కొడుకు మీద పెట్టి, బదరికాశ్రమానికి వెళ్ళిపోయాడు.

శుకుడు కూడా తండ్రిని వదిలిపెట్టి కైలాస శిఖరానికి వెళ్లి, అక్కడ కొంత కాలం ధ్యానంలో గడిపి, తరవాత ఆ కొంత శిఖరం మీదినుంచి దూకి, సిద్ధి పొందాడు.

కొడుకు పోయినందుకు వ్యాసుడు చాలా బాధపడి, అక్కడ ఉండలేక, ''అయ్యో, పుత్రా!'' అని కేకలు పెట్టుతూ కైలాసానికి వెళ్ళాడు. అంతటా నిండి ఉన్న శుకుడు ప్రతిధ్వని రూపంలో తండ్రికి జవాబిచ్చాడు.

అలా శోకిస్తున్న వ్యాసుడి వద్దకు శివుడు వచ్చి, ''నీ కొడుకు యోగులకు కూడా

లభ్యంగాని మోక్షం పొందాడు. అతని కోసం శోకించటం భావ్యమా?'' అన్నాడు.

''కొడుకును చూడక నా కళ్ళు చల్లగా ఉండవు. మనస్సు చిన్నబోయింది. నేనేం చేసేది?'' అన్నాడు వ్యాసుడు.

వ్యాసుడి విచారం తీరేది కాదని గ్రహించి శివుడు, ''నీ కొడుకు ఎల్లప్పుడూ నీడలాగా నీ వెంటే ఉంటాడు,'' అని వరమిచ్చి వెళ్ళిపోయాడు.

తరవాత వ్యాసుడు తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

శౌనకాది మునులు శుకుడి కథ విని, ''తరవాత వ్యాసుడు ఏం చేశాడు?'' అని సూతుణ్ణి అడిగారు.

సూతుడు ఇలా చెప్పాడు:

### ధృతరాష్ట్రాదుల జననం

వ్యాసుడి శిష్యులైన దేవలుడూ, వైశంపాయనుడూ, జైమినీ, అసితుడూ, సుమంతుడూ అంతకు పూర్వమే గురువుగారి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. ఇప్పుడు శుకుడు కూడా పోయాడు. వ్యాసుడు కూడా ఎక్కడైనా వెళ్ళిపోదామనుకుని, తన తల్లి అయిన సత్యవతి జ్ఞాపకం రాగా, ఆశ్రమం విడిచిపెట్టి, తాను పుట్టిన చోటికి వెళ్ళి, అక్కడి నిషాదులను కలుసుకుని, తన తల్లి గురించి అడిగాడు. వాళ్ళు వ్యాసుడికి



శంతనుడు సత్యవతిని పెళ్ళాడి తీసుకుపోయిన సంగతి చెప్పారు.

వ్యాసుడు ఆ సమీపంలోనే సరస్వతీ నదీ తీరాన ఆశ్రమం ఏర్పరచుకుని తపస్సు చేసుకుంటూ ఉండిపోయాడు.

ఇలా ఉండగా, శంతనుడు సత్యవతి వల్ల చిత్రాంగద విచిత్రవీర్యులనే కొడుకులను కని, కొంతకాలానికి చనిపోయాడు. శంతనుడి పెద్ద కొడుకైన భీష్ముడు తండ్రికి ఉత్తర క్రియలు జరిపి తండ్రిస్థానంలో తాను రాజ్యం చెయ్యటం ఇష్టంలేక, చిత్రాంగదుడికి పట్టంకట్టాడు.

చిత్రాంగదుడు ఒకసారి వేటకు అరణ్యానికి వెళ్ళితే, అక్కడ అతనికి తన పేరే



గల గంధర్వుడితో పోరాటం జరిగింది. ఆ యుద్ధంలో గంధర్వుడైన చిత్రాంగదుడు, భీష్ముడి తమ్ముడైన చిత్రాంగదుణ్ణి చంపేశాడు.

తరవాత భీష్ముడు తమ్ముడికి ఉత్తర క్రియలు చేసి, విచిత్రవీర్యుడికి పట్టం కట్టాడు. దీనికి వ్యాసుడు కూడా సమ్మతించాడు. విచిత్రవీర్యుడు యుక్త వయస్కుడయాడు. భీష్ముడు అతనికి పెళ్ళి చేసే ఆలోచనలో ఉన్నాడు.

ఆ సమయంలో కాశీరాజు తన కుమార్తెలకు స్వయంవరం ఏర్పాటు చేసి, రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. భీష్ముడు ఆ స్వయంవరానికి వెళ్ళి, మిగిలిన రాజులందరినీ ఓడించి, కాశీరాజు కూతుళ్ళు అంబా, అంబికా, అంబాలికా అనే వాళ్లను తన రథం మీద ఎక్కించుకుని, ఇంటికి వచ్చి, వారిని తన తల్లికి చూపి, వారిని విచిత్రవీర్యుడికి పెళ్ళి చెయ్యటానికి ముహూర్తం కూడా నిర్ణయించాడు.

అప్పుడు అంబ అనే పిల్ల, సిగ్గుతో తలవంచుకుని, భీష్ముడితో, "నేనూ, సాల్వుడూ పరస్పరం ప్రేమించుకున్నాం. నువేమో బలంకొద్దీ నన్ను తెచ్చావు. నీ అధీనంలోకి వచ్చిన నన్ను ఆ రాజు ఏలుకుంటాడా?" అన్నది.

భీష్ముడు పెద్దలతోనూ, తల్లితోనూ, మంత్రులతోనూ సంప్రతించి, అంబను స్వేచ్ఛగా పంపేశాడు. ఆమె సాల్వుడి వద్దకు వెళ్ళి, "నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పేసరికి, భీష్ముడు నన్ను పంపేశాడు. నన్ను నువు న్యాయంగా పెళ్ళిచేసుకో," అన్నది.

"నేను చూస్తూండగా భీష్ముడు నిన్ను తాకాడు. మరెవడో తీసుకుపోయి, వదిలేసిన దాన్ని ఎవడైనా పెళ్ళాడుతాడా? ఎలా వచ్చావో అలాగే తిరిగిపో," అన్నాడు సాల్వుడు.

"అయ్యో, ఎందుకూ కాకుండా పోయాను!" అని విలపిస్తూ, అంబ భీష్ముడి వద్దకు తిరిగివచ్చి, "సాల్వుడు

నన్ను నిరాకరించాడు. నేను ఎటూ కాకుండా చెడ్డాను. నన్ను పెళ్ళాడు," అని వేడుకున్నది.

"మరొకరిని ప్రేమించినదాన్ని పెళ్లాడ రాదు. నీ తండ్రి వద్దకు వెళ్లు," అన్నాడు భీష్ముడు.

అంబ తండ్రి వద్దకు పోక, అరణ్యంలో తపస్సు చేసుకోబోయింది. భీష్ముడు మిగిలిన ఇద్దరు కన్యలనూ విచిత్ర వీర్యుడి కిచ్చి పెళ్లి చేశాడు. విచిత్ర వీర్యుడు ఆ భార్యలతో క్రీడిస్తూ, తొమ్మి దేళ్లు రాజ్యం చేసి, క్షయవ్యాధితో చని పోయాడు. తన రెండో కొడుకు కూడా పోయి



నందుకు సత్యవతి దుఃఖించి, భీష్మణ్ణి పిలిచి, ఒంటరిగా అతనితో, "నువు కూడా శంతనుడి కొడుకువే గనక, రాజ్యం చేపట్టి, నాకు పిల్లలు లేని కొరత తీర్చు. పిల్లలు లేకపోతే వంశం నశిస్తుంది. అంబికా, అంబాలికలయందు కొడుకు లను కను. అది ధర్మమేగద!" అన్నది.

"రాజ్యం చెయ్యననీ, పెళ్ళాడననీ శపథం చేశాను గద. సత్కులానికి చెందిన బ్రాహ్మణుడి ద్వారా పిల్లలను కని వంశం నిలపటం కూడా ధర్మమే." అన్నాడు భీష్ముడు.

భీష్ముడు ఇలా అనగానే సత్యవతి వ్యాసుణ్ణి తలచుకున్నది. వెంటనే వ్యాసుడు వచ్చాడు. భీష్ముడు ఆయనకు తగిన మర్యాదలు చేశాడు.

సత్యవతి వ్యాసుడితో, "నీ తమ్ముడి భార్యయందు కొడుకును కని, వంశం నిలబెట్టు." అన్నది.

వ్యాసుడు తల్లి ఆజ్ఞ ప్రకారం అంబికకు ఒక కొడుకును కన్నాడు. కాని ఆ పిల్ల వాడు గుడ్డివాడు కావటంచేత రాజ్యార్హత గలవాడు కాడు. అది చూసి సత్యవతి తన రెండవ కోడలైన అంబాలిక చేత వ్యాసుడికి ఒక కొడుకును కనిపించింది. ఆ బిడ్డ పాండురోగి, రాజ్యార్హుడు కాడు. అప్పుడు సత్యవతి అంబికను మరొకసారి కొడుకును కనమన్నది. అంబిక తన



అత్తకు ఎదురు చెప్పలేక సరేనని, రహస్యంగా తన దాసిని వ్యాసుడి వద్దకు పంపింది. ఆ దాసికి వ్యాసుడి వల్ల విదురుడు పుట్టాడు. అతను మళ్ళీ వ్యాసుడంతటివాడు.

ఈ విధంగా భరతవంశాన్ని నిలబెట్టటానికి వ్యాసుడి వల్ల ధృతరాష్ట్రుడూ, పాండురాజూ, విదురుడూ పుట్టారు.

మునులు సూతుడికి అడ్డు వచ్చి, "మహానుభావా, సత్యవతికీ, శంతనుడికీ వివాహం ఎలా అయింది? అసలు అంతకు ముందే ఆమెకు వ్యాసుడు ఎలా జన్మించాడు. ఈ విషయాలు వివరంగా చెప్పు," అన్నారు.

మునులు అడిగిన దానికి సూతుడు ఇలా చెప్పాడు:

ఉపరిచరవసువు చేదిదేశాన్ని పాలించేవాడు. అతను గొప్ప తేజో బల పరాక్రమాలు గలవాడు; ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేసి మెప్పించి, ఇంద్రుడి నుంచి దివ్యవిమానం పుచ్చుకున్నాడు. అతను అస్తమానమూ ఆ విమానం మీద ఆకాశంలో తిరుగుతూండటం చేతనే "ఉపరిచరుడు" అనే పేరు వచ్చింది.

ఉపరిచరవసువు భార్య గిరిక చాలా చక్కనిది. ఆమె పరిచర్యలు చేస్తూంటే అతను దేవేంద్ర భోగాలు అనుభవిస్తూ, బల సంపన్నులైన తన అయిదుగురు కొడుకులనూ అయిదు దేశాలకు రాజులను చేశాడు.

ఒకసారి గిరిక ఋతుస్నానం చేసి, భర్త సాంగత్యం కొరకు ఎదురు చూస్తూ వున్న సమయంలో, వసువును అతని తండ్రి పిలిచి, "నాయనా, నీ తాతగారికి తద్దినం పెట్టాలి. నువు వెంటనే వెళ్ళి ఏదన్నా జంతువును వేటాడి తీసుకురా," అన్నాడు.

భార్య కోరిక తీర్చాలో, తండ్రి ఆజ్ఞ పాలించాలో తేల్చుకోలేక కొంతసేపు మథనపడి, తండ్రిమాట ప్రకారమే అతను వేటకు వెళ్ళాడు.

అయితే అతని మనసు భార్య మీదనే ఉన్న ఫలితంగా, బ్రాహ్మణ శాపంవల్ల యమునలో చేపగా జీవిస్తున్న అద్రిక అనే అప్సర గర్భం ధరించింది.

మునులు మళ్ళీ సూతుడికి అడ్డువచ్చి, అద్రికకు శాపం ఎందుకు వచ్చిందని అడిగారు. దానికి సూతుడు ఇలా చెప్పాడు:

మత్స్యగంధి జననం

ఒకసారి ఒక బ్రాహ్మణుడు యమునలో దిగి సంధ్యావందనం చేసుకుంటూ వుండగా, అద్రిక అనే అప్సర యమునలో స్నానం చేయవచ్చి, నీటిలో మునిగి ఆ బ్రాహ్మణ్ణి సమీపించి, హాస్యం కోసం అతని కాళ్ళు పట్టిలాగింది.

బ్రాహ్మణుడు మండిపోయి, చేపవై నీటిలోపడి ఉండమని ఆమెను శపించాడు. ఆమె అతని కాళ్ళు పట్టుకుని వలవలా ఏడ్చింది. బ్రాహ్మణుడు జాలిపడి, "కొంత కాలానికి నీ కడుపున ఒక కొడుకూ, కూతురూ పుట్టుతారు. అప్పుడు నీకు నీ అసలురూపం వచ్చేస్తుంది." అని శాపవిమోచనం చెప్పి వెళ్ళిపోయాడు. అది మొదలు ఆమె యమునానదిలో చేపగా జీవిస్తున్నది.

వసువు కారణంగా ఆ చేప గర్భం ధరించి, కొంత కాలానికి బెస్తవాడి వలలో పడింది. వాడు చేపను కోసేసరికి దాని కడుపులో ఒక పిల్లా, పిల్లవాడూ కనిపించారు. వాడు ఆ పిల్లలను తీసుకుపోయి వసువుకు చూపాడు. వసువు ఆశ్చర్యపడి, చేపకడుపులో పుట్టిన బాలుణ్ణి తాను తీసుకుని, పిల్లను బెస్తవాడికే ఇచ్చేశాడు. ఆమె కాలికా, మత్స్యోదరీ, మత్స్యగంధీ అనే మూడు పేర్లతో పిలవబడుతూ బెస్తవాడి వద్ద పెరిగింది.

కుర్రవాడు మత్స్యుడు అనే పేరుతో ఉపరిచరవసువు ఇంట పెరుగుతూ వచ్చాడు.

చేపరూపంపోగానే అద్రిక శాపవిముక్తి పొంది, అప్సరగా మారి తన లోకానికి వెళ్ళిపోయింది.






మత్స్యగంధి బెస్తవాడి ఇంట పెరిగి పెద్దదై, చాలా ఆకర్షవంతంగా తయారయింది.

ఒకనాడు పరాశరు డనే ముని యమున వద్దకు వచ్చి, నది దాటించమని బెస్తవాణ్ణి కేక వేశాడు. అతను ఆ సమయానికి అన్నం తింటూ, మునిని నది దాటించమని తన కూతుర్ని పంపాడు. ఆమె పడవలోకి పరాశరుణ్ణి ఎక్కించుకుని నదిని దాట సాగింది.

పడవలో తనతో ఉన్న మత్స్యగంధిని చూసి పరాశరుడికి మోహం పుట్టుకొచ్చి, మెల్లిగా ఆమె చేతిని తన చేత్తో తాకాడు. మత్స్యగంధి తన చెయ్యి తీసేసుకుంటూ, నవ్వి, "మీ వంటి వారు నా వంటిదాన్ని తాకవచ్చునా?" అన్నది. పరాశరుడు వసిష్ఠుడి మనవడు; తాను బెస్తవాడి కూతురు. తన వద్ద చేపల కంపు. అలాటి వాడు తనను కామిస్తే తోటి రుషులందరూ నవ్వరా?

ఇలా మత్స్యగంధి ఎన్నో విధాలుగా చెబుతున్నప్పటికీ పరాశరుడు విననట్టు నటిస్తూ, ఆమె చేతిని మళ్ళీ పట్టుకున్నాడు. అతను మోహావేశంలో ఉండి తన మాట వినిపించుకోడనీ, అలాటివారు నీతీ, జాతీ కూడా పాటించరనీ, అతన్ని నిగ్రహించటం సాధ్యంకాదనీ గ్రహించి మత్స్యగంధి, పరాశరుణ్ణి చాలా కోరికలు కోరింది: తన కన్యాత్వం చెడకూడదనీ, తన శరీర దుర్గంధం పోవాలనీ, తాను పరాశరుడితో

6. వ్యాసుడి జననం



కూడి ఉండగా ఎవరూ చూడరాదనీ, తనకు కలిగే కొడుకు పరాశరుడికి తీసిపోనివాడుగా ఉండాలనీ, ఆమె నియమాలు పెట్టింది. పరాశరుడు ఆమె కోరికలన్నీ తీర్చాడు. ఆమె శరీరం సువాసనలు వెదజల్లేటట్టు చేశాడు. తమ చుట్టూ దట్టమైన మంచు కల్పించాడు. ఆమెకు గర్భోత్పత్తి కలిగించి తన దారిన తాను వెళ్ళిపోయాడు. ఆమెకు సద్యోగర్భం కలిగి, వెంటనే ఒక కుమారుడు పుట్టి, "అమ్మా, నేను పోయి తపస్సు చేసుకుంటాను. నువు ఎప్పుడు తలచుకుంటే అప్పుడు యిక్కడికి వస్తాను." అని వెళ్ళిపోయాడు.

అతనే వ్యాసుడు, వేదాలను విభజించి వ్యాసుడయాడు. అసలు పేరు ద్వైపాయనుడు. అతను పద్దెనిమిది పురాణాలూ రాసి, తన శిష్యులకు చెప్పాడు. ఆ శిష్యులలో సుమంతుడూ, జైమినీ, పైలుడూ, వైశంపాయనుడూ, అసితుడూ, దేవలుడూ మొదలైనవారున్నారు. వీరితోబాటు శుకుడు కూడా ఉన్నాడు.

తరవాత బెస్తవాడి కూతురు సత్యవతి అనే పేరుతో తన తండ్రి ఇంట కొంతకాలం ఉన్న అనంతరం శంతనుడు అనే రాజు ఆమెను పెళ్ళాడి, ఆమె వల్ల బిడ్డలను కన్నాడు.

సూతుడిలా అనగానే మునులు, "మహానుభావా, సత్యవతీ, వ్యాసుడూ పుట్టిన విధం చెప్పి మాకు ఆనందం కలిగించావు. కాని శంతనుడు పురువంశంలో పుట్టిన గొప్ప రాజుకదా, తక్కువ కులానికి చెందినదాన్ని ఎలా పెళ్లాడాడు? అతనికి అంతకు ముందు భార్య లేదా? భీష్ముడు అతని కొడుకే గదా! ఈ వివరాలన్నీ మాకు చెప్పు." అన్నారు.

దానికి సూతుడు ఇలా చెప్పసాగాడు:

### శంతనుడి కథ

మహాభిషుడనే గొప్పరాజు ఉండేవాడు. అతను ఆనాటి రాజు లందరిలోనూ మేటి. అతను వెయ్యి అశ్వమేధయాగాలు చేసి,

ఇంద్రుణ్ణి మెప్పించి, స్వర్గానికి వెళ్ళి, అక్కడ మరో ఇంద్రుడిలాగా ఉంటూ, ఒకనాడు ఇతర దేవతలతోబాటు బ్రహ్మను చూడటానికి సత్యలోకానికి వెళ్ళాడు. అదే సమయంలో గంగానది కూడా బ్రహ్మను చూడవచ్చి, ఒక పక్కగా నిలబడింది.

అప్పుడు గట్టిగా గాలివీచి, గంగ కట్టుకున్న బట్ట కొంచెం తొలగింది. మిగిలిన దేవతలు మర్యాదగా తమ కళ్లు తిప్పుకున్నారు. కాని మహాభిషుడు మాత్రం సభ్యత ఏ మాత్రమూ పాటించకుండా, గంగ శరీర సౌందర్యంతో మోహావేశుడై, ఆమె కేసి చూస్తూ ఉండిపోయాడు. గంగ కూడా అది గమనించి, మహాభిషుణ్ణి తానుకూడా మోహంతో చూసింది.

ఈ ఇద్దరిమధ్యా పరస్పరాకర్షణ గమనించి బ్రహ్మ కోపించి, "పెద్దల మధ్య అవివేకంగా ప్రవర్తించినందుకు మీరిద్దరూ మానవులుగా పుట్టండి," అని వారిని శపించాడు. శాపం పొందిన విచారంతో వారిద్దరూ అక్కడి నుంచి వెళ్లిపోయారు.

తరవాత మహాభిషుడు ఎవరికొడుకై పుట్టుదామా అని ఆలోచించి, పురు వంశానికి చెందిన ప్రతీపుడనే రాజుకు కొడుకుగా పుట్ట నిశ్చయించాడు.

ఇది ఇలా ఉండగా ఒకసారి వసువులు ఎనిమిది మందీ తమ భార్యలతో సహా



వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళారు. వారిలో ప్రభాసుడు అనే వసువు భార్య, నందిని అనే వసిష్ఠుడి గోవును చూసి, దాన్ని గురించి అడిగింది.

"ఇది వసిష్ఠుడిగోవు. దీనిపేరు నందిని. దీని పాలు కొంచెంతాగితే ముసలితనమూ, చావూ రావంటారు," అన్నాడు ప్రభాసుడు తన భార్యతో.

"అలాగైతే, ఈ గోవును నా స్నేహితురాలైన ఉశీనరరాజు కూతురు జితవతికి ఇస్తే ఆమె చక్కగా ముసలితనమూ, చావూలేకుండా ఉంటుంది. ఈ గోవును నా కోసం తీసుకురా!" అన్నది ప్రభాసుడి భార్య.



భార్యల వ్యామోహంలో పడిన వాడికి వివేకం ఉండదు గదా! ప్రభాసుడు మిగిలిన వసువుల సహాయంతో నందినీ ధేనువును దొంగిలించి తీసుకుపోయాడు.

తరవాత వసిష్ఠుడు తన ఆవు కోసం ఎంతో కష్టపడి వెతికి, చివరకు వసువులు దాన్ని దొంగిలించారని తెలిసి, వారిని మనుషులై పుట్టమని శపించాడు. ఈ సంగతి తెలియగానే వసువులు వసిష్ఠుడి వద్దకు వెళ్లి, శాపవిమోచనం అనుగ్రహించమని వేడుకున్నారు.

వసిష్ఠుడు వాళ్ళమీద కరుణగలిగి, ''భార్యకోసం నా ధేనువును హరించిన పాపాత్ముడు ప్రభాసుడు మనిషిగా దీర్ఘ కాలం బతుకుతూ, బ్రహ్మచారిగా ఉండిపోతాడు. మిగిలిన ఏడుగురూ పుట్టుతూనే తిరిగి మీ రూపాలు పొందుతారు,'' అన్నాడు.

తరవాత వసువులు వసిష్ఠుడి వద్ద నుంచి తిరిగి వస్తూండగా భూలోకానికి పోతున్న గంగ ఎదురయింది. ఒకరి శాపాలు ఒకరికి చెప్పుకున్నాక వసువులు గంగతో, ''తల్లీ, మేం నీ కడుపున పుట్టుతాం. నువు మా యందు అనుగ్రహం ఉంచి, శంతనుడికి భార్యవు కా. అంతేకాదు, పుట్టగానే మమ్మల్ని చంపెయ్యి. అలా చేస్తే మా శాపం త్వరగా తీరిపోతుంది,'' అన్నారు.

గంగ సరేనన్నది. తరవాత ఎవరి దారిన వారు వెళ్లిపోయారు.

తరవాత ఒకనాడు ప్రతీపుడు గంగా తీరాన సూర్యుడికి అర్ఘ్యం ఇస్తూండగా, ఒక నవయువ్వని జంకూ, గొంకూ లేకుండా ఆ రాజును సమీపించి, స్వతంత్రంగా అతని కుడి తొడ మీద కూర్చున్నది. ఆమెను చూసి ప్రతీపుడు, ''అమ్మాయీ, ఎవరు నువు? ఎందుకిలా వచ్చి నా తొడ మీద కూర్చున్నావు?'' అని అడిగాడు.

ఆమె చిరునవ్వు నవ్వి, చిత్రంగా చూస్తూ, ''నేను ఎవతెనైతే నేం? నువు మన్మధుడిలాగున్నావు. నా యౌవనం నీకు

చేసేపని ఎలాటిదైనా సరే, నువు దానికి అభ్యంతరం చెప్ప కూడదు! అదేగాక నాకు అప్రియమైన విధంగా ఎన్నడూ మాట్లాడరాదు. ఇందుకు సమ్మతమైతే నాతో నువు సమస్త సుఖాలూ అనుభవించ వచ్చు. ఈ నియామానికి ఎప్పుడు భంగం కలిగితే అప్పుడే నిన్ను విడిచి వెళ్ళి పోతాను. నన్ను తప్పుపట్టి లాభం లేదు, ముందే చెప్పేస్తున్నాను,'' అన్నది. ఇలా అనేటప్పుడు ఆమె వసువులు తనను కోరిన కోరిక గుర్తుంచుకున్నది.



ఆమె పెట్టిన నియమాలకు శంతనుడు ఒప్పుకున్నాడు. గంగ కూడా చాలా కాలంగా అతని మీద మనస్సు ఉంచినది కావటంచేత, అతని వెంట అతని ఇంటికి వెళ్లి, అతనితో సుఖాలలో మునిగి తేల సాగింది.

శంతనుడికి భార్య అయి గంగ ఏడాది కల్లా ఒక కొడుకును కని, వెంటనే వాణ్ణి నీటిలో పారేసింది. ఇలా ఏడాదికొక వసువు చొప్పున ఏడుగురు వసువులు ఆమె గర్భాన పుట్టి, వెంటనే నీటిలోపడి, శాపవిముక్తులయారు.

ఇది చూసి శంతనుడు చాలా బాధ పడ్డాడు. గంగ ఏడుగురు చక్కని కొడుకులను కని, దయాదాక్షిణ్యాలు లేకుండా చంపేసింది. ఇక ఆమె ద్వారా తన వంశం ఎలా వృద్ధి పొందుతుంది? ఇదేమిటని తాను అన్నాడో, ఆమె తక్షణం తనను విడిచిపెట్టి పోతుంది! నియమం లేని మనిషిని కట్టుకుంటే ఇలా కాక ఏమవుతుంది?

గంగ ఎనిమిదోసారి గర్భవతిగా ఉన్నది. ఏమైనా సరే, ఈసారి పుట్టే బిడ్డను దక్కించుకుని, వంశాంకురంగా నిలపాలని శంతనుడు అనుకున్నాడు. గంగ ఎనిమిదవ బిడ్డను ప్రసవించింది. ఇతనే శాపం తిన్న ప్రభాసుడు. ఈ బిడ్డను కూడా గంగ నీటిలో పడవేయబోయింది.

కాని శంతనుడు ఆమెతో ఎంతో వినయంగా, ''నేను నీకు లోబడి ఉంటు

న్నాను. నా మాట అలక్ష్యం చెయ్యకు. కన్నకొడుకును చంపుకోవటం ఏం న్యాయం? జాలి కూడా లేదా? గొడ్రాలి లాగా, నీకు ఏ ద్రోహమూ చెయ్యని కొడుకును చేతులారా చంపుకుంటావా? నీకు మాట ఇచ్చిన దోషానికి వంశనాశనం ఎలా చేసుకోను? ఏడుగురిని చంపేశావు. వీడినన్నా బతకనియ్యి. ఇంతలో నీకు వ్రతభంగం కాదులే!'' అంటూ, ఎన్నో విధాల చెప్పుకున్నాడు.

కాని గంగ అతని మాటలు వినిపించుకోకుండా తన బిడ్డను చంపటానికి బయలుదేరింది. శంతనుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను ఆమెకు అడ్డం వెళ్ళి, ''ఓసి దుర్మార్గురాలా! నీకు నా మాట లక్ష్యం లేదు! నరకభయం మొదలే లేదు! కన్నకొడుకులను గంగలో కలుపుతావా? ఏ దుష్టుడు నిన్ను కన్నాడు? నువు ఉంటే ఉండు, పోతేపో! నిన్ను మాత్రం ఈ బిడ్డను చంపనియ్యను.'' అన్నాడు.

అప్పుడు గంగ అతనితో, ''ఇచ్చిన మాట తప్పావు. ఇక నీకూ, నాకూ చెల్లు! నువు ఉత్తముడివి. నిన్ను విడిచిపోవటం ధర్మం కాదు. అయితే అందుకు కారణం నీకు చెప్పాలి. నేను మామూలు స్త్రీని కాను, గంగను. ఒక దేవకార్యం నిమిత్తం నిన్ను వరించాను. మునిశాపంవల్ల వసువులు మానవజన్మ ఎత్తవలసిరాగా, నీ ద్వారా నేను వారికి తల్లిని కావటానికి ఒప్పుకున్నాను. వాళ్ళు మానవులుగా ఎంతో కాలం ఉండటానికి ఇష్టపడక, పుట్టిన వెంటనే శాపవిముక్తి కలిగించమని నన్ను వేడుకున్న కారణంగా, నేను పాపానికి ఒడిగట్టి, వారిని పుట్టగానే నీటిలో పారేశాను. ఇప్పుడు పుట్టినవాడు ఎనిమిదో వసువు. వీడు దీర్ఘకాలం బతికి, నీకు కీర్తి తెస్తాడు. వీడు యుక్త వయసు వచ్చేదాకా నా దగ్గిరనే ఉంటాడు. తరవాత నేను వీణ్ణి నీకు అప్పగిస్తాను. ఇందుకు ఒప్పుకో!'' అని, కొడుకును తీసుకుని వెళ్ళిపోయింది.





# దేవీ భాగవతం

తన భార్యనూ, కొడుకునూ కూడా దూరం చేసుకుని, శంతనుడు చాలా బాధపడ్డాడు. అతను ఏదో విధంగా రాజ్యం చేస్తూ, ఒకసారి వేటకు వెళ్లి, గంగను చూసి ఆశ్చర్యపోయాడు. గంగానది పూర్తిగా తీసిపోయి, చిక్క శల్యమైనట్టుగా ఉన్నది. కొద్ది దూరంలో ఒక బాలుడు తన విలువిద్యా చాతుర్యంతో గంగా ప్రవాహానికి అడ్డుగా బాణాలు వేస్తున్నాడు. కుర్రవాడు చాలా ఆకర్షవంతంగా ఉన్నాడు.

శంతనుడు అతన్ని చూసి, వాడు తన కొడుకైతే బాగుండుననీ, కాడేమోననీ, అనుకుంటూ దగ్గిరకు వెళ్ళి, "నాయనా, నీ తండ్రి ఎవరు? నీ తల్లి ఎవరు? నీ పేరేమిటి? నీది ఏ ఊరు?" అని అడిగాడు.

కాని ఆ కుర్రవాడు శంతనుడి ప్రశ్నలకు సమాధానం ఇయ్యక, నదిపైకి బాణాలు వెయ్యటంలో నిమగ్నుడై ఉండిపోయాడు.

కుర్రవాడు కొంతసేపు అలా ఆడి ఆడి, ఎటో వెళ్లిపోయేసరికి, శంతనుడు గంగను తలుచుకున్నాడు. వెంటనే గంగ పూర్వపు రూపంలో కనిపించింది.

శంతనుడు ఆమెను, "ఇక్కడ ఒక ముచ్చటైన కుర్రవాడు కనిపించి, అంతలో ఎటో వెళ్లాడు. వాడెవడో చెప్పి, నాకు వాణ్ణి చూపించగలవా?" అని అడిగాడు.

7. కౌరవ పాండవుల కథ



గంగ నవ్వి, "వాడు ఎనిమిదో వసువు, నీ కొడుకే. తెచ్చి చూపిస్తాను. వాణ్ణి ఆదరించు," అని గాంగేయుణ్ణి తెచ్చి శంతనుడికి చూపి, "వీడు వసిష్ఠుడి వద్ద వేదాలన్నీ నేర్చుకున్నాడు. పరశురాముడికి శిష్యత్వం చేశాడు. వీడే నీ కులాన్ని ఉద్ధరిస్తాడు," అంటూ అదృశ్యమైంది.

శంతనుడు తన కొడుకును కౌగలించుకుని, తన రథం మీద కూర్చోబెట్టుకుని రాజధానికి తెచ్చి, మంత్రి పురోహితాదుల అనుమతితో వాణ్ణి యువరాజుగా అభిషేకించాడు.

నాలుగేళ్ళు గడిచాయి. తరవాత ఒకనాడు శంతనుడు వేటాడుతూ కాళిందీ నదీ తీరానికి వెళ్ళి, వేటలో అలసి, చల్లగా ఒక చెట్టు నీడన విశ్రమించి ఉండగా, గొప్ప సువాసనతో కూడిన గాలి తెమ్మెరలు అతన్ని సోకాయి.

శంతనుడు ఆశ్చర్యపడి, ఆ సువాసనకు కారణం వెదుకుతూ, గాలి వచ్చిన దిక్కుగా అరణ్యంలో తిరగసాగాడు. కొంతసేపటికి అతని ఎదట అప్సరలాటి ఆడది ఒకతె కనబడింది. నిస్సందేహంగా ఆమె శరీరంనుంచే సువాసనలు వస్తున్నాయి. ఆమె ఏ దేవకాంతో, కిన్నర స్త్రీయో, నాగకన్యకో అయి ఉంటుంది కాని మానవస్త్రీ మాత్రం కాదనుకున్నాడు శంతనుడు.

అతను ఆమెను సమీపించి, "నువు ఎవతెవు? నీ తండ్రి ఎవరు? ఈ అరణ్యంలో ఒంటరిగా ఎవరికోసం తిరుగుతున్నావు? నీ భర్త ఎవరు?" అని అడిగాడు. ఆమెను చూడగానే తనకు ఆమె మీద మోహం కలిగినట్టు కూడా అతను చెప్పాడు.

ఆమె చిరునవ్వుతో, "నేను కన్యను. నా తండ్రిని దాశరాజు అంటారు. ఇప్పుడే వస్తాను, తాను తిరిగి వచ్చేవరకూ నావ నడుపుతూ ఉండమని చెప్పి, ఆయన ఇంటికి వెళ్ళాడు. అదే ఆయన వుండే ఇల్లు," అన్నది.

"నేను రాజును. మాది కురువంశం. నీ యౌవనమంతా ఎందుకు వ్యర్థం చేసుకుంటావు? నాకు భార్యవై సమస్త సుఖాలూ అనుభవించు. నా కింకో భార్య లేదు. ముందు ఒకతె నన్ను వరించి, ఏవేవో ఆశలు పెట్టి, వెళ్ళిపోయింది. తరవాత నేను మరేస్త్రీని తలవలేదు. కాని నిన్ను చూడగానే కోరిక పుట్టింది. నీకు దాసుడై ఉంటాను. నన్ను మళ్ళీ సంసారిని చెయ్యి," అన్నాడు శంతనుడు.

అతని మాటలకు ఆమె పూర్తిగా చలించి, సిగ్గుపడుతూ, "నీకు నా మీద కలిగిన మోహం నాకు మాత్రం నీ మీద కలగదా? కాని స్త్రీలు ధర్మం తప్పరాదు. వాళ్ళకు పెద్దలు పెళ్ళి చేయాలిగాని, తమకు తామే ఎవరినో పెళ్ళాడేసి, పెద్దవారికి తలవంపులు కలిగించరాదు. అందుచేత నువు నా తండ్రితో చెప్పి, ఆయన అనుమతితో నన్ను పెళ్ళాడు," అన్నది.

ఆమె చెప్పినది సబబుగానే ఉండటం చేత శంతనుడు ఆమె తండ్రి వద్దకు వెళ్ళి, తన కోరిక చెప్పనిశ్చయించాడు.

దాశరాజు శంతనుణ్ణి దూరానే చూసి, చేతులు జోడించి ఎదురువస్తూ, ఎంతో వినయ విధేయతలతో, "తమ దాసుణ్ణి! తమరు ఇలా రావటం నా అదృష్టం!



నా వల్ల ఏం పని కావాలి? సెలవియ్యండి." అన్నాడు.

"నీకు అభ్యంతరం లేకపోతే నీ కూతుర్ని పెళ్ళాడతాను. ఇదే నేను కోరినది," అన్నాడు శంతనుడు.

ఆ మాట విని దాశరాజు పరమానందం చెంది, "మహారాజా, నా కూతుర్ని నువు పెళ్ళాడి, నా వంశానికి ప్రతిష్ఠ తెసానంటే, నాకు అంతకన్న ఏం కావాలి? అయినా నాది ఒక్క కోరిక: నీకూ, నాకూతురికీ పుట్టే కొడుకు నీ అనంతరం రాజు కావాలి," అన్నాడు.

ఈ మాట వినగానే శంతనుడికి తన కొడుకు గాంగేయుడు జ్ఞాపకం వచ్చి,



బాధ కలిగింది. అతను దాశరాజు అన్న మాటకు ఏ జవాబూ ఇయ్యకుండా, వెనక్కు తిరిగి ఇంటికి వచ్చేశాడు. కాని అతని మనసు దాశకన్య మీదనే ఉన్నది. అతను తీరని విచారంతో బాధపడుతూ, భోజనం చేయలేదు.

ఆ స్థితిలో గాంగేయుడు తన తండ్రిని చూసి, ''అలా దిగులుగా ఉన్నావేమిటి? కారణం నాకు చెప్పరాదా? బలమైన శత్రువు ఎవడైనా ప్రతిఘటించాడా? జరగరాని పని ఏదైనా జరిగిందా? నేనుండగా నువు విచారంగా ఉండవలసినపని ఏమిటి? నీ కేదైనా కోరిక ఉన్న పక్షంలో నేను తీర్చుతాను.'' అన్నాడు.

కొడుకు మాటలు విని శంతనుడు కొంచెం బిడియపడుతూ, ''నాయనా, ఒక్కడే కొడుకు కావటం విచారం కాకేమిటి? ఒక కొడుకు కొడుకు కాదు, ఒక కన్ను కన్ను కాదంటారు. దైవికంగా ఉన్న ఒక్క కొడుకూ పోతే, తండ్రి గతి ఏం కావాలి?'' అన్నాడు.

గాంగేయుడు అసలు విషయం ఏమిటో మంత్రుల నడిగి తెలుసుకుని, వారిని వెంట బెట్టుకుని దాశరాజు దగ్గిరికి వెళ్ళి, ''ఏమయ్యా, నీ కూతురిని నాతండ్రి కిచ్చి పెళ్ళిచెయ్యి. నేను ఆమెను తల్లిగానూ, శంతనుణ్ణి తండ్రిగానూ భక్తితో చూసుకుంటాను,'' అన్నాడు.

దానికి దాశరాజు ''నా కూతురిని నువే పెళ్ళాడు. నువు ఉండగా దాని కొడుకు రాజ్యం చెయ్యటం ధర్మంకాదు గదా,'' అన్నాడు.

''నీ కూతురిని నాకు తల్లిగా ఇయ్యి. ఆమె కొడుకే రాజ్యం చేస్తాడు.''అన్నాడు గాంగేయుడు.

''అయ్యా, నువు రాజ్యం వదిలితే వదలవచ్చు. కాని నీ కొడుకు నా మనమడికి రాజ్యం రానిస్తాడని ఏమిటి?'' అని దాశరాజు అడిగాడు.

''నేను పెళ్ళే చేసుకోను. ఇక నాకు కొడుకులు కలిగేదేమిటి? నన్ను గురించి

ఎలాటి సందేహాలూ పెట్టుకోక, నీ కూతు రిని నాకు తల్లిగా ఇయ్యి.'' అన్నాడు గాంగేయుడు.

ఇందుకు దాశరాజు సమ్మతించి, సత్యవతిని శంతనుడికి భార్యగా ఇచ్చి పెళ్లి చేశాడు. రాజ్యం కోరననీ, పెళ్ళి చేసుకోననీ శపథం చేసిన కారణంగా గాంగేయుడికి భీష్ము డనే పేరు సార్థక మయింది.

కొంత కాలం గడిచింది. సత్యవతి శంతనుడికి ఇద్దరు కొడుకులను కన్నది. వారి పేర్లు చిత్రాంగదుడూ, విచిత్రవీర్యు డూనూ. అయితే దురదృష్టవశాన ఇద్దరూ పిల్లలు లేకుండానే అకాల మరణం పొందారు.

అప్పుడు విచిత్రవీర్యుడి భార్యలలో పెద్దదైన అంబిక, అత్తగారు ఆజ్ఞాపించిన మీదట వ్యాసుడికి ఒక కొడుకును కన్నది. కాని ఆ కొడుకు, ధృతరాష్ట్రుడు, గుడ్డి వాడు. ధృతరాష్ట్రుడు రాజుగా ఉండ టానికి పనికిరాడని, సత్యవతి తన రెండో కోడలైన అంబాలిక చేత వ్యాసుడికి మరో కొడుకును కనిపించింది. ఆ కొడుకు పాండురోగంతో పుట్టిన పాండురాజు.

ఈ విధంగా రెండు ప్రయత్నాలు విఫలం కావటంచేత సత్యవతి అంబికను వ్యాసుడి వల్ల మరొక కొడుకును కన మన్నది. అయితే అంబికకు అది ఇష్టం కాక, వ్యాసుడి వద్దకు తన దాసిని పంపింది. ఆమెకు విదురుడు పుట్టాడు.





భీష్ముడు పాండురాజును రాజుగా చేశాడు. పాండురాజు విదురుణ్ణి మంత్రిగా పెట్టుకుని రాజ్యం ఏల నారంభించాడు. ధృతరాష్ట్రుడు గాంధారినీ, మరొక వైశ్య స్త్రీనీ పెళ్ళాడాడు. గాంధారికి నూరుగురు కొడుకులూ, వైశ్యస్త్రీకి ఒక కొడుకూ కలిగారు. పాండురాజు కుంతీ, మాద్రీ అనే భార్యలను చేసుకున్నాడు. కుంతికి ముగ్గురు కొడుకులూ, మాద్రికి ఇద్దరూ పుట్టారు. వారే పాండవులు—యుధిష్ఠిర, భీమ, అర్జున, నకుల, సహదేవులు.

అయితే కుంతి పెళ్ళికాక పూర్వమే సూర్యుడికి రహస్యంగా ఒక కొడుకును కని,. వాణ్ణి ప్రవాహంలో విడిచిపెట్టింది. వాడే కర్ణుడు. సూతుడికి దొరికి, అతని ఇంట పెరిగాడు.

పాండవులు పుట్టేనాటికి పాండురాజు రాజ్యాన్ని ధృతరాష్ట్రుడికి అప్పజెప్పి తన భార్యలతో అరణ్యవాసం చేస్తూ, అక్కడే మరణించాడు. మాద్రి అతనితో పాటు సహగమనం చేసింది. కుంతి పాండవులను తీసుకుని ధృతరాష్ట్రుడి పంచ చేరింది.

పాండవులు అయిదుగురూ కలిసి ద్రుపదుడి కూతురైన ద్రౌపదిని పెళ్ళాడి, ఆమెకు పిల్లలనుకన్నారు. అర్జునుడు కృష్ణుడి చెల్లెలైన సుభద్రను పెళ్ళాడి, అభిమన్యుణ్ణి కన్నాడు. అభిమన్యుడు భారతయుద్ధంలో చచ్చిపోయే సమయానికి అతని భార్య ఉత్తర గర్భవతిగా ఉంది. పరీక్షిత్తును కన్నది.

భారత యుద్ధంలో తన కొడుకులందరూ చావగా, ధృతరాష్ట్రుడూ, గాంధారీ యుధిష్ఠిరుడి వద్ద ఉండిపోయారు. ధర్మరాజు వారిని ఎంతగానో ఆదరించాడుగాని, భీముడు వారిని సూటిపోటి మాటలతో అదే పనిగా అవమానించాడు.

చివరకు ధృతరాష్ట్రుడు గాంధారినీ, విదురుణ్ణీ, సంజయుణ్ణీ వెంట బెట్టుకుని వానప్రస్థానం వెళ్ళిపోయాడు. కుంతి

కూడా వారి వెంట, వెళ్ళింది. ఆరు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు యుధిష్ఠిరుడు కలగన్నాడు. ఆ కలలో కుంతి చాలా నీరసించి ఉన్నట్టు కన బడింది. యుధిష్ఠిరుడు తన తమ్ములకు ఈ మాట చెప్పి, తనకు ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ కూడా చూడాలని ఉన్నదని చెప్పాడు.

అందరూ సరేనంటే సరేనన్నారు. పాండవులు ద్రౌపదినీ, సుభద్రనూ, ఉత్తరనూ వెంటబెట్టుకుని, పౌరజనులు కలిసిరాగా, శతయూపాశ్రమానికి వెళ్లారు. అక్కడ ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ ఉన్నారుగాని, విదురుడు లేడు.

విదురుడు అరణ్యంలో మరొక ప్రాంతాన ఏకాంతంగా తపస్సు చేసు కుంటున్నాడని ధృతరాష్ట్రుడు చెప్పాడు.

యుధిష్ఠిరుడు విదురుణ్ణి వెతుక్కుంటూ గంగాతీరం వెంబడి వెళ్లి, ఒకచోట ఘోర తపస్సులో ఉన్న విదురుణ్ణి చూసి, తన పేరు చెప్పుకుని, దణ్ణంపెట్టాడు. విదు రుడు జవాబియ్యలేదు. అయితే అంత లోనే విదురుడి ముఖం నుంచి తేజస్సు బయలుదేరి వచ్చి, యుధిష్ఠిరుడి ముఖంలో ప్రవేశించింది. విదురుడు చచ్చిపడిపోయాడు.

యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుడి పద్దకు తిరిగి వచ్చి, విరుదుడి మరణం గురించి చెప్పి, కొంతకాలం వారివెంట ఉండి, తిరిగి తన వారితో హస్తినాపురానికి వెళ్లిపోయాడు.

మరికొంత కాలానికి ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కార్చిచ్చులో చిక్కుకుని కాలిపోయారు. సంజయుడు అంతకు ముందే ఏదో తీర్థంలో చనిపోయాడు.

కౌరవ, పాండవ వంశాలకు అంకు రంగా మిగిలిన పరీక్షిత్తు, ఒక ముని శాపంచేత, తక్షకుడు కరిచి మరణిం చాడు. జనమేజయుడు, పరీక్షిత్తు కొడుకు తండ్రి చావుకు ప్రతీకారంగా సర్పయాగం చేసి, అనేక సర్పాలను అగ్నిలో ఆహుతి చేసి, చివరకు విరమించాడు.





# దేవీ భాగవతం

కోసలదేశపు రాజధాని అయిన అయోధ్యా నగరాన్ని ధ్రువసంధి అనే రాజు పాలించేవాడు. ఆయనకు మనోరమా, లీలావతీ అని ఇద్దరు భార్యలు. మనోరమకు సుదర్శనుడనీ, లీలావతికి శత్రుజిత్తు అనీ కొడుకులు కలిగారు. ఆ ఇద్దరిలోనూ సుదర్శనుడు ఒక మాసం పెద్దవాడు. శత్రుజిత్తు చాలా అందమైనవాడూ, మంచి తెలివిగలవాడూనూ; అతనంటే తండ్రికీ, మంత్రులకూ, సేవకులకూ, పౌరులకూ కూడా చాలా ఇష్టం.

ఇలా ఉండగా ధ్రువసంధి ఒకనాడు వేటకు వెళ్ళి, వేటాడుతూండగా అకస్మాత్తుగా ఒక పొదనుంచి సింహం ఒకటి అతని మీద పడింది. ధ్రువసంధీ, సింహమూ హోరాహోరి పోరాడి, చివరకు ఇద్దరూ చచ్చిపోయారు. రాజు వెంట వెళ్లిన భటులు రాజభవనానికి తిరిగి వచ్చి, జరిగిన సంగతి మంత్రులకు చెప్పారు. మంత్రులు చచ్చిపోయిన రాజుకు ఉత్తరక్రియలు జరిపి, సుదర్శనుడికి రాజ్యాభిషేకం చెయ్యటానికి ప్రయత్నాలు ప్రారంభించారు. అది అందరికీ సమ్మతమే అయింది.

అయితే, కళింగదేశపు రాజు వీరసేనుడు, అంటే మనోరమ తండ్రి, తన అల్లుడు చనిపోయినవార్త విని, తన మనమడైన సుదర్శనుడి క్షేమసౌభాగ్యాలు చూడటానికి వచ్చాడు. అలాగే ఉజ్జయిని నుంచి శత్రుజిత్తు మాతామహుడైన యుధా

**8. ధ్రువసంధి కథ**



జిత్తు కూడా వచ్చాడు. ఇలా వచ్చిన మనోరమ తండ్రీ, లీలావతి తండ్రీ ఎవరి మనవడి మేలుకోరి వారు మంత్రులతో మాట్లాడారు.

ఆ సందర్భంలో యుధాజిత్తు వీరసేనుడితో, "నీ మనవడు సుదర్శనుడు వయసులో ఒక్క పిసరు పెద్ద అయితే అవుగాక. నా మనవడు శత్రుజిత్తు అన్ని ఇతర లక్షణాలలోనూ సుదర్శనుణ్ణి మించినవాడే. వయోజ్యేష్ఠుడికన్న గుణజ్యేష్ఠుడు ఎక్కువగదా! నా మనవడే రాజు కావటానికి అర్హుడు," అన్నాడు.

దీనికి వీరసేనుడు, "అది పిచ్చి మాట! నా కూతురు మనోరమ పట్టపు రాణి. ఆమెకు పుట్టిన సుదర్శనుడే రాజు. పెద్దవాడు రాజు కాదనే ధర్మం అదేం ధర్మం?" అన్నాడు.

అప్పుడు యుధాజిత్తు మంత్రులతో, "మీరూ, మీరూ ఏకమై సుదర్శనుణ్ణి రాజు చేస్తే, నా మనవడు శత్రుజిత్తు చేతులు కట్టుకుని కూర్చుంటాడనుకుంటున్నారా? వాడికి తెలివి ఉన్నది, బలం ఉన్నది, బలం గలవాణ్ణి నేనున్నాను. మిమ్మల్నందరినీ తుడిచిపెట్టి వాడు రాజ్యం పుచ్చుకుంటాడు! నేను కత్తిపట్టానంటే భూమినే చీల్చి పారెయ్యగలను. నాకు ఇతరులు ఒక లెక్కా? ఆలోచించుకోండి," అన్నాడు.

ఇద్దరు తాతలూ ఘర్షణపడసాగారు. వినే వారికి రోత పుట్టింది. ధ్రువసంధి చచ్చాడని తెలిసి, రాజ్యాన్ని దోచుకుందామని శృంగబేరపురం నుంచి ఆటవికులు వచ్చారు. వాళ్ళు ఒక వంక దూరంగా నగరాన్ని చుట్టుముట్టి ఉండగా, యుధాజిత్తూ, వీరసేనుడూ తమ తమ సైన్యాలను పోగుచేసుకుని, యుద్ధానికి తలపడ్డారు. రెండుపక్షాలూ దారుణంగా పోరాడాయి. ఆ పోరాటంలో యుధాజిత్తు వీరసేనుణ్ణి చంపేశాడు.

మనోరమ తన తండ్రి చావుకు ఎంతో దుఃఖించింది. భర్త పోయిన శోకానికి

తండ్రి పోయిన శోకం తోడయింది. కొడుకేమో చాలా చిన్నవాడు. ఏమీ ఎరగని అర్భకుడు. తనకు దిక్కెవరు? తన తండ్రిని చంపిన యుధాజిత్తు తన కొడుకు సుదర్శనుణ్ణి చంపకుండా విడిచి పెడతాడా? తన మనవణ్ణి రాజును చెయ్యటమేగద అతని ఆశయం? లీలావతితో తనకు సవతిపోరే తప్ప సఖ్యత ఉండబోదు. ఆమె తనను కారాగృహంలో పెట్టించకుండా ఊరుకోదు. మంత్రులు మొదట తన కొడుక్కు రాజ్యాభిషేకం చేతామనుకున్నవారే. కాని ఇప్పుడు వారు యుధాజిత్తు మాట వినక తప్పదు. ఎటు చూసినా తనకు అండ అన్నది లేదు.




ఇలా అనుకుని, మనోరమ విదల్లుడు అనే మంత్రిని రహస్యంగా పిలిపించి, తన పరిస్థితిని బట్టి తనకు కర్తవ్యం ఏమిటో చెప్పమన్నది.

విదల్లుడు ఆమెతో, "అమ్మా, నీకూ, నీ కుమారుడికీ ఇక్కడ ఏ మాత్రమూ క్షేమంలేదు. కాశీరాజు సుబాహువు నాకు మేనమామ. ఆయన మహా శక్తిమంతుడు. మనం అక్కడికి వెళితే కాపాడగలడు," అన్నాడు.

మనోరమ సరేనని, తన తండ్రికి తర్పణాలు విడిచి, సైరంధ్రి అనేదాన్నీ, తన కొడుకునూ తీసుకుని విదల్లుడి వెంట కాశీనగరానికి బయలుదేరింది. అయితే ఆ రాత్రి ఆమెనూ, ఆమె వెంట ఉన్న వారినీ దొంగలు దోచి, కట్టుబట్టలతో వదిలారు. మర్నాడు ఆమె పడవ మీద గంగానది దాటి, భరద్వాజుడి ఆశ్రమం ప్రవేశించింది.

భరద్వాజుడు ఆమెను చూసి, "ఎవరు నువు? ఎక్కడినుంచి వస్తున్నావు? నీ భర్త ఎవరు? పుట్టెడు శోకంలో ఉన్నట్టు కనిపిస్తున్నావు. ఏమిటి కారణం?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు ఆమె మరింతగా ఏడుస్తూంటే, విదల్లుడు మునితో, ధ్రువసంధి చావు మొదలుగా జరిగినదంతా చెప్పాడు. అంతావిని భరద్వాజుడు మనోరమతో,



"నీకు వచ్చిన భయమేమి లేదు. నీ ఈ చిన్న కొడుకు రాజవుతాడు. నువు ఈ ఆశ్రమంలో ఉండిపో." అన్నాడు. ఆయన చూపిన పర్ణశాలలో మనోరమా, విదల్లుడూ, సైరంధ్రీ, సుదర్శనుడూ జీవించసాగారు.

అయోధ్యలో శత్రుజిత్తు మహా వైభవంగా రాజ్యాభిషేకం చేయించుకున్నాడు. మనోరమా, సుదర్శనుడూ ఎటు వెళ్లారో, ఏమయారో ప్రజలకు అంతుచిక్కలేదు. అయితే శత్రుజిత్తు తాత అయిన యుధాజిత్తుకు సుదర్శనుడూ, అతని తల్లీ భరద్వాజాశ్రమంలో ఉన్న సంగతి తెలియవచ్చింది. శత్రుశేషం ఉండటం మంచిదికాదని ఆయన సుదర్శనుణ్ణి చంపించటానికి నిశ్చయించుకుని, చిత్రకూట పర్వతానికి వెళ్లి, నిషాదుల రాజైన బలుడు అనేవాణ్ణి వెంటబెట్టుకుని, శృంగిబేరపురాన్ని ఏలే దుర్దర్శుడు అనే వాడి వద్దకు వెళ్ళాడు.

ఈ సంగతి విని మనోరమ దుఃఖిస్తూ భరద్వాజుడి వద్దకు వెళ్లి, తమకు రానున్న ఆపద గురించి చెప్పింది. భరద్వాజుడు, తన ఆశ్రమం వెలపల వచ్చి ఉన్న యుధాజిత్తును కలుసుకుని, "ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"మనోరమ కోసం," అని యుధాజిత్తు చెప్పాడు.

"భర్తపోయి, తండ్రిపోయి, పుట్టెడు దుఃఖంతో తన కొడుకును వెంటబెట్టుకుని ఈ ఆశ్రమంలో తలదాచుకున్న మనోరమ తిరిగి ఇక్కడినుంచి వెళుతుందా?" అన్నాడు భరద్వాజుడు.

"మర్యాదగా ఆమెను పంపితే పంపించు. లేకపోతే బలాత్కారంగా తీసుకుపోవలసి వస్తుంది," అన్నాడు యుధాజిత్తు.

భరద్వాజుడు ఆగ్రహావేశంతో, "ఓరీ పాపీ! హీనుడా! బలాత్కారంగా తీసుకుపోతావా? ఏదీ? తీసుకుపో! మా ఋషులంటే మీ రాజులకు అంత తేలిక అయిందా?" అన్నాడు.



అప్పుడు యుధాజిత్తు తన మంత్రితో ఏకాంతంగా, ''ముని మాటలు విన్నావు గదా! మనోరమనూ, ఆమె కొడుకునూ తీసుకుపోయే మార్గమేది? శత్రుశేషం ఉంచరాదు గద! సుదర్శనుణ్ణి చంపితే గాని నా మనవడి ఏలుబడికి క్షేమంలేదు. ఇక్కడ నన్ను ఎదిరించటానికి ఎవరున్నారు? ముని మాటలు చూసి మనం భయపడాలంటావా?'' అన్నాడు.

దానికి మంత్రి, ''మునుల మీదికి ఒంటి కాలితో పోవటం అంత మంచిది కాదు. వాళ్ళు శక్తిమంతులు. పూర్వం వసిష్ఠుడి మీదికి ఇలాగే వెళ్లి విశ్వామిత్రుడు గొప్ప పరాభవం పొందాడు. ఆ దెబ్బతో విశ్వామిత్రుడు రాజరికాన్ని వదిలేసి, తపశ్శక్తి సంపాదించటానికి ఋషి అయాడు. కాకపోయినా, సుదర్శనుడు దీనస్థితిలో ఉన్నాడు. డబ్బు లేదు. కుర్రవాడు. నీ మీదికి ఎలా వస్తాడు? అంతగా వస్తే అప్పుడే చూసుకోవచ్చు. అంతేగాని, ఈ మునితో తగాదా పెట్టుకుని ప్రాణం మీదికి మాత్రం తెచ్చుకోవద్దు'' అంటూ హితవు చెప్పాడు.

మంత్రి మాటలు పాటించి యుధాజిత్తు భరద్వాజుడి దర్శనం చేసుకుని, జరిగిన దానికి క్షమాపణ చెప్పుకుని, తన ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత మనోరమ ఆశ్రమంలో నిశ్చింతగా ఉండిపోయింది. సుదర్శనుడు క్రమంగా పెరిగి, పదకొండేళ్ళవాడై, ముని వద్ద వేదం అభ్యసించాడు. అలాగే శాస్త్రాలూ, ధనుర్వేదమూ నేర్చుకున్నాడు.

ఒక రోజు సుదర్శనుడికి మహాదేవి కలలో కనిపించి, అతనికి అస్త్రవిద్యలు ప్రసాదించింది.

ఇంతలో, కాశీరాజు కూతురు శశికళ, అద్భుత సౌందర్యవతి అని విని సుదర్శనుడు ఆమెను పెళ్లాడగోరాడు. అదే విధంగా శశికళ కూడా భరద్వాజాశ్రమంలో ఉంటున్న సుదర్శనుణ్ణి గురించి విని, అతన్నే పెళ్ళాడ నిశ్చయించింది.

భరద్వాజాశ్రమంలో సుదర్శనుడు పగలు శశికళను గురించే ఆలోచిస్తూ, రాత్రి ఆమెనే కలలు కంటూ కాలం వెళ్ళబుచ్చుతూండగా, ఒకనాడు అతని వద్దకు శృంగిబేరపుర రాజైన నిషాదుడు వచ్చి, నాలుగు గుర్రాలు గల రథాన్ని, జెండాతోనూ, సమస్త ఆయుధాలతోనూ కూడినదాన్ని బహుమానంగా ఇచ్చాడు.

ఇదే సమయంలో భరద్వాజాశ్రమంలోని మునులు సుదర్శనుడితో, "నువు త్వరలోనే రాజు కాబోతున్నావు! నీకు మహాదేవి కటాక్షం ఉన్నది," అని మనోరమతో, "అమ్మా, వీరమాతా! నీ కొడుకు రాజు కాబోతాడు," అన్నారు.

"మీ నోటి చలవవల్ల అలాగే కావాలి! ఒక్కడు కూడా తోడులేని నా కొడుకు రాజెలా అవుతాడో మరి? అయినా మీ నోటి మాట అబద్ధం అవుతుందా? మీ దీవనే వాడికి అన్నిటినీ మించిన సహాయం!" అంటూ మనోరమ తన మనసులో సంతోషంతో పొంగిపోయింది.

సుదర్శనుడు తన రథం మీద ఎక్కి ఎక్కడ తిరిగినా అతని చుట్టూ ఒక అక్షౌహిణి సేన ఉన్నట్టుగా ఉండేది. సుదర్శనుడి మీద మనస్సు నిలిపిన శశికళ మాత్రం తిండి కూడా మాని కృశించసాగింది. ఆమె బాధ కొంతవరకు



గ్రహించిన తండ్రి సుబాహుడు ఆమెకు స్వయంవరం నిశ్చయించి, రాజులందరికీ వర్తమానం పంపాడు.

స్వయంవరాలు మూడు రకాలు: పణస్వయంవరమూ, శుల్కస్వయంవరమూ, ఇచ్ఛా స్వయంవరమూనూ. రాముడు శివధనుర్భంగం చేసి సీతను భార్యగా పొందినది పణస్వయంవరం. సుబాహుడు తన కూతురికి నిశ్చయించినది ఇచ్ఛా స్వయంవరం. స్వయంవరం వార్త వింటూనే నానా దేశాల రాజకుమారులు కాశీకి వచ్చి చేరారు.

ఎవరెవరు స్వయంవరానికి వచ్చినదీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్న శశికళ

కంట నీరు కార్చుతూ తన చెలికత్తెతో, "ఏళ్ళంతా దేనికి? నేను సుదర్శనుణ్ణి తప్ప మరొకరిని ఎలా వరిస్తాను? ధనమూ, రాజ్యాలూ దేనికి తగలెయ్యనా? పెళ్ళాడితే ప్రజ్ఞా, ప్రాభవాలు గలవాణ్ణి పెళ్లాడాలి! అలాంటివాడు సుదర్శనుడు ఒక్కడే!" అన్నది.

ఆమె చెలికత్తె ఈ మాట తీసుకుపోయి రాణికి చెప్పింది: "అమ్మా, మన శశికళ తన మనస్సును సుదర్శనుడనే అతనికి ధారాదత్తం చేసింది. అతను భరద్వాజాశ్రమంలో ఉంటాడట."

రాణి ఈ సంగతి తన భర్తకు చెప్పింది. అది విని రాజు ఆమెతో, "వాడి సంగతి తెలుసును! వాడు రాజ్యభ్రష్టుడై, తిండికి కూడా లేక, అరణ్యంలో తల్లితోబాటు మునిపల్లెలో ఉంటున్నాడు. వాడికి పిల్ల నెలా ఇచ్చేది? అదృష్టవంతులూ, భాగ్యవంతులూ వేలకు వేలమంది ఉన్నారు. పిల్ల మనసు మార్చుకోమని నచ్చజెప్పు," అన్నాడు.

రాణి సరేనని శశికళ వద్దకు వెళ్ళి, చేరదీసి ముద్దు చేస్తూ, "తల్లీ, నువు కోరినవాడు అడవిలో కందమూలాలు తింటూ, నీరసించి, బంధువులకు వెలి అయి, అంగబలమూ, అర్థబలమూ లేని నిర్భాగ్యుడు. ఎందరో రాజకుమారులు గొప్ప గొప్పవాళ్ళు నీకోసం వచ్చి ఉన్నారు. ఆ సుదర్శనుడి తమ్ముడే ఉన్నాడు, ఎంతో గొప్ప అందగాడు; బలవంతుడు; రాజ్యం ఏలుతున్నాడు. అతని పేరు శత్రుజిత్తు. నీకు ఎంతో ఈడూ, జోడూగా ఉంటాడు. ఇతని కోసమే గదా ఇతని తాత కళింగరాజును చంపాడు? అది అలా ఉండనీ. ఇంతకన్న ఘోరం ఏమిటంటే, అవకాశం దొరికితే యుధాజిత్తు ఈ సుదర్శనుణ్ణి తప్పక చంపుతాడు. ఆ భయంతోనే గదా ఇతను భరద్వాజాశ్రమంలో తల దాచుకున్నాడు? నీ తండ్రి నిన్ను ఏ పరిస్థితిలోనూ సుదర్శనుడి కిచ్చి పెళ్ళి చెయ్యడు. అందుచేత ఆ ఆలోచన మానుకో," అన్నది.






సుదర్శనుణ్ణి పెళ్ళాడే ఆలోచన మానుకోమని చెప్పినందుకు, శశికళ తల్లితో ఇలా అన్నది:

"అమ్మా, అతను అడివిలో ఉంటేనేం? పట్నంలో ఉంటేనేం? అతనికి డబ్బు లేకపోతేనేం? నవనిధులూ ఉంటేనేం? నా మనసు అతన్ని తప్ప మరొకణ్ణి కోరదు. విధి లిఖితాన్ని బ్రహ్మ కూడా మార్చలేడుగదా! భర్తకు ఆనందంగా సేవ చేసే మనిషికి స్వర్గమూ, మోక్షమూ, సమస్తమూ కలుగుతాయిగదా, అమ్మా! నా భవిష్యత్తు మహాదేవి నిర్ణయించింది. నా కిష్టమైనవాడు సుదర్శనుడే!"

శశికళ తల్లి తన కూతురన్న మాటలు భర్తకు చెప్పింది.

స్వయంవరం దగ్గిర పడుతున్నది. సుదర్శనుడు రాలేదు. శశికళ తనకు హితుడైన ఒక బ్రాహ్మణ్ణి రహస్యంగా పిలిపించి, అతనితో, "అయ్యా, మా తండ్రికి తెలియకుండా నువు భరద్వాజాశ్రమానికి వెళ్ళి, సుదర్శనుణ్ణి కలుసుకుని, నేను చెప్పానని చెప్పు! 'అంబ నన్ను సుదర్శనుణ్ణే పెళ్ళాడమన్నది. నాకు స్వయంవరం జరగబోతున్నది. రాజులంతా వచ్చి విడిసి ఉన్నారు. నా మనసు నీ మీద నిలిచి ఉన్నది. కాని, సుదర్శనా, నువు రాలేదు. నేను నిన్ను తప్ప మరొకరిని వరించను. నిన్ను పెళ్ళాడలేని పక్షంలో అగ్నిలో దూకేస్తాను. ప్రాణాలతో ఉండేది మటుకు కల్ల! అంబ దయవల్ల

9. శశికళా స్వయంవరం



మనకు సమస్త శుభాలూ చేకూరుతాయి. ఆమె మాట వృధా కాదు. ఆ జగన్మాతను నమ్మి, నువు తప్పక రావాలి. నన్ను చేపట్టు.'" అని చెప్పింది.

ఆ బ్రాహ్మడు శశికళ సందేశంతోబాటు దక్షిణ కూడా పుచ్చుకుని, భరద్వాజాశ్రమానికి వెళ్ళి, సుదర్శనుణ్ణి కలుసుకుని, సంగతి అంతా చెప్పాడు. ఇంకేమున్నదీ? సుదర్శనుడు స్వయంవరానికి బయిలుదేరాడు. మనోరమ గుండెల్లో రాయిపడింది. ఆమె ఆపుకోలేని దుఃఖంతో కొడుకుతో ఇలా అన్నది:

"అంతమంది రాజులున్న చోటికి తోడెవరూ లేకుండా ఒంటరిగా పోతావా? నీపాలిటి యముడు గదా యుధాజిత్తు? అక్కడికి తప్పక వస్తాడు. నాకు పుత్రశోకం తెచ్చిపెట్టకు. నాయనా! నా మాట కాస్త విను."

దానికి సుదర్శనుడు, "అమ్మా, దేవి ఆజ్ఞ పాలించే నాకు కీడు ఎలా కలుగుతుంది? ఇంకొకడి బలం చూసి నేను భయపడతానా? క్షత్రియ స్త్రీవి కంట తడి పెట్టవచ్చునా? అయేది ఎలాగూ అవుతుంది. సుఖ దుఃఖాలు కావడి కుండలు," అని తల్లికి ధైర్యం చెప్పి, నిషాదరాజు ఇచ్చిన రథం ఎక్కి బయలుదేరబోయాడు.

అప్పుడు మనోరమ అతన్ని దీవించి, "నాయనా, నిన్ను విడిచి క్షణం ఉండటమైనా నాకెంతో కష్టం. నిన్ను చూసుకుంటూనే కదా ఇంత కాలమూ హాయిగా గడిపాను. ఇప్పుడు నాకీ కష్టం ఎందుకు కలిగిస్తావు? నన్ను కూడా నీ రథం మీద తీసుకుపో," అన్నది.

సుదర్శనుడు సరేనని సైరంధ్రితో సహా తన తల్లిని రథం మీద ఎక్కించుకుని కాశీనగరం చేరాడు. స్వయంవరానికి వచ్చిన రాజుల కందరికీ చేసినట్టే సుబాహు సుదర్శనుడికి ఎదురు వచ్చి, అతనికి విడిది చూపి, పరిచారకులను నియమించాడు.

స్వయంవరానికి తన మనవడితో సహా వచ్చిన యుధాజిత్తూ, ఇతర రాజులూ సుదర్శనుణ్ణి చూసి, "తగుదునమ్మా అని సుదర్శనుడు స్వయంవరానికి వచ్చాడయ్యా! రాజుల కొడుకులనూ, రారాజుల కొడుకులనూ కాదని రాజకుమార్తె తననే వరిస్తుందనుకున్నాడో ఏమో! ఏమైనప్పటికీ చెప్పలేం! నవ్విన నాపచేనే పండిందంటారుగద!" అనుకున్నారు.

ఆ మాటమీద యుధాజిత్తు, "ఈసుదర్శనుణ్ణి నేను చంపేస్తాను," అన్నాడు.

అది విని కేరళరాజు, "ఇది ఇచ్ఛాస్వయంవరం. వధువు వచ్చిన వారిలో తన కిష్టమైనవాణ్ణి భర్తగా స్వీకరిస్తుంది. అందుకు మిగిలినవాళ్ళు ఆమోదించి తీరాలి. లేకపోతే ఈ రాజులకు మర్యాద తెలీదనే మాట వస్తుంది. అది అలా ఉంచు. నువు ఈ సుదర్శనుడి రాజ్యం అక్రమంగా కాజేసి నీ మనవడికి కట్టబెట్టావు. స్వయంవరంలో నీ మనవడే నెగ్గవచ్చుగదా? సుదర్శనుడే నిన్నేమైనా చేస్తాడేమో చూసుకో! ఏమైనా ధర్మం జయిస్తుంది. సత్యం వృద్ధి పొందుతుంది. దుర్మార్గానికి ఒడిగట్టకు. రాజకుమార్తె ఇంతమందినీ వరించలేదుగదా! ఒక్కణ్ణి వరిస్తుంది. మిగిలినవాళ్ళు అసూయ పడరాదు," అన్నాడు.



దానికి యుధాజిత్తు, "నువు చెప్పినట్టు ఇది ఇచ్ఛా స్వయంవరమే. ఉన్నవారిలోకి ఎక్కువయోగ్యుణ్ణి రాజకుమార్తె వరిస్తే మాకూ సంతోషమే. కాని ఇంతమంది తేజోవంతులూ, ఉత్తమోత్తములూ అయిన రాజకుమారులుండగా, ఆమె ఊరూ పేరూ లేనివాణ్ణి ఎవణ్ణో వరిస్తే, మిగిలినవారంతా చూస్తూ ఊరుకోవలసిందేనా? సింహం భుజించేది నక్కకు దక్కటమా? ఏమిటి నువు చెప్పే నీతి? బ్రాహ్మణులకు వేదాలు బలం. క్షత్రియుడికి విల్లు బలం. క్షత్రియ వివాహాలకు బలమే శుల్కం. ఈ వధువు బలం గలవాడి సొత్తు!" అన్నాడు.



బెట్టుకువచ్చిన రాజకుమారులు అనేక మంది యుద్ధం చేసి అయినాసరే శశికళను పెళ్లాడే ఉద్దేశంతో ఉన్నారు. నువు ఏం చెయ్యగలవు? నీ తమ్ముడు శత్రుజిత్తు అమిత శౌర్యవంతుడు; మహాయోగ్యుడు; అందగాడు. అతనికి సహాయంగా అతని తాత, ప్రత్యేకించి నిన్ను చంపటానికే వచ్చి ఉన్నాడు. నువు రావటం ఎంత పొరపాటో ఆలోచించావా? నిన్ను ఎవరు పిలిచారో? నువు ఎందుకు వచ్చావో మరి? కాని ఉన్నమాట చెప్పాం. తరవాత నీ యిష్టం!" అన్నారు.

వారితో సుదర్శనుడు, "రాజులారా, మీ దయకు ఎంతో కృతజ్ఞుణ్ణి. కాని ఇంత దాకా వచ్చి భయపడి ఏం లాభం? నా భారమంతా నన్నిక్కడికి పంపిన మహామాతది! ఆమె నాకు ఏదో సహాయం చెయ్యకుండా శత్రువులకు అప్పగిస్తుందా? నాకు శత్రువులూ, మిత్రులూ అంటూ లేరు; అంతటా ఆ ఈశ్వరే కనబడు తుంది. ఆమె వెళ్ళమంటేనే నేనీ స్వయంవరానికి వచ్చాను. నా మీద ఎవరైనా అలిగితే వారు దేవికి శత్రువు లౌతారు! నాకు సేనలు లేవంటారా? అవసరం లేదు. ఏ దేవి ఎంతటి దుర్బలుడి కైనా బలమూ, సంపదా ఇస్తుందో ఆ దేవే నాకు బలం! ఇతర బలాలతో నాకు పని

"అది సుదర్శనుడికే అయితే అతన్నే తీసుకోనీ!" అని కొందరు పేచీ పెట్టారు.

స్వయంవరానికి వచ్చిన రాజుల మధ్య వాగ్వాదం పెరిగింది. సుబాహుణ్ణి పిలి పించారు. వారి వివాదం విని సుబాహుడు, "రాజులారా! నా కూతురు సుదర్శనుణ్ణి మనస్పూర్తిగా వరించగోరుతున్నది. అతను అర్హుడు కాడంటే వినదు. అతను స్వయంవరానికి రానేవచ్చాడు. ఎలా జర గాలని ఉంటే అలా జరుగుతుంది. వాగ్వా దాలు దేనికీ?" అన్నాడు.

సుబాహు వైఖరి తేలిపోయింది గనక, రాజులు సుదర్శనుణ్ణి పిలిపించి, "నువు ఒంటరిగా వచ్చావు. సేనలను వెంట

లేదు. శక్తులూ, అశక్తులూ అంటూ ఉండరు. మహాశక్తి అనుగ్రహానికి పాత్రులైనవారే శక్తిమంతులు; అనుగ్రహం లేనివారు బ్రహ్మాదులైనా శక్తిహీనులే! నాకు జయం కలిగినా, అపజయం కలిగినా అది జగదంబదిగాని, నాది కాదు. అందుచేత నన్ను గురించి చింతించకండి," అన్నాడు.

ఈ మాటలకు కొందరు రాజులు సంతోషించి, "అయ్యా, నీ మాటలు ముమ్మాటికీ నిజం! నువు పుణ్యాత్ముడివి. కాని నీ మీద యుధాజిత్తు పగపట్టి ఉన్నాడు, మరచిపోవద్దు సుమా!" అన్నారు.



వారు అలా అన్నమీదట సుదర్శనుడు వారితో, "రాజులారా, నా మీద మీకు గల అనుగ్రహంకొద్దీ మీరీ మాట నాకు చెప్పారు. ఈ సృష్టిలో చావు ఒకరి అధీనంలో ఉండేది కాదు. ప్రాణి అయినవాడు కర్మానికి కట్టుబడినవాడు. వాడికి స్వేచ్ఛ లేదు. కాలమూ, కర్మమూ, స్వభావమూ అనేవి అంతా నిర్ణయిస్తాయి. కాలం రాకపోతే దేవుడు కూడా చంపలేడు. యమధర్మరాజు కూడా నిమిత్తమాత్రుడే. నా తండ్రిని చంపిన సింహమూ, మా తాతను చంపిన యుధాజిత్తూ కూడా నిమిత్తమాత్రులే. ఒకవేళ చావు రావలసే ఉంటే తప్పించగలవాడెవడు? ఒకరిని ఒకరు రక్షించేదేమిటి? దైవబలం ఉంటే వెయ్యి ఏళ్ళు బతకవచ్చు! నేను దైవాన్ని నమ్ముకుని వచ్చాను. నాకు అండగా ఉండే సేన కూడా దైవమే. నాకు శత్రువు ఉంటే అది కూడా దైవమే," అన్నాడు.

ఈ మాటలు విని అందరూ సంతోషించారు.

సుదర్శనుడు తన విడిదికి వెళ్లాడు.

మర్నాడు స్వయంవరం. సుబాహుడి ఆహ్వానం అందుకుని వచ్చిన రాజులందరూ సమావేశమై, శశికళ కోసం ఎదురుచూస్తున్నారు. ఆమె ఎవరిని వరిస్తుందో అని కొందరు ఆశ్చర్యపడు



తున్నారు ; సుదర్శనుణ్ణి తప్ప మరొకరిని వరించదని కొందరు నమ్మకంగా చెబుతున్నారు ; అలా అయితే యుద్ధం తప్పదని మరికొందరు ఇంకా నమ్మకంగా అంటున్నారు.

మంగళ వాద్యాలు మోగుతూండగా, శశికళ స్నానం చేసి, అలంకరించుకుని, పట్టుబట్టలు ధరించి, చేతిలో ఇప్పపూల మాల పట్టుకుని, చెలికత్తెలతో సహా వచ్చింది. కాని ఆమె ఒక స్తంభం వద్ద ఆగిపోయి, తల వంచుకుని, ఏదో ఆలోచిస్తున్నట్టు నిలబడింది.

అది చూసి ఆమె తండ్రి సుబాహుడు నవ్వుతూ, ''అమ్మా, చూడు! ఇవాళ ఇక్కడ ఎంతెంతో గొప్ప రాజకుమారులు, ఎంతో అందగాళ్ళు, ఎంతో కీర్తిమంతులు, నిన్ను పెళ్లాడాలని వచ్చి ఉన్నారు. అన్ని విధాలా నీకు వీరిలో నచ్చినవాణ్ణి ఏరుకో!'' అన్నాడు.

ఆ మాటకు శశికళ, ''వీరు కాముకులూ, ఉన్మత్తులూ, దుర్మార్గులూ, పాపులూనూ! సాధ్వి అయినది వీరి ఎదటికి రాగూడదు ; తన భర్తను తప్ప మరొకరిని చూడరాదు. వరమాల పట్టుకుని అనేకమంది మధ్యకు వచ్చేది వెలయాలు కాదా? ఈ రాజుల మధ్యకు రావటానికి నేను వెలయాలినా, నాన్నా? నేను సుదర్శనుడి సొత్తును గదా! ఇతరులను నేను చూసే అవసరం ఏమున్నదీ? నన్ను నేను ఎందుకు అవమానించుకోవాలి? ప్రపంచం తలక్రిందులైనా నేను మరొకరిని వరించను. అందుచేత ఇవాళో, రేపో నన్ను సుదర్శనుడికే ఇచ్చి పెళ్ళి చెయ్యి,'' అన్నది.

సుబాహుడు ఇరుకున పడ్డాడు. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. వచ్చిన రాజులు మహాబలవంతులు, హెచ్చు సంఖ్యలో ఉన్నారు. బతిమాలి పొమ్మంటే పోరు. తన కూతురికి నచ్చిన సుదర్శనుడికి గాలి తప్ప మరే అండా లేదు. వీరందరి చేతా తనకు చావు తప్పేటట్టు లేదు!

కూతురు కాస్తా మృత్యుదేవత అయి కూర్చున్నది!

ఇలా ఆలోచించి సుబాహుడు అతి వినయంగా రాజుల మధ్యకు వెళ్ళి చేతులు జోడించి, "మహారాజులారా! దయామయులారా! మహాత్ములారా! నా తప్పు క్షమించి, నా మీద అనుగ్రహం ఉంచి, నే నిచ్చే కానుకలు పుచ్చుకుని, దయచెయ్యమని నా ప్రార్థన. ఎన్ని విధాల చెప్పి చూసినా నా కూతురు మరొకరిని వరించ నిరాకరించుతున్నది. దానికి అశుభమూ, శుభమూ తెలీదు. నామూలంగా మీకందరికీ నిష్కారణంగా శ్రమ కలిగింది. నా తప్పు మన్నించితే మీకు ఏనుగులూ, రత్నాలూ, గుర్రాలూ, గ్రామాలూ, దాసీలూ, ధనమూ, ఇళ్ళూ, తోటలూ, నా రాజ్యమంతా ఇచ్చేస్తాను!" అంటూ ఎన్నో విధాల ప్రార్థించాడు.

కాని అతనికి ఎవరూ ఎలాటి సమాధానమూ ఇయ్యలేదు. యుధాజిత్తు మాత్రం కోపంతో పళ్ళు పటపటా కొరుకుతూ, "ఏమిటి నువ్వనేది? బుద్ధిలేక నీ కూతుర్ని సుదర్శనుడి కియ్య నిశ్చయించి, వచ్చినవారిని వెళ్ళగొట్టలేక, నక్కజిత్తులు అవలంబిస్తే మేమందరమూ మూర్ఖులమనుకున్నావా? మొదటనే అనుమానం ఉన్నప్పుడు మూర్ఖుడివై ఇందరినీ ఎందుకు పిలిపించావు? పిలిపించిన వాడివి ఇప్పుడేడ్చి ఏం లాభం? చూడు, నేను నీ మదం అణచి, ఈ సుదర్శనుడి సంగతి ఏదో తేల్చి, నా మనమడికి నీ కూతుర్ని పెళ్ళి చేస్తాను! నాకీ సుదర్శనుడు ఉప్పా, ఊరగాయా! అందరూ ఏకమైనా ఒక్క నిమిషంలో అందరినీ జయిస్తాను! లోగడ భరద్వాజ మునిని చూసి వాడి ప్రాణం తీయలేదు. ఇవాళ వాణ్ణి ఉపేక్షించను. నీ కూతుర్ని నా మనమడికిచ్చి పెళ్ళి చేసి, నిన్నూ, నీ రాజ్యాన్నీ కాపాడుకో. లేదూ? నీ కూతుర్ని సభలోకి వచ్చి, సుదర్శనుణ్ణి తప్ప మరెవరినన్నా వరించమను," అన్నాడు.





# దేవీ భాగవతం

యుధాజిత్తు చెప్పిన దానికి కాశీరాజు ఏమీ అనలేని స్థితిలో తల వంచుకుని, అంతఃపురానికి వెళ్ళి, తన భార్యతో, "మన అమ్మాయి ఆ సుదర్శనుణ్ణి తప్ప మరెవరినైనా వరిస్తేగాని మన మానం దక్కదు," అన్నాడు.

రాణి తన కుమార్తె వద్దకు వెళ్ళి, "అమ్మా, నిన్ను పెళ్ళాడాలని అంతమంది రాజులు వచ్చి ఉండగా, సుదర్శనుణ్ణే పెళ్ళాడతానని పట్టుబట్టి, మన ప్రాణాల మీదికి ఎందుకు తెస్తావు? స్వయంవర సభకు పద. నువు సుదర్శనుణ్ణే వరిస్తానంటే, యుధాజిత్తు ఆ సుదర్శనుడితో పాటు నిన్నూ, నన్నూ, నీ తండ్రినీ కూడా చంపేస్తాడు. అతను అమిత క్రూరుడు!" అని నయానా, భయానా హెచ్చరించింది. అదే సమయంలో తండ్రి కూడా వచ్చి శశికళకు ఎన్నో విధాల చెప్పాడు.

ఎన్ని చెప్పినా, శశికళ ఆత్మహత్య చేసుకుంటానుగాని, మరొకరిని పెళ్ళాడనన్నది. ఆమె తండ్రితో, "నీకు ఈ రాజులంటే భయం అయితే నన్ను సుదర్శనుడికిచ్చి, రథంలో మమ్మల్ని పొలిమేర దాటించు. యుద్ధం జరిగితే అతను శత్రువులను తానే చంపేస్తాడు," అన్నది.

"చూడు, తల్లీ! అనేకమందితో విరోధం తెచ్చుకోవటం ఎవరి తరమూ కాదు. మొండి పట్టు పట్టకు. అన్ని పనులలోనూ సాహసం కూడదు. మిమ్మల్ని పొలిమేర బయట వదలినంత

**10.** సుదర్శనుడి రాజ్యప్రాప్తి



మాత్రాన ఆ దుర్మార్గులు మిమ్మల్ని చుట్టుముట్టితే మీరు చెయ్యగలిగినదేమున్నది? నా కొక పద్ధతి తోస్తున్నది. సీత పెళ్ళికి పెట్టినట్టుగా నీ పెళ్ళికి ఒక పరీక్ష పెట్టుతాను. అందులో నెగ్గినవాణ్ణి పెళ్ళాడు," అన్నాడు సుబాహుడు.

"అందువల్ల సమస్య తీరుతుందా? పందెంలో ఎవడో గెలిచి నన్ను పెళ్ళాడతాడు. అప్పుడు మిగిలినవాళ్ళు ఊరుకుంటారా? ఎలాగూ యుద్ధం తప్పదు. మహాదేవిని నమ్ముకుని నన్ను సుదర్శనుడికిచ్చి పెళ్ళి చెయ్యి," అన్నది శశికళ.

ఆమె నిర్ణయించిన పథకాన్ని ఆమోదించి సుబాహుడు సభకు తిరిగివచ్చి,

"మహారాజులారా! ఈ రోజుకు సభ చాలింతాం. రేపు మీకు నచ్చిన విధంగా స్వయంవరం జరుగుతుంది. ఇవాళకు మీరు మీ మీ విడుదలకు దయ చెయ్యండి," అన్నాడు.

రాజులు తమ తమ శిబిరాలకు తిరిగిపోయి, నగరం నాలుగు పక్కలా సేనలను కాపలా ఉంచారు.

సుబాహుడు రహస్యంగా వివాహ ప్రయత్నాలు జరిపించి, సుదర్శనుణ్ణి రప్పించి, తన కూతుర్ని అతనికి శాస్త్రోక్తంగా కన్యాదానం చేశాడు. ఆ సందర్భంలో ఆయన తన అల్లుడికి రెండు వందల రథాలూ, కొన్ని వేల గుర్రాలూ, కొన్ని వందల మంది దాసీలూ, ఇతర కానుకలూ ఇచ్చాడు. అతను మనోరమతో, "అమ్మా, ఇక నా కూతురు నీ కొడుకు సొత్తు, నీ సొత్తు. దాన్ని ప్రేమగా చూసుకో," అని నమస్కారం చేశాడు.

మనోరమ ఎంతో సంతోషంతో, "అయ్యా, మహారాజువై ఉండి కూడా, రాజ్యహీనుడైన నా కొడుక్కు నీ కూతుర్ని పెళ్ళి చేశావు! నీవంటి ఉత్తముడు ఎక్కడా ఉండడు. నీ కుమార్తె భారం మాది అయితే, మా భారం నీది!" అన్నది.

దానికి సుబాహుడు, "అమ్మా, నీ కొడుకు రాజ్య విహీనుడని ఎందుకు

అనుకోవాలి? నా రాజ్యం అతనిది కాదా? నా సేన అంతా ఇస్తాను. మనం నీరక్షీర న్యాయంగా ఉండేటప్పుడు ఒకడు రాజనీ, ఇంకొకడు సేవకుడనీ విచక్షణ దేనికి? ఇతర రాజులున్న మాట నిజమే. వారిని సామదానభేదాలతో అదుపులో పెట్టుతాను. అలాగూ దారికి రారూ, యుద్ధం చెయ్యటానికి నేను సిద్ధమే! జగదంబ అండ ఉండగా విచారం దేనికి?" అన్నాడు.

"ఎంత చల్లని మాట అన్నావు, బాబూ! నీకు శుభం కలుగుతుంది. నీ రాజ్యాన్ని నువూ, నీ కొడుకులూ సుఖంగా ఏలుకోండి. జగన్మాత అనుగ్రహంతో నా కొడుకు తన తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించుకుంటాడు. గ్రహచారం సరిగా ఉన్నవాడు మట్టి పట్టుకుంటే బంగారమవుతుంది. ఏది చేసినా కలిసివస్తుంది. అందరూ సహాయపడతారు. ఇప్పుడు నా కొడుకు అదృష్టం బాగున్నది. వాడి రోజులు మంచివి. కీడురాదు," అన్నది మనోరమ.

ఈలోపల విడుదులలో ఉన్న రాజులకు మంగళవాద్యాల సవ్వడి వినిపించింది. "ఈ మంగళ వాద్యాలేమిటి?"

"ఇవి పెళ్లి వాద్యాలలాగున్నాయే!"

"ఈ రాజు మన అందరి కళ్ళలోనూ దుమ్ము చల్లి, కూతుర్ని వాడికిచ్చి పెళ్లి



చెయ్యటం లేదు గదా!" అని వాళ్ళలో వాళ్ళు అనుకుంటూండగా, సుబాహుడు వచ్చి, "మహారాజులారా, పెళ్లివిందుకు తమరందరూ దయచెయ్యండి," అని ఆహ్వానించాడు.

ఈ వార్తను రాజులు ఆదరంతో వినలేదు. కాశీరాజు వారితో, "నేనేం చేసేది? నా కూతురు ఎన్నివిధాల చెప్పినా వినక, ఆ సుదర్శనుణ్ణే పెళ్లాడింది. మీరు నన్ను అనుగ్రహించి, విందులో పాల్గొని నా పరువు దక్కించండి," అన్నాడు.

"రాజా, మా భోజనాలు అయిపోయాయి. ఇప్పుడు ఎవరూ రారు. అర్ధరాత్రి పెళ్లితో అలసిపోయి ఉంటావు.



భోజనం దేమున్నదిలే! నువ్వు వెళ్ళు! మేమూ పోతాం!'' అన్నారు రాజులు.

సుబాహుడు వారినిగురించి అనుమానంతో తన భవనానికి తిరిగి వెళ్ళాడు.

అతను వెళ్ళగానే రాజులలో కొందరు సుదర్శనుణ్ణి చంపి, రాజకుమార్తెను సంగ్రహించుదామన్నారు. అది అన్యాయం; పెళ్ళి సంబరం చూసి, మన దారిన మనం పోదామన్నారు, మరికొందరు. మిగిలిన వాళ్ళు రకరకాలుగా మాట్లాడారు.

ఈ లోపల సుబాహుడు పెళ్లితంతు పూర్తిచేసి, తన కూతురికి, అల్లుడికి అప్పగింతలూ, అంపకాలూ జరుపుతూ ఉండగా, కొందరు వచ్చి, ''రాజా, వధూవరులను ఇప్పుడు పంపకు. దారిలో శత్రువులు రాక్షసులలాగా కాపువేసి ఉన్నారు.'' అని చెప్పారు.

రాజుల సంగతి ఎరిగినవాడు కావటం చేత సుబాహువు ఆ మాటనమ్మి, అంపకాలు చెయ్యటానికి సంశయించాడు.

అప్పుడు సుదర్శనుడు అతనితో, ''రాజా, నువేమీ సంకోచించవద్దు. దేవి నా పక్షాన ఉండగా ఈ రాజులు నన్నేం చెయ్యగలరు? మేం మా ఆశ్రమంలో సుఖంగా ఉంటాం! ఆశ్రమంలో కాపరం ఏమిటనుకోవద్దు. ఆ ప్రకృతి సౌందర్యం ముందు మీ నగరాలు ఎందుకూ పనికిరావు.'' అన్నాడు.

కాశీరాజు తన అల్లుడికి అంతులేని ధనం ఇచ్చి సాగనంపుతూ, సైన్యంతో సహా తాను కూడా తోడు బయలుదేరాడు.

దారులు కాచిఉన్న రాజులు దూరం నుంచి చూసి, ''అదుగో రథం! వాడే సుదర్శనుడు! పెళ్ళాంతోసహా పోతున్నాడు. పట్టుకుని కొట్టుదాంపట్టండి!'' అంటూ విజృంభించారు.

సుబాహుడు వారికి అడ్డు పడ్డాడు. సుదర్శనుడు మంత్రం జపిస్తూ, అంబను ధ్యానించాడు. ఆ సమయంలో శత్రుజిత్తూ, యుధాజిత్తూ అతని పైకివచ్చారు. సుబాహుడు వీరావేశంతో శంఖంపూరించి,

యుధాజిత్తు మీద వరసగా బాణాలు వేశాడు. ఇద్దరికీ తీవ్రంగా యుద్ధంసాగింది.

అంతలో జగదంబ దివ్యమైన ఆకారంతో, అనేక మహాయుధాలతో, పూలమాలలతో, సింహం మీద ప్రత్యక్షమయింది. సుదర్శనుడు ఆనందంతో శరీరం పులకరిస్తూండగా దేవిని తన మామకు చూపి, "ఇంక మనకు భయమేమిటి?" అని చెప్పి, రథం దిగి, తన భార్యనూ, మామనూ వెంట బెట్టుకుని, దేవి కాళ్ళకు ప్రణామం చేశాడు.

ఏనుగులు సింహాన్ని చూసి భయపడి ఘీంకారాలు చేస్తే, సింహం వాటిని చూసి గర్జించింది. అదేసమయంలో దారుణంగా గాలివీచి, భీభత్సం చెలరేగింది. రాజులందరికీ కంపరం పుట్టింది. వాళ్లు దిక్కు తెలియనట్టుగా నిశ్చేష్టులై చూడసాగారు.

అప్పుడు సుదర్శనుడు సేనాపతితో, "మహాదేవి మనకు అండగా వచ్చింది. నువు సంశయించక, రాజుల మీదికి సేనలు నడిపించు." అన్నాడు.

కాశీరాజు సేనలు రాజుల పైకి విజృంభించాయి.

అప్పుడు, తెల్లబోయి చూస్తున్న రాజులతో యుధాజిత్తు, "ఎవరో ఆడది సింహం మీద వచ్చేసరికి మీకు మతులు పోయాయేమిటి? ఒక అర్భకుడు ఒక ఆడదాన్ని



తోడు తెచ్చుకుంటే ఇందరు రాజులూ కొయ్యబారిపోతారా? క్షణంలో వాణ్ణి చంపి, రాజు కూతుర్ని వశపరుచుకుందాం పట్టండి!" అని, తన మనమడైన శత్రుజిత్తును వెంటబెట్టుకుని, సుదర్శనుడి మీద యుద్ధం సాగించాడు.

అప్పుడు అంబ అందరి రాజులకూ అన్ని రూపాలలో కనబడి, అందరితోనూ ఒక్కసారే యుద్ధం చేసింది. క్షణంలో యుధాజిత్తూ, శత్రుజిత్తూ బాణాలు తగిలి చచ్చారు. అందరూ నిర్ఘాంతపోయారు. సుబాహుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, ఆ పరాశక్తిని స్తోత్రం చేశాడు. తరవాత అతను ఆమెతో, "తల్లీ, నీ దర్శనంతో



ధన్యుణ్ణి అయాను. శాశ్వతంగా నా హృదయంలోనే నిలిచిపో! ఈ కాశిలోనే ఉండిపో. నాకు మరెవరి అండా అవసరం లేదు. భూమి ఉన్నంత కాలమూ ఈ కాశీ ఉంటుందంటారు. కాశీ ఉన్నంత కాలమూ నువు ఇక్కడే ఉండి, మాకు శత్రుభయం లేకుండా చెయ్యి. ఇదే నేను నిన్ను కోరే వరం,'' అన్నాడు.

మహాదేవి అందుకు ఒప్పుకున్నది.

తరవాత సుదర్శనుడు మహాదేవిని స్తోత్రం చేశాడు. అతను అమెను, ''తల్లీ, ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? నే నెక్కడికి పోవాలి? నేను స్వయంగా అసమర్థుడనైనప్పటికీ, నీ అండ ఉంటే ఏమైనా సాధించగలను. అందుచేత నా కర్తవ్యం తెలిపి, నన్ను అనుగ్రహించు,'' అని వేడుకున్నాడు.

దానికి దేవి, ''ఇంక చేసేదేమున్నది? నీ భార్యతో సహా అయోధ్యకు వెళ్లి, సింహాసనం ఎక్కు; తగిన విధంగా రాజ్యం చేసుకో. నిన్ను నేను పైనుంచి కాపాడుతూ ఉంటాను ప్రతి అష్టమి, నవమి, చతుర్దశికీ నన్ను పూజ చెయ్యి. నాకు శరత్కాలం ఇష్టం. నవరాత్రి పూజలు చెయ్యి. మాఘ, చైత్ర, ఆశ్వయుజ, ఆషాఢ మాసాలు నాకు ఉత్సవాలు జరిపించు," అని హెచ్చరించి అదృశ్యమయింది.

తరవాత రాజులు ఒక్కరొక్కరే వచ్చి, ఇంద్రుడికి దేవతలు మొక్కిన విధంగా సుదర్శనుడికి మొక్కి, అంబను స్తుతించారు. వాళ్ళు అతన్ని తమ చక్రవర్తిగా అమోదిస్తూ, ''మహాత్మా, నువు అయోధ్యలో ఉండి మమ్మల్నందరినీ పాలిస్తూ, మా అపచారాలన్నీ మన్నించి, మాకు ఆజ్ఞలిస్తూ రాజ్యం చెయ్యి. నీ అనుగ్రహం చేతగదా మేం జగదంబను కళ్లారా చూడగలిగాం,'' అన్నారు.

తరవాత రాజులందరూ ఎవరి దేశాలకు వారు వెళ్లిపోయారు. కాశీరాజు తన అల్లుడికీ, కూతురికీ ఏడ్కోలు చెప్పాడు.

సుదర్శనుడు అయోధ్యకు చేరేలోపునే వార్తలు చేరాయి. అందుచేత మంత్రులు మంగళ వాద్యాలతో సహా ఎదురువచ్చి, సుదర్శనుణ్ణీ, అతని భార్యనూ నగరం లోకి తీసుకుపోయారు.

సుదర్శనుడు తన సవతి తల్లి వద్దకు పోయి, కొడుకు చచ్చి ఏడుస్తున్న లీలావతికి నమస్కరించి, ఓదార్చి, "అమ్మా, నీ తండ్రినీ, నీ కొడుకునూ చంపినది నేను కాదు, మహాశక్తి! నీపాదాల సాక్షిగా చెబుతున్నాను. ఎవరో చేసిన కర్మకు నువ్వెందుకు బాధపడాలి? నన్ను నీకొడుకు లాగే చూసుకో. మనోరమ కన్న నాకు ఎక్కువకా. నేను ఎలాటి భేదబుద్ధి చూపను. నీకు ఎల్లప్పుడూ మాతృసేవలు చేస్తాను. నేను పసివాణ్ణి అయి ఉండగా నీ తండ్రి దురుద్దేశంతో నన్ను రాజ్య భ్రష్టుణ్ణిచేస్తే, అది నా ప్రారబ్ధం అనుకున్నాను గాని, దుఃఖించలేదు. నీ తండ్రి నా తాతను చంపేస్తే, నా తల్లి పుట్టెడు దుఃఖంతో నన్ను తీసుకుని అడవి దారిన పోతుంటే, మమ్మల్ని దొంగలు దోచారు. తరవాత గంగాతీరాన ఋష్యాశ్రమంలో తల దాచుకున్నాం. వాళ్ళ అనుగ్రహం వల్ల ఇవాళ ఈ స్థితికి వచ్చాం. ఇప్పటికి కూడా నాకు ఎవరి మీదా ద్వేషం లేదు" అన్నాడు.

అతని మాటలు విని లీలావతి సిగ్గుపడుతూ, "నేను వద్దంటున్నా వినకుండా నా తండ్రి నీకు ద్రోహంచేసి, తాను చావటమేగాక, నా కొడుకును కూడా చంపాడు. నీ తల్లి నా అక్క. నువు నా కొడుకువు! నేను విచారించవలసిన పనేమిటి? నా వాళ్ళు చావటానికి కారణం నువు కాదని నాకు తెలియదా?" అన్నది.

తరవాత సుదర్శనుడు తన మంత్రుల చేత ఒక బంగారు సింహాసనం తయారు చేయించి, దాని మీద జగదంబను యథావిధిగా స్థాపించి, రోజూ పూజిస్తూ ఉండమని హెచ్చరించి, తాను పట్టాభిషేకం చేసుకుని, సుఖంగా చాలా కాలం రాజ్యం చేశాడు.





# దేవీ భాగవతం

## 11. నరనారాయణులు

బ్రహ్మమానస పుత్రులలో ధర్ముడు అనే వాడు దక్షప్రజాపతి కూతుళ్ళలో పది మందిని పెళ్ళాడాడు. ధర్ముడికి నలుగురు కొడుకులు. హరీ, కృష్ణుడూ, నరుడూ, నారాయణుడూ అనేవాళ్ళు, కలిగారు. వారిలో పెద్దవారిద్దరూ యోగాభ్యాసంలో పడి, యోగులయారు.

నరనారాయణులు హిమాలయ పర్వతం మీదికి వెళ్ళి, మందాకినీ నదీ తీరాన వెయ్యి సంవత్సరాలపాటు తపస్సు చేశారు. ఆ తపస్సుకు కొండలు చలించాయి, భూమి కంపించింది. ఎవరు తీవ్రమైన తపస్సు చేసినా ఇంద్రుడికి ముందు కాళ్ళు చల్లబడటం పరిపాటి. అందుచేత అతను నరనారాయణుల తపస్సును భంగంచేయ తలచి, తన ఐరావతం మీద నరనారాయణులున్న చోటికి చేరి, ఏనుగు దిగి, వారిని సమీపించి, "మహాత్ములారా, మీరు ఏ ఆశయంతో తపస్సు చేస్తున్నారు? మీ తపస్సు చూసి పరమానందం చెంది మీరు కోరిన వరం ఇయ్యవచ్చాను. నేను ఇంద్రుణ్ణి. మీ తపస్సు చాలించండి," అన్నాడు.

తపస్సమాధిలో ఉన్న నరనారాయణులు ఇంద్రుడి మాటలు వినిపించుకోలేదు. జవాబు కూడా చెప్పలేదు.

ఇంద్రుడికి కోపం వచ్చింది. బుద్ధి వికటించి, అతను ఒక మాయను సృష్టించాడు. దాని ఫలితంగా, సింహాలూ, పులులూ, చిరుతపులులూ, తోడేళ్ళూ,



పాములూ వేలకు వేలుగా పుట్టుకొచ్చాయి. ఎటు చూసినా వరదలూ, కార్చిచ్చులూ కనిపించాయి. వీటితోబాటు చీకటి ముంచుకువచ్చింది. ఆ చీకట్లో రాళ్లవాన కురిసింది. కాని ఈ ఇంద్రజాలానికి నరనారాయణులు చలించక, తమ తపస్సులో తాము ఉండిపోయారు.

వరం ఇస్తామంటే వినిపించుకోలేదు; పులులనూ, శీతోష్ణాలనూ లక్ష్యపెట్టలేదు; ఈ నరనారాయణుల తపస్సు ఎలా భంగం చెయ్యాలో ఇంద్రుడికి తెలియ లేదు. మహాదేవి తాలూకు వాగ్బీజమూ, మాయాబీజమూ, కామబీజమూ జపిస్తూ, తపస్సు చేసుకునేవారిని కదలించటం ఎవరికీ సాధ్యం కాదని తెలుసుకుని, ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వెళ్ళి, వసంతుణ్ణీ, మన్మథుణ్ణీ పిలిచి, ఇలా అన్నాడు:

''నరనారాయణులు అనేవారు బదరికాశ్రమంలో దీక్షగా తపస్సు చేస్తున్నారు. అది మనకు మంచిదికాదు. వారి తపస్సు మాన్పించాలని నేను వెళ్ళి, వరాలిస్తాను కోరుకోమంటే నా మాట వినిపించుకున్నారుకారు. అందుకని తుఫానులూ, కార్చిచ్చులూ, క్రూరమృగాలూ సృష్టించాను. దానికీ చలించారుకారు. ఇది నీవల్ల తప్ప మరెవరివల్లా కాదని నిన్ను పిలిపించాను, మన్మథా! నువు వసంతుణ్ణీ, తగిన అప్సరస్త్రీలనూ వెంట బెట్టుకుని వెళ్ళి, ఈ పని చెయ్యాలి. హరిహరబ్రహ్మదులను జయించిన నీకు ఈ మనుషులు ఒక లెక్కా? రంభ మొదలుగాగల అప్సరలలో ఏ ఒకతె అయినా చాలు తపోభంగం చెయ్యటానికి. నువు అనేకమంది అప్సరలను వెంట బెట్టుకుపో. వారి ముందు ఏ తపస్సూ నిలవలేదు.''

దానికి మన్మథుడు, ''దేవా, నేను నీ కింకరుణ్ణి. నీ ఆజ్ఞ పాలించటం నా విధి. అయినా ఒక్క భయం, నా మనసులో ఉన్నది, చెప్పుకోనియ్యండి. మీరు చెప్పిన హరిహర బ్రహ్మలను గురించి తపస్సు చేసేవారికి తపోభంగం

చెయ్యగలనుగాని, దేవిని గురించి తపస్సు చేసేవారి తపస్సు పాడుచెయ్యటం నా తరంకాదు. కామబీజం హృదయంలో ఉంచుకుని ధ్యానించేవారి జోలికి వెళ్ళే ధైర్యం నాకు లేదు. ఈ నరనారాయణు లనే వాళ్ళు ఆదిశక్తికి భక్తులు. వాళ్ళను నా బాణాలు ఏమీచెయ్యలేవు,'' అన్నాడు.

అయినా ఇంద్రుడు, ''సూటిగా నీ బాణాలతో వారిని జయించలేకపోతే ఏదైనా మాయోపాయం చెయ్యి. ఇది దేవ కార్యం! దీన్ని నువు సాధించి తీరాలి,'' అన్నాడు.

మన్మథుడు ఇంకేమీ అనక, ముందుగా వసంతుణ్ణి బదరికాశ్రమానికి పంపించి, వెనకగా తాను కూడా రంభ మొదలైన అప్సరసలతో అక్కడికి వెళ్ళాడు.

అప్పటికే ఆశ్రమం వసంతశోభతో చాలా అందంగా ఉన్నది. రకరకాల చెట్లు పుష్పించి ఉన్నాయి. గాలి నిండా సువాసనలు చెలరేగి ఉన్నాయి. చిలుకలు గుంపులు గుంపులుగా చెట్ల మీద చేరి అరుస్తున్నాయి. కోయిలలు కూస్తున్నాయి. తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి.

నరనారాయణులు తమ చుట్టూ కలయజూసి, శిశిరరుతువులో ఈ వసంత లక్షణాలు ఎలా వచ్చాయా అని ఆశ్చర్య పడ్డారు. తమకు తపోభంగం కలిగించ



టానికి ఇంద్రుడు చేసిన పన్నాగమే అయి ఉండవచ్చునని వారికి అనుమానం కలిగింది.

ఇంతలో, మేనక మొదలైన అప్సరలను పదహారు వేల యాభైమందిని వెంటబెట్టుకుని, కోయిలలనూ, చిలుకలనూ తోడు తెచ్చుకుని, విల్లుతోనూ, పూల బాణాల పొదితోనూ మన్మథుడు వచ్చి, వారి ఎదట నిలిచాడు. నరనారాయణులు తపస్సు చాలించి, మన్మథుడికేసి కొంచెం ఆశ్చర్యంతో చూశారు.

అప్పుడు అప్సరలు నరనారాయణులకు నమస్కారం చేసి, కామోద్రేకం కలిగించే పాట పాడారు. వారి ఆటలూ,



పాటలూ చూసి ఆశ్చర్యపడుతూ నరనారాయణులు ఇలా అన్నారు:

''మా తపస్సు భగ్నం చెయ్యటం కోసం మీ యజమాని అయిన ఇంద్రుడు మిమ్మల్నీ, వసంతుణ్ణీ, మన్మథుణ్ణీ పంపాడు. అతని ఈర్ష్య తెలుస్తూనే ఉన్నది. ఏమైనా, మా మాటలు కొంచెం ఆలకించండి. పాపం, ఆడకూతుళ్ళు, మీరు చాలా దూరం నుంచి వచ్చి, అలసి ఉన్నారు. ఈ ఆశ్రమంలో మీరు మా ఆతిథ్యం స్వీకరించి, విశ్రమించండి. ఆ ఇంద్రుడు పొమ్మంటే వచ్చారుగాని, మీ అంతట మీరు ఇక్కడికి వస్తారా? ఇంద్రుడి చాదస్తంగాని, మా తపస్సు పాడు చెయ్యటం మీ తరమా? చూడండి. మా తపశ్శక్తితో మీ అందరి అందాన్నీ తలదన్నే స్త్రీని సృష్టించగలం!''

నారాయణుడు తన కుడి తొడ మీద చేతితో కొట్టాడు. వెంటనే ఊర్వశి, (తన చెలికత్తెలతో సహా,) పుట్టుకొచ్చింది. ఆమె అందం చూచి నిర్ఘాంతపోయి, అప్సరలు మునులతో ఇలా అన్నారు:

''మహాత్ములారా, మమ్మల్ని క్షమించండి! మీ తపశ్శక్తి తెలియక, తపోభంగం చేయాలనే దురుద్దేశంతో మేం వచ్చాం. లోగడ ఎందరెందరు మునీశ్వరుల వ్రతాలనే చెడగొట్టాం, కాని మా శక్తి మీ ముందు ఎందుకూ పనికిరాదు. ఒక విధంగా, ఇంద్రుడు మీ తపస్సు పాడు చెయ్యటానికి మమ్మల్ని పంపటం మా మహాభాగ్యమే!''

నారాయణుడు ఈ మాటలకు చిరునవ్వు నవ్వి, ''మీరీ ఊర్వశిని వెంటబెట్టుకుపోయి, దేవేంద్రుడికి కానుకగా ఇయ్యండి,'' అన్నాడు.

దానికి అప్సరలు, ''మహాత్మా, మమ్మల్ని వెళ్ళమనవద్దు. మీరు మీ తొడల నుంచి సృష్టించిన ఊర్వశీ, తదితర స్త్రీలూ ఇంద్రుడి వద్దకు పోతారు. మమ్మల్ని మీ సేవచేస్తూ ఇక్కడే ఉండనియ్యండి.'' అన్నారు.

"మీరు నా నుంచి ఏం కోరు తున్నారు?" అని నారాయణుడు వారిని అడిగాడు.

"మీ వంటి వారు మాట తప్పరు. మా కోరిక తీర్చదలిస్తే, మాకు నువు భర్త కావాలి. ఇందుకు ఒప్పుకో. లేక పోతే మేం అనాథలం! మాకు నువు ఉంటే స్వర్గం అవసరం లేదు." అన్నారు ఆ దేవకాంతలు.

"చలికీ, ఎండకూ, గాలికీ తట్టుకుని చేసిన తపస్సు మీ యౌవనం పాలు చేయటం మంచిదా?" అని నారాయణుడు అన్నాడు.

"మునీశ్వరా, దేవవేశ్యలమైన మాతో అంతులేని సుఖాలనుభవిస్తూ, గంధమాదనపర్వతం మీద జీవించటం కంటె విశేషమైన జీవితం స్వర్గంలో మాత్రం ఏమున్నది?" అన్నారు అప్సరలు.

నారాయణుడు తాను తప్పు చేసినట్టు గ్రహించాడు. అప్సరలు తమ తపస్సు పాడుచేయ వచ్చారని తెలిసినాక తాను మౌనంగా ఉండిపోవలసింది. అలా చేయక తాను తన ధర్మానికే విరుద్ధంగా, వారికంటె అందమైన స్త్రీని సృష్టించటం పొరపాటు. వారిని శృంగారాలాపాలలోకి దిగనియ్యటం ఇంకా పొరపాటు. మహా మోహపాశం తనను చుట్టనే చుట్టింది!



వారి మీద ఆగ్రహం తెచ్చుకుని, తరిమి వెయ్యాలని నారాయణుడికి ఆలోచన వచ్చిందిగాని, ఆగ్రహం హింసకు దారి తీస్తుందని భయపడి, ఏమి చెయ్యటానికీ పాలుబోని స్థితిలో పడ్డాడు.

నరుడు ఇది గ్రహించి, "మిత్రమా, కోపం ఎటువంటి వారికీ తగదు. అహంకారం కారణంగానే గదా పూర్వం మనకూ ప్రహ్లాదుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. వీళ్లను శాంతంగానే పంపించు." అని నారాయణుడితో అన్నాడు.

ఆ మాటతో నారాయణుడు మనశ్శాంతి పొంది, "నేను ఈ స్థితిలో స్త్రీలతో విహారాలు చెయ్యటం ఊహించరాని విషయం.



అందుచేత మీరు ప్రస్తుతానికి స్వర్గానికి తిరిగి వెళ్ళండి. నాకు వ్రతభంగం కాకుండా ఇప్పుడు అనుగ్రహించారంటే, ద్వాపరయుగంలో మీ ఇష్ట ప్రకారం ఆచరించగలను. దేవతల కోరిక ప్రకారం నేను భూమి మీద పుట్టుతాను. మీరు రాజకుమార్తెలుగా పుట్టి, రకరకాలుగా నాకు భార్యలు కండి.'' అన్నాడు.

ఆ మాట మీద అప్సరలు ఊర్వశి మొదలైన వారితో స్వర్గానికి తిరిగివెళ్ళి, ఇంద్రుడికి జరిగినదంతా చెప్పారు.

ఊర్వశి సౌందర్యం చూసి ఇంద్రుడు దిగ్భ్రమ చెంది, నరనారాయణుల శక్తిని మెచ్చుకున్నాడు.

తరవాత నరనారాయణులు తమ తపస్సు తాము నిర్విఘ్నంగా కొనసాగించారు.

తరవాత వాళ్ళు భృగుడి శాపం కారణంగా కృష్ణార్జునులై జన్మించారు. కృష్ణావతారానికి పూర్వ కథ ఇలా జరిగింది:

ఒకసారి భూదేవి ఇంద్రుడి వద్దకు వెళ్ళి, తాను భారం మొయ్యలేకుండా ఉన్నానని మొర పెట్టుకున్నది. ఇంద్రుడు ఆమెను చూసి జాలిపడి, ''నీ కింత దుఃఖం కలగటానికి కారణం ఏమిటి?'' అని అడిగాడు.

భూదేవి ఇలా చెప్పింది:

భూభారం కలిగిస్తున్న దుర్మార్గులు జరాసంధుడూ, శిశుపాలుడూ, కంసుడూ, రుక్మి, నరకుడూ, సాల్వుడూ, కేశీ, ధేనుకుడూ, వత్సకుడూనూ. వీళ్లు పరమ దుర్మార్గులు; ఒకరి నొకరు ద్వేషించుకుంటూ అధర్మంగా ప్రవర్తిస్తున్నారు. వీరి భారం దుర్భరంగా ఉన్నది. వెనక హిరణ్యాక్షుడి బాధ నుంచి నన్ను కాపాడటానికి విష్ణువు వరాహావతారం ఎత్తాడు. ఆ విధంగానే యిప్పుడీ భారం నుంచి తప్పించమని భూదేవి ఇంద్రుణ్ణి వేడుకున్నది.

''నీ భారం తీర్చటానికి నేనేపాటి వాణ్ణి? బ్రహ్మ వద్దకు పోతే, ఆయన

ఏదైనా ఉపాయం చెబుతాడేమో! నేను కూడా వస్తాను. ఇద్దరమూ ఇప్పుడే బయలుదేరి పోదాం,'' అన్నాడు ఇంద్రుడు.

ఇద్దరూ కలిసి బ్రహ్మ వద్దకు వెళ్లారు. బ్రహ్మ కూడా భూదేవిని, ఇంద్రుడు అడిగినట్టుగానే, నీకు వచ్చిన కష్టం ఏమిటని అడిగాడు.

"కలి రాబోతున్నది. అధర్మం పెచ్చు మీరుతుంది. రాజులు ఔదార్యం విడిచిపెట్టి దొంగలుగా తయారు కాబోతున్నారు. ఇది భారం కాదా? దుర్మార్గుల నందరినీ నిర్మూలించి, నా బరువు తగ్గించరాదా?'' అన్నది భూదేవి.

''తల్లీ, నీ కోరిక తీర్చే శక్తి నాకు లేదు. అందుకు విష్ణువే తగినవాడు. అతడి వద్దకు పోదాం,'' అని బ్రహ్మ తన హంస వాహనం మీద దేవతలనూ, భూదేవినీ వెంటబెట్టుకుని, వైకుంఠానికి వెళ్ళాడు. విష్ణువు అందరినీ వేరు వేరుగా కుశల ప్రశ్నలు చేసి, వాళ్ళు వచ్చిన పని అడిగాడు. ''భూదేవి భారం మొయ్యలేనంటున్నది. అందుచేత నువు ద్వాపర యుగాంతంలో అవతారం ఎత్తితే మంచిది. అనాథలను ఉద్ధరించటానికి నీ కన్న వేరెవరున్నారు?'' అన్నాడు బ్రహ్మ విష్ణువుతో.

''యోగమాయ ముందు నువూ, నేనూ, శివుడూ, దేవతలూ అస్వతంత్రులం. అందుచేత ఆమె ఏం చెయ్యమంటే మనం అలా చేతాం. ఆమె ప్రేరణతోనే కదా నేను ముందు కొన్ని అవతారాలెత్తాను? అంతేగాని చేపగానూ, పందిగానూ ఇతర క్షుద్రజంతువులుగానూ అవతరించటంలో సుఖమూ, పుణ్యమూ మరో సారస్యమూ, ఏమున్నదని? రామావతారం ఎత్తి, అడవుల పాలై, భార్యను పోగొట్టుకుని, ఎన్ని దురవస్థలకు గురి అయాను కాను? నా కుండిన స్వేచ్ఛ ఏమిటి? అందుచేత మీరు ఆ జగదంబను వేడుకోండి. మీ పని తీరుతుంది,'' అన్నాడు విష్ణువు బ్రహ్మ మొదలుగాగల వారితో.





# దేవీ భాగవతం

విష్ణువు చెప్పిన సలహా ప్రకారం బ్రహ్మ మొదలుగా గల వారందరూ మహాదేవిని ప్రార్థించారు. ఆమె ప్రత్యక్షమయింది. దేవతలు ఆమెను స్తుతించి. "దేవీ, కంసుడు మొదలుగా గల దుష్టులవల్ల కలిగిన భారాన్ని సహించలేక భూదేవి నిన్ను శరణు వేడుతున్నది. హరిహరాదులు సైతం చంపలేని రాక్షసులను నువు సంహరించి ఉన్నావు. అందుచేత ఆమె భారం తీర్చు." అన్నారు.

"తల్లీ, శక్తి సహాయం లేకుండా ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? బ్రహ్మకు సరస్వతీ, విష్ణువుకు లక్ష్మి, శివుడికి పార్వతీ ఉండబట్టే వారు తమ తమ విధులు సమర్ధతతో నిర్వర్తించ గలుగుతున్నారు. లేకపోతే వారివల్ల ఏమైనా అవుతుందా?" అన్నాడు ఇంద్రుడు.

"నీ సహాయం లేకపోతే మేం త్రిమూర్తులం శక్తిహీనులమే. ఎవరి సహాయమూ లేకుండా అన్నిటికీ సమర్థురాలివి నువు ఒకతెవే!" అన్నాడు విష్ణువు.

ఈ ప్రశంసలతో తృప్తిపడి జగదంబ, "ఇంతకూ నా వల్ల మీకు ఎలాటి సహాయం కావాలి?" అని అడిగింది.

"తల్లీ, రాజులందరూ పాపాత్ములై క్షోభపెట్టుతూ ఉంటే భూదేవి భరించలేక ఏడుస్తున్నది, చూడు! ఆమె భారం తీరాలని మేమంతా కూడా కోరుతున్నాం. నువు పూర్వం, దానవ బలాల అంద

**12. కంసుడు**



చూసుకుని విజృంభించిన మహిషాసురుడి మదం అణచావు. శుంభ, నిశుంభులను నిర్మూలించావు. రక్తబీజుణ్ణి మట్టుబెట్టావు. చండముండాది రాక్షసులూ, ధూమ్రలోచనుడూ, దుర్ముఖుడూ, దుస్సహుడూ, కరాళుడూ అందరూ నీ చేత చచ్చారు. భూభారం తీర్చి మమ్మల్ని అనుగ్రహించు,'' అన్నారు దేవతలు.

ఆ మాటలకు మహాదేవి నవ్వి, ''జరాసంధుడు మొదలైన దుర్మార్గులను నిర్మూలించాలన్న నిర్ణయం ముందే చేసుకున్నాను. దేవతలంతా మీమీ అంశలతో భూమిపైన జన్మించండి. కశ్యపుడు యాదవకులంలో వసుదేవుడై పుట్టుతాడు. భృగుడి శాపం పొందిన విష్ణువు అతనికి కొడుకుగా పుట్టుతాడు. నేను నందుడి కూతురుగా పుట్టుతాను. నందుడికీ, యశోదకూ నేను కూతురుగా పుట్టి, చేయవలసిన పనులన్నీ సంతోషంగా నిర్వర్తిస్తాను. నిర్బంధంలో పుట్టిన విష్ణువును గోకులానికి పంపిస్తాను. దేవకి గర్భాన ఉండిన శేషుణ్ణి రోహిణీ గర్భానికి మార్చుతాను. నా శక్తి యుక్తుల సహాయంతో బలరామ కృష్ణులిద్దరూ దుర్మార్గులైన రాక్షసుల నందరినీ ద్వాపరయుగాంతంలో చంపేస్తారు. ఇంద్రుడి అంశన అర్జునుడు రాజులందరినీ చంపుతాడు. యముడి అంశన ధర్మరాజూ, వాయువు అంశన భీముడూ, అశ్వినుల అంశన నకుల సహదేవులూ, వసువు అంశన పుట్టే భీష్ముడూ దుష్టసంహారం చేస్తారు. మిమ్మల్ని సాధనాలుగా పెట్టుకుని, చేయవలసినదంతా నేను చేస్తాను. ఇక మీరు మీ మీ స్థానాలకు తిరిగి వెళ్ళండి.'' అని అంతర్ధానమయింది.

కాళిందీ తీరాన ఎత్తయిన చెట్లతో అందమైన మధువనం ఉండేది. అందులో లవణుడు అనే రాక్షసుడు, పరమ దుర్మార్గుడు, మధువు అనే వాడికొడుకు, ఉండేవాడు. బ్రాహ్మణులను బాధలు పెట్టే ఆ రాక్షసుణ్ణి శత్రుఘ్నుడు అనే

వాడు చంపి, ఆ వనంలో ఒక నగరం నిర్మించాడు. అదే మధురానగరం.

అయితే శత్రుఘ్నుడి వంశం వాళ్ళు దాన్ని ఎక్కువకాలం పాలించలేదు. మధురానగరం యదువంశపు రాజుల వశమయింది. దాన్ని యయాతి కొడుకు శూరసేనుడు ఏలాడు. వరుణ శాపం పొందిన కశ్యపుడు అతనికి కొడుకై, వసుదేవు డనే పేరుతో పుట్టాడు. అదితి దేవకి అనే పేరుతో పుట్టి వసుదేవుడికి భార్య అయింది. అయితే వసుదేవుడు వైశ్యవృత్తి అవలంబించటం వల్ల, మధు వంశంలో పుట్టిన ఉగ్రసేనుడు మధురా పురాన్ని పాలిస్తూ వచ్చాడు. కంసుడు అతని కొడుకు. దేవకి దేవకుడి కూతురు.

దేవకుడు దేవకిని వసుదేవుడి కిచ్చి పెళ్ళిచేశాడు. పెళ్ళి వేడుకల సందడి మధ్య ఆకాశవాణి, "ఓ కంసుడా, ఈ దేవకి కొడుకులలో ఎనిమిదోవాడు నిన్ను చంపుతాడు," అని చెప్పింది.

ఈ మాటలకు కంసుడు బెదిరిపోయి, దిగులుపడి, దేవకిని చంపేస్తే తనకు ప్రమాదం తప్పుతుంది గదా అనుకున్నాడు కాని, చెల్లెలుగా సన్మానించ వలసిన ఉత్తమురాలిని చంప వచ్చునా అని అతని అంతరాత్మ బాధపడింది. అయినా తాను చావటం కన్న దేవకిని చంపటం



కొంచెం నయమే గదా అనుకున్నాడు కంసుడు. ఎందుకంటే, ప్రాణం ఉంటే ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం చేసుకో వచ్చు. ఏ పాపం చేసి అయినా ప్రాణం నిలుపుకోవాలి గద!

ఇలా అనుకుని కంసుడు, అందరూ చూస్తుండగానే, కత్తి చేతబట్టి, పెళ్ళి కూతురు జుట్టు ఇంకో చేతపట్టుని, ఆమె తల నరకటానికి సిద్ధపడ్డాడు. ఆమె తనకు చెల్లెలనీ, తనకు ఎటువంటి ద్రోహమూ చేసినది కాదనీ ఆ కఠినాత్ము డికి తోచలేదు.

ఆ క్షణంలో వసుదేవుడు అడ్డుపడక పోతే దేవకి తల తెగి ఉండేదే! ఇంతలో



యాదవ వీరులందరూ ఏకమై, "ఓరి దుర్మార్గుడా! ఎంతపనికి ఒడిగట్టావురా?" అని కంసుడితో పోరుకు సిద్ధపడ్డారు. కంసుడు దేవకిని విడిచి, వారిని ఎదుర్కో వలసి వచ్చింది.

వృద్ధులు అశుభమైన కొట్లాటను ఆపి, కంసుడితో, "పెళ్లికూతురు! ఉత్తమురాలు! చెల్లెలు! దాన్ని చంపుతావురా? ఆ మాట లన్నది నిజంగా ఆకాశవాణి అనుకున్నావా? ఎవడో అసత్యవాది వసుదేవుడి ఇల్లు కూల్చాలన్న దుర్బుద్ధితోనూ, నీకు అపఖ్యాతి కలిగించాలనీ గారడీ చేశాడు! బుద్ధిమంతులు ఇలాటి ఇంద్రజాలాన్ని పాటిస్తారా? కాదూ? ఆకాశవాణే అన్న దనుకుందాం! జరగ వలసి ఉన్నదాన్ని నువు తప్పించ గలవా?" అన్నారు.

వసుదేవుడు కూడా, "నీకు వచ్చిన భయం లేదు. ఇంత మందీ వింటుండగా ప్రమాణం చేసి చెబుతున్నాను; దేవకికి పుట్టిన బిడ్డలందరినీ నీ కిస్తాను. వారిని చంపెయ్యి. ఈ మాట నేను తప్పిన పక్షంలో నాపూర్వులు నరకానికి పోవాలి!" అని కంసుడికి మాట ఇచ్చాడు.

వసుదేవుడు సూర్య చంద్రులు తల కిందైనా ఆడితప్పడని అందరూ కంసుడికి గట్టిగా చెప్పారు. కంసుడు వసుదేవుడి మాట పాటించి, తన పట్టువిడిచి పెట్టాడు. వసుదేవుడు దేవకిని తీసుకుపోయి, తన ఇంట సుఖంగా ఉన్నాడు.

కొంత కాలానికి దేవకి గర్భవతి అయి, పండులాటి కొడుకును కన్నది.

వసుదేవుడు దేవకితో, "ఈ పిల్లవాణ్ణి చంపటానికి కంసుడి కిస్తాను. నువు శోకించకు. ప్రారబ్ధం దాటరానిది," అన్నాడు.

దానికి దేవకి, "ప్రారబ్ధానికి విరుగుడు లేకేం? చేసిన పాపాలు పోయి, స్వర్గం రాగలందులకు తీర్థయాత్రలు చేయాలని పెద్దలు చెప్పరా! సత్కర్మలతో పాపం పరిహారం కావటం లేదా? బ్రహ్మ

హత్యలాటి దానికి కూడా ప్రాయశ్చిత్తం ఉంటుంది గదా? మనువు మొదలైన శాస్త్రకారులు చెప్పినదంతా అబద్ధమేనా? జరిగేది జరిగి తీరుతుందనటంలో వివేకం లేదు. చేసిన యత్నానికి ఫలితం కలగటం స్పష్టంగా చూస్తున్నాం. లేని పక్షంలో వేదాలూ, యజ్ఞాలూ, మహామునులూ, గొప్ప ఔషధాలూ మొదలైనవన్నీ అబద్ధమే గద. ఇప్పుడేదన్నా ఉపాయం ఆలోచించు,'' అన్నది.

ఈ మాటకు వసుదేవుడు ఒప్పుకోక, ''ప్రయత్నం చెయ్యాలన్నది నిజమే. కాని కేవలమూ ప్రయత్నంవల్లనే ఫలం రాదు. దైవవశమైన యత్నమే ఫలిస్తుంది. వర్తమానంలో చేసిన దానికి ప్రాయశ్చిత్తం గాని, ప్రారబ్ధానికి ప్రాయశ్చిత్తం లేదు. సారంలేని ఈ జీవితంలో సత్యం ఒకటే సారమైనది. దాన్ని ఎవరైనా వదులుకుంటారా? సత్యంకోసం కష్టసుఖాలు లక్ష్యపెట్టనివారికే శుభం కలుగుతుంది. అందుచేత ఈ బిడ్డను కంసుడికి ఇయ్యటానికి ఒప్పుకో,'' అన్నాడు.

ఏడుస్తూ దేవకి తన మొదటి బిడ్డను తన భర్త చేతిలో పెట్టింది. తన మాట నిలబెట్టుకోవటానికి బిడ్డను కంసుడి దగ్గిరికి తీసుకుపోతున్న వసుదేవుణ్ణి చూసి అందరూ మెచ్చుకున్నారు. తడి ఆరని బిడ్డను తెచ్చి తనకు అర్పించిన వసుదేవుణ్ణి కంసుడు కూడా మెచ్చుకుని, ''నన్ను చంపేది దేవకి అష్టమగర్భాన పుట్టేవాడు





కదా? నాకు వీడితో పనిలేదు, తీసుకుపోయి నువే పెంచుకో,'' అన్నాడు.

వసుదేవుడు బిడ్డతో తిరిగి వెళ్ళిపోయాడు.

కంసుడు తాను చేసిన పని గురించి తన మంత్రులకు చెప్పగా వారు కూడా కంసుణ్ణి మెచ్చుకున్నారు.

కంసుడి వద్దకు నారదుడు వచ్చాడు. కంసుడు ఆయనను అర్ఘ్యపాద్యాలతో సత్కరించాడు. నారదుడు కంసుడితో, ''ఓయి, పిచ్చివాడా! దేవకి కన్న శిశువును చంపకుండా వదిలేశావే! ఎంత తెలివి తక్కువవాడివి! నిన్ను చంపించటానికి విష్ణువు దేవకి గర్భాన పుట్టేలాగా దేవతలు పథకం వెయ్యటం నేను స్వయంగా విన్నాను.'' అన్నాడు.

''నాకు చావు అష్టమ గర్భం నుంచి అని ఆకాశవాణి అన్నది. మొదటి గర్భాన్నే చంపటం దేనికి?'' అని కంసుడు నారదుణ్ణి అడిగాడు.

''దేవతల మాయలు తెలుసుకోలేకుండా ఉన్నావు. నీకు హాని కలిగించేది దేవకి ఎనిమిదో సంతానమే అయినా, వాడికి మిగిలిన ఏడుగురూ తోడు ఉంటే నీకు మరింత కష్టమా, కాదా?'' అన్నాడు నారదుడు.

నారదుడు వెళ్ళిపోయాక కంసుడు దేవకి కన్న బిడ్డను తెప్పించి, రాతికేసి కొట్టి చంపాడు.

నారదుడు దేవకి బిడ్డలను కంసుడి చేత పని పెట్టుకుని చంపించటానికి కారణం ఉన్నది.

స్వాయంభువమన్వంతరంలో మరీచికి ఊర్ణ అనే భార్య యందు ఆరుగురు కొడుకులు కలిగారు. వాళ్ళు ఒకసారి బ్రహ్మను, తన కూతురినే భార్యగా చేసుకున్నాడని హేళన చేశారు.

బ్రహ్మకు కోపం వచ్చి వాళ్ళను రాక్షస జన్మ ఎత్తమని శపించాడు. ఆ శాపం వల్ల వాళ్ళు కాలనేమికి ఒక జన్మలో కొడుకులుగా పుట్టి, రెండో జన్మలో

హిరణ్యకశిపుడి కొడుకులుగా పుట్టటం జరిగింది.

ఈసారి వాళ్ళు శాపవిమోచనం కోసం బ్రహ్మను గురించి తపస్సు చేశారు. బ్రహ్మ ప్రత్యక్షమై, ''అప్పుడేదో కోపం కొద్దీ మిమ్మల్ని శపించాను. వరం కోరండి,'' అన్నాడు.

ఆ ఆరుగురూ బ్రహ్మతో, ''నీకు వరం ఇయ్యాలని ఉంటే, మాకు దేవతల వల్లా, రాక్షసులవల్లా, మానవులవల్లా చావు లేకుండా వరం ఇయ్యి. స్థిరంగా బతుకుతాం,'' అన్నారు.

బ్రహ్మదేవుడు వారికి అలాగే వరం ఇచ్చాడు.

తన కొడుకులు తనను కాదని బ్రహ్మదేవుడి నుంచి వరాలు పొందినందుకు హిరణ్యకశిపుడు ఆగ్రహించి, వాళ్ళను తన వద్ద నుంచి వెళ్ళగొట్టాడు. అతను తన కొడుకులతో, ''మీరు పాతాళానికి పోయి, అస్తమానమూ నిద్రకు వశులై చాలాకాలం ఉండి, అనంతరం దేవకి గర్భాన పుట్టండి. కిందటి జన్మలో మీ తండ్రి అయిన కాలనేమి కంసుడుగా పుట్టి, మిమ్మల్ని పుట్టినవాళ్ళను పుట్టినట్టుగానే చంపేస్తాడు,'' అన్నాడు.

హిరణ్యకశిపుడి శాపంతో ఆ ఆరుగురూ దేవకిగర్భాన జన్మించి, పుట్టుతూనే కంసుడి చేతిలో చచ్చారు.

దేవకి ఏడవసారి గర్భవతి అయింది. కాని ఆయిదో మాసంలో ఆమెకు గర్భస్రావం అయిందని పుకారు పుట్టింది. ఈ సంగతి విని, కంసుడు ఎంతో సంతోషించాడు.

నిజంగా జరిగినదేమంటే, యోగమాయ దేవకి గర్భాన్ని రోహిణికి మార్చింది. కొంత కాలానికి గోకులంలో రోహిణి బలరాముణ్ణి కన్నది.

ఎనిమిదోసారి దేవకి గర్భం దాల్చింది. ఈసారి ఆమె గర్భంలో ఉన్నవాడు విష్ణువు. యోగమాయ తానుకూడా ఆ గర్భంలో చేరింది. ఈసారి కంసుడు దేవకీ వసుదేవులను నిర్బంధంలో ఉంచాడు.






కంసుడు వసుదేవుణ్ణి భార్యతో సహా కారాగృహంలో పెట్టి, భటులను కావలి ఉంచాడు. దేవకి గర్భంలో విష్ణువుకు పదిమాసాలు నిండాయి.

శ్రావణ బహుళ అష్టమి వచ్చింది. ఆనాడు రోహిణీ నక్షత్రం. కంసుడు బెదిరిపోతూ తన భటులతో, "ఇది ఎనిమిదో గర్భం. నాకు అపాయకరమైనది. ఈ గర్భాన పుట్టేవాడే నన్ను చంపేవాడు. వాణ్ణి చంపితేగాని నాకు నిద్ర ఉండదు. లేకపోతే సర్వనాశనం తప్పదు గనక మీరు ఎంతో హెచ్చరికగా ఉండి, పురుడు రాగానే నాతో చెప్పాలి." అని చెప్పి, ఇంటికిపోయి, మనశ్శాంతి ఏ మాత్రమూ లేనివాడయ్యాడు.

భటులు ఆయుధాలు ధరించి, ఎంతో శ్రద్ధగా కావలికాస్తున్నారు.

అప్పుడు దేవకి వసుదేవుడితో ఇలా అన్నది:

"నాకేమో ప్రసవం రాబోతున్నది. చుట్టూ రాక్షసులు కాపలా కాస్తున్నారు. మొదట నేనూ, నందుడి భార్య అయిన యశోదా మా పిల్లలను మార్చుకునేటట్టు ఏర్పాటు చేసుకున్నాం. కాని ఆ పని ఎలా చేయటం?"

ఈ మాట అంటూనే దేవకి నొప్పులు వచ్చి బిడ్డను కన్నది. పుట్టినబిడ్డ చాలా అందంగా ఉన్నాడు. దేవకి తన భర్తను దగ్గిరికి పిలిచి, బిడ్డణ్ణి చూపిస్తూ, "వీడి ముఖం కాంతీ, విశాలమైన కళ్ళూ,

13. కృష్ణజననం



మెత్తని ఒళ్ళూ చూడు! ఎవరికైనా ఇలాటి బిడ్డ పుట్టాడా! బతకని బిడ్డ బారెడు అంటారే! ఆ మాట అబద్ధం అవుతుందా? వీణ్ణి చేతులారా తీసుకు పోయి, చంపమని ఎలా ఇస్తావు?'' అన్నది.

వసుదేవుడు ఆ పిల్లవాణ్ణి చూస్తూ, ఏ మనటానికీ తోచక, అలాగే ఉండి పోయాడు. ఇంతలో ఆకాశవాణి ఇలా అన్నది: ''భటులందరూ నా మాయచేత గాఢనిద్రలో ఉన్నారు. కారాగృహంద్వారా లన్నీ తెరిచే ఉన్నాయి. నీకు అడ్డేమీ లేదు. ఈ బిడ్డను గోకులానికి తీసుకు పోయి, యశోద ఇంట ఉంచు.''

ఈ మాట వినగానే వసుదేవుడు బిడ్డను ఎత్తుకుని, బంధవిముక్తుడై, తెరిచి ఉన్న ఎనిమిది ద్వారాలూ దాటి, యోగమాయా ప్రభావంవల్ల ఎవరికంటా పడకుండా, వేగంగా కాలిందీ నదీ తీరాన్ని చేరి, ''దీన్ని ఎలా దాటటమా?'' అని ఆలో చిస్తూండగా, అందులోని నీరు మొల లోతుకు తగ్గిపోయింది. వసుదేవుడు శీఘ్రంగా గోకులం చేరి, నిర్జనమైన దారి వెంట కొంతదూరం వెళ్ళి, నందుడి ఇల్లు ప్రవేశించాడు. ఇంటి ముందు అంతులేని గోవులున్నాయి.

అప్పుడే నందుడి భార్య అయిన యశోదకు యోగమాయ కూతురి రూపంలో పుట్టింది. యశోద తన బిడ్డను వసుదేవుడి కిచ్చి, అతని కొడుకును తాను పెంచ టానికి తీసుకున్నది. వసుదేవుడు ఆ పిల్లను కారాగృహానికి తెచ్చి, దేవకి పక్కలో ఉంచి, విచారంగా కూర్చున్నాడు.

అప్పుడా బాలిక సన్న సన్నగా ఏడవ నారంభించింది. కావలివాళ్ళు కంగారు పడుతూ నిద్రలేచి, త్వరగా కంసుడి వద్దకు వెళ్ళి, దేవకి ప్రసవించిందని చెప్పారు. కంసుడు వేగంగా వచ్చి, వసుదేవుడితో, ''ఇది అష్టమ గర్భం! సాక్షాత్తూ విష్ణుమూర్తే నన్ను చంపటానికి ఈ గర్భాన జన్మిస్తున్నాడట గదా!

ఈ దుర్మార్గుణ్ణి చంపాలి గదా! ఏడీ? తీసుకురా!'' అన్నాడు.

వసుదేవుడు భయపడుతున్న వాడిలాగా వెళ్ళి, ఆడపిల్లను తెచ్చి కంసుడి చేత పెట్టాడు. కంసుడు ఆ బిడ్డను చూసి, అనుమానపడుతూ తనలో, ''ఇదేమిటి? చిత్రంగా ఉన్నదే! ఆకాశవాణి మాట ఎలా అబద్ధ మవుతుంది? వసుదేవుడి మాయ అయి ఉంటుందా? చుట్టూ కాపలా వాళ్ళుండగా ఆడపిల్ల ఎలా వచ్చింది? మగబిడ్డ ఏమయినట్టు? చిత్రంగా ఉన్నదే!'' అని కలవరపడుతూ, బిడ్డ కాళ్ళు పట్టుకుని, బలం కొద్దీ రాతికేసి కొట్టాడు.

కాని ఆ బిడ్డ కంసుడి చేతుల నుంచి జారి మీదికి ఎగిరి, దేవతాకారం ధరించి, మృదుస్వరంతో, ''నన్ను చంపినంత మాత్రాన ఏమవుతుందిరా, దుర్మార్గుడా! నిన్ను చంపే వీరుడు పుట్టి పెరుగుతున్నాడు. వాడు నిశ్చయంగా నిన్ను చంపుతాడు,'' అని అదృశ్యమయింది.

కంసుడికి మతి పోయినట్టయింది. అతను తన ఇంటికి తిరిగి వెళ్ళి, తన హితులైన బక, ధేనుక, వత్సక, ప్రలంబాదులతో ఇలా అన్నాడు:

''గోకులంలోగాని, మరెక్కడైనా గాని పుట్టిన పిల్లలను అనుమానించకుండా



చంపెయ్యండి. మీరందరూ నా కోసం ఏమరుపాటు లేకుండా మసలుకోండి. పిల్లలను చంపే పూతన మీకు తోడుగా ఉంటుంది.''

తెల్లవారింది. నందుడు తనకు కొడుకు పుట్టాడని ఉత్సవం చేసుకున్నాడు. ఈ వార్త నాలుగు దిక్కులా వ్యాపించింది. కంసుడి మనుషులు ఈ వార్తను కంసుడికి చేరవేశారు. ముందు నారదుడు చెప్పనే చెప్పాడు గనక కంసుడు గోకులం మీద తన ఆగ్రహాన్ని కేంద్రీకరించాడు.

గోకులంలో పెరిగిన కృష్ణుడు పూతనను చంపాడు. అసాధారణ బలంగల ధేనుకుడూ, వత్సకుడూ, బకుడూ, ప్రలం



బుడూ అతని చేతిలో చచ్చారు. అతను గోవులను రక్షించటానికి కొండను ఎత్తాడు. ఈ వార్తలన్నీ విన్న కంసుడికి తన చావు కృష్ణుడి చేతిలో ఉన్నదని రూఢి అయింది. ఆ తరవాత కేశి అనే రాక్షసుడు కూడా కృష్ణుడి చేత చచ్చినట్టు వార్త వచ్చింది.

కంసుడు ఉపాయంతో కృష్ణుణ్ణి చంపటానికి నిశ్చయించి, ధనుర్యాగం చేస్తున్నట్టు ప్రకటించి, దానికి బలరామ, కృష్ణులను పిలవ నిశ్చయించి, వారిని తీసుకురావటానికి రథం మీద అక్రూరుణ్ణి పంపించాడు.

బలరామ కృష్ణులు వచ్చారు; ధనువును విరిచారు; రాజుల నందరినీ ఓడించారు; ఏనుగును చంపారు; చాణూర, ముష్టికులనూ శలుణ్ణీ, తోశలుణ్ణీ చంపారు; కంసుణ్ణి జుట్టు పట్టుకుని కిందికి ఈడ్చి చంపారు; తమ తల్లిదండ్రులను బంధవిముక్తులను చేసి, ఉగ్రసేనుణ్ణి రాజుగా చేశారు.

తరవాత వసుదేవుడు బలరామ కృష్ణులకు ఉపనయనం చేసి, సాందీపనుడు అనే గురువు వద్ద విద్యాభ్యాసానికి పెట్టాడు. పన్నెండేళ్ళు నిండేసరికి వాళ్ళు గురుకులంలో సకల విద్యలూ నేర్చుకున్నారు.

ఈ లోపల జరాసంధుడు తన అల్లుడైన కంసుడు చచ్చిపోయినట్టు తెలిసి, మధురానగరం మీదికి దండెత్తి వచ్చి, భయంకరమైన యుద్ధం చేసి, ఓడిపోయి తిరిగి వెళ్ళాడు. జరాసంధుడు ఇలా ఏడు సార్లు కృష్ణుడితో తలపడటమేగాక, మ్లేచ్ఛరాజైన కాలయవనుణ్ణి పురికొల్పాడు. కాలయవనుడు కూడా మధుర మీదికి దండెత్తి వచ్చాడు.

అప్పుడు కృష్ణుడు యాదవుల సమక్షంలో, "దుర్మార్గుడైన జరాసంధుడు ఈ కాలయవనుణ్ణి పంపించాడు. వీడు మహాబలవంతుడు. వీడి సేన ఎంతో గొప్పది. ఈ దుష్టుడితో యుద్ధం చెయ్యటం కష్టం. ప్రాణం కాపాడుకునేటందుకు

సంపదనూ, ఇంటినీ వదిలిపెట్టటం తప్పు కాదు. ఏ స్థలంలో సుఖంగా ఉండగలిగితే అదే పిత్రార్జితం అనుకోవాలి. స్వస్థలం శాశ్వతంగా ప్రమాదకరం అయినప్పుడు కొండలూ, అడవులూ పట్టిపోయి, సుఖపడటం మేలని పెద్దలు చెబుతారు. భయంచేతనే కదా విష్ణువు సముద్రమధ్యంలో పాము మీద పడుకుంటాడు! శివుడు వెండికొండ గుహలో నివసిస్తాడు! వాళ్ళ గతే ఇలా ఉంటే, మిగిలిన వారి సంగతి చెప్పేదేమిటి? మనం వెంటనే మధురానగరాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయి, ద్వారకాపురంలో సుఖంగా ఉండటం మేలని నాకు తోస్తున్నది. ద్వారకాపురం రైవతకాద్రి సమీపంలో సముద్రతీరాన ఉన్నదనీ, చాలా అందమైనదనీ గరుత్మంతుడు చెప్పాడు,'' అన్నాడు.

ఇందుకు యాదవులందరూ ఒప్పుకుని, తమ తమ కుటుంబాలతో బలరామ కృష్ణుల వెంట బయలుదేరి, కొంతకాలానికి ద్వారక చేరి, అక్కడ శిథిలమైపోయిన ఇళ్ళను బాగుచేసి, అక్కడ నివసించసాగారు. మధుర నిర్జనమయింది. అయితే బలరామ కృష్ణులు ఆ నిర్జనమైన మధురకు తిరిగివచ్చి, అక్కడ ఉంటూండగా కాలయవనుడు తిరిగి మధురను ముట్టడించాడు.



అప్పుడు కృష్ణుడు నగరం వదిలిపెట్టి, కాలి సత్తువకొద్దీ పారిపోసాగాడు. అది చూసి యవనుడు కృష్ణుడి వెంట పడ్డాడు. ఇద్దరూ ముచికుందుడనే ముని ఆశ్రమం చేరారు. కృష్ణుడు ఆశ్రమంలో దాక్కున్నాడు. నిద్రపోతున్న ముచికుందుణ్ణి కాలయవనుడు కాలితో తన్నాడు. వెంటనే ముని లేచి, తన చూపుతో కాలయవనుణ్ణి భస్మం చేశాడు.

తరవాత కృష్ణ, బలరాములు ద్వారకకు తిరిగి వెళ్ళి, ఉగ్రసేనుడి పరిపాలనలో సుఖంగా ఉంటూ వచ్చారు.

తరవాత కృష్ణుడు శిశుపాలుణ్ణి ఇష్టం లేకుండా పెళ్ళాడవలసిన స్థితిలో రుక్మి



ణిని రక్షించి, రాక్షస వివాహ విధిని ఆమెను తానే పెళ్ళాడాడు. జాంబవతీ, మిత్రవిందా, సత్యభామా, నాగ్నజితీ, భద్రా, లక్షణా, కాళిందీ కూడా కృష్ణుడికి భార్యలయారు.

కొంత కాలానికి కృష్ణుడికి రుక్మిణి యందు ప్రద్యుమ్నుడు అనే కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడికి బారసాల చేసిన అనంతరం శంబరుడనే రాక్షసుడు పురిటిబిడ్డను కాజేసి తీసుకుపోయి తన కూతురైన మాయవతికి ఇచ్చాడు.

కృష్ణుడు ఏమి చెయ్యటానికీ లేక జగదంబను ధ్యానించి ఇలా అన్నాడు: "తల్లీ, కనపడకుండా ఎవడో దుష్టుడువచ్చి పురిటింట ఉన్న నా కొడుకును కాజేశాడు. నా పరువు కాస్తాపోతుంది. నీ దాసుణ్ణి నేను ఈ దీనస్థితిలో ఉండటం నీకు మాత్రం సిగ్గు కాదా? నా ఇల్లు నగరం మధ్యలో ఉన్నది. నగరం చుట్టూ కోట ఉన్నది. పురిటింటికి చుట్టూ కాపలా ఉన్నది. పిల్లవాడు ఎలా పోయాడు? ఇదంతా నా ప్రారబ్ధమే గదా! నేను పొరుగూరు వెళ్ళినా, యాదవులంతా కాస్తూనే ఉన్నారు. నీ మాయాబలం సహాయంలేకుండా నా కొడుకును ఎవడు కాజెయ్యగలడు? నాకు కొడుకునిచ్చి ఆనందం కలిగించిన నువే నాకీ మనోవేదన కలిగించటం భావ్యమా? నా కొడుకును నాకు మళ్ళీ చేర్చు. నేను నీకు పగవాడనా?"

ఇలా పరితపించే కృష్ణుడి ముందు దేవి సాక్షాత్కరించి, "శాపకారణం చేత నీ కొడుకు శంబరుడి చేత అపహరించబడి, అతడి ఇంట ఉన్నాడు. పదహారో ఏట వాడు శంబరుణ్ణి చంపి, నీ వద్దకు తిరిగి వస్తాడు. విచారించకు." అన్నది.

ఆ మాట విని కృష్ణుడూ, రుక్మిణీ విచారం మానారు.

నారాయణాంశతో పుట్టిన కృష్ణుడికి అంతుబట్టకుండా, రహస్యపు గదిలో ఉన్న పిల్లవాణ్ణి శంబరుడు ఎలా హరించ

గలిగాడు? ఇందులో వింత ఏమీలేదు. దేవి మాయను మనుషులే కాదు, దేవతలూ, దానవులూ కూడా అధిగమించలేరు. అరణ్యంలో తనకు బంగారు లేడి దాపరిస్తుందనీ, తన భార్యను ఎత్తుకుపోతారనీ తెలుసుకోగలిగాడా రాముడు? అతనికి తన తండ్రి చావు గురించి ఎవరో చెప్పినదాకా తెలియదే! ఆఖరుకు సీత ఫలానా చోట ఉన్నదని కూడా రాముడు తెలుసుకోలేకపోయాడే! తన కొడుకులైన కుశలవులను వాల్మీకి పరిచయం చేసినదాకా తెలుసుకోగలిగాడా?

మానవ శరీరం ధరించినాక మానవ ధర్మాలు ఎవరికీ తప్పవు. అందుకే కృష్ణుడు పుట్టుతూనే కంసుడి భయంతో గోకులంలో దాక్కున్నాడు, పెద్ద అయి జరాసంధుడి భయంతో, బంధువులతో కలిసి ద్వారకలో తల దాచుకున్నాడు. శిశుపాలుడికి భార్య కావలసిన రుక్మిణిని ఎత్తుకు రావటం కృష్ణుడు చేసిన అన్యాయమే కదా!

మానవ సహజమైన పనులు కృష్ణుడు ఎన్నయినా చేశాడు. భార్యావిధేయుడై సత్యభామ అడిగిందని, కృష్ణుడు స్వర్గం నుంచి పారిజాత వృక్షాన్ని ఎత్తుకు రావటానికి ఇంద్రుడితో యుద్ధం చేశాడు. జాంబవతి కొడుకులు కావాలని కోరితే, అతను పుత్రుల కోసం ఉపమన్యుడి ఆశ్రమంలో తపస్సు చేశాడు. దానికోసం పాశుపత దీక్ష పూని, శివుణ్ణి గురించి కృష్ణుడు తపస్సు చేస్తే, శివుడు పార్వతీ సమేతుడై ప్రత్యక్షమై, కృష్ణుడి కోరిక తెలుసుకుని, "నీకు పదహారు వేల యాభైమంది భార్యలుంటారు. ఒకొక్కరికి పదేసి మంది పిల్లలు పుట్టుతారు. నువు నూరేళ్ళు బతుకుతావు," అని ఆశీర్వదించాడు.

తరవాత కృష్ణుడు ఉపమన్యుడికి మొక్కి, సెలవు తీసుకుని, ద్వారకకు తిరిగివచ్చి సుఖంగా ఉన్నాడు.

అందుచేత ఒక్క మహాదేవి తప్ప, మాయాకు లోబడని వారు ఎవరూ లేరు.





# దేవీ భాగవతం

దనవుడి కొడుకులు రంభుడూ, కరంభుడూ అనే వాళ్ళు తమకు పిల్లలు లేని కారణంగా చాలాకాలం తీవ్ర తపస్సు చేశారు. కరంభుడు పంచనద తీర్థంలో మునిగి తపస్సు చేశాడు. రంభుడు ఒక చెట్టు మీద ఎక్కి తపస్సు చేశాడు.

ఎవరు తపస్సు చేస్తున్నా ఇంద్రుడికి ముచ్చెమటలు పోస్తాయి. అందుచేత అతను మొసలి రూపంలో పంచనదంలో ప్రవేశించి, కరంభుణ్ణి చంపేశాడు. తన తమ్ముడి చావుకు రంభుడు శోకావేశంతో అగ్నిహోత్రుడికి తన తల అర్పించటానికి చేత్తో కత్తి ఎత్తాడు.

అప్పుడు అగ్ని ప్రత్యక్షమై, "ఎందుకు ఆత్మహత్య చేసుకుంటున్నావు? దానివల్ల ఇహమా, పరమా? నీ తపస్సు చూసి నేను సంతోషించాను. కోరుకో, వరం ఇస్తాను," అన్నాడు.

"దేవా, నీకు నా మీద అనుగ్రహం ఉంటే నాకు ఒక కొడుకును ఇయ్యి. వాడు కామరూపీ, దేవతలకుగాని, దానవులకు గాని, మానవులకుగాని జయించ రానివాడుగా ఉండాలి!" అన్నాడు రంభుడు.

"అలాగే అవుతుంది. నీకు ఎవతె మీద ప్రీతి ఉంటే దానివల్ల నువు కోరిన కొడుకు కలుగుతాడు," అని అగ్నిహోత్రుడు అదృశ్యమయాడు.

రంభుడు తిరిగి వస్తూ, యక్షుల అధీనంలో ఉన్న ఒక అందమైన ప్రదేశంలో

## 14. మహిషాసుర వధ



ఒక ఆడ గేదెను చూశాడు. అతనికి దాని మీద మోహం కలిగింది. ఆ మహిషి రంభుడి వల్ల గర్భం ధరించి, అతని వెంట పాతాళానికి వచ్చేసింది.

అక్కడ ఆ మహిషిని మరొక మహిషం మోహించింది. అది చూసి రంభుడు ఆగ్రహావేశంతో దాన్ని కొట్టాడు. ఆ మహిషం (దున్నపోతు) రంభుణ్ణి తన కొమ్ములతో పొడిచి పైకెత్తి, చంపేసింది. అది చూసి మహిషి రంభుడితోపాటు చితి మంటలలో కాలిపోయింది. ఆ మంటల నుంచి ఇద్దరు రాక్షసులు వెలువడ్డారు. ఒకడు మహిషుడు, ఇంకొకడు రక్తబీజుడు.

రాక్షసులు మహిషాసురుణ్ణి తమ రాజుగా ఎన్నుకున్నారు. అతని కింద చిక్షురుడూ, తామ్రుడూ, అసిలోముడూ, సుదర్కుడూ, బిడాలుడూ, బాష్కలుడూ, త్రినేత్రుడూ, కాలబంధకుడూ అనేవాళ్ళు సేనాపతులు. వారి సహాయంతో మహిషాసురుడు భూలోకమంతా ఏలుతూ, యజ్ఞకర్మలను ధ్వంసం చేస్తూ వచ్చాడు. ఇతని కాలంలో దేవతలకూ, దానవులకూ మహా భయంకరమైన యుద్ధం జరిగింది.

ఇది జరగక పూర్వం మహిషుడు కాంచన పర్వతం మీద గొప్ప తపస్సు చేసి, బ్రహ్మదేవుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, "మహాత్మా, నాకు చావు లేకుండా చెయ్యి." అని వరం కోరాడు.

దానికి బ్రహ్మ, ''పుట్టిన వాళ్ళంతా చావక తప్పదు, చచ్చినవాళ్ళు పుట్టకా తప్పదు. చావకుండా నీకు వరం ఎలా ఇయ్యగలను? భూమికీ, సముద్రానికీ, కొండలకూ సైతం నాశనం ఉన్నది గదా! చచ్చిపోవటానికి అవకాశం వదిలి వరం కోరుకో, అలాగే ఇస్తాను,'' అన్నాడు.

అప్పుడు మహిషుడు, ''ఆడది ఎలాగూ నన్ను చంపలేదు గనక, దేవతలలోగాని, దానవులలోగాని, మానవులలోగాని ఏ పురుషుడి చేతా నాకు చావు లేకుండా అనుగ్రహించు,'' అని బ్రహ్మను కోరాడు.

"అలాగే, కాని నీకు ఎప్పటికైనా స్త్రీ మూలంగానే చావు వస్తుంది," అని బ్రహ్మ వెళ్ళిపోయాడు.

ఈ వరం పొంది ఉన్న మదంతో మహిషుడు స్వర్గాన్ని ఆక్రమించాలన్న ఉద్దేశంతో ఒక సేవకుణ్ణి పిలిచి, "ఇంద్రుడు నాతో యుద్ధమే చేస్తాడో, నా శరణుజొచ్చి నాకు స్వర్గం ఇచ్చేస్తాడో స్పష్టంగా కనుక్కురా," అన్నాడు.

మహిషుడి దూత స్వర్గానికి వెళ్ళి ఇంద్రుణ్ణి చూసి, "దేవేంద్రా, నేను మహిషుడి దూతను. ఆయన పంపగా నిన్ను అడగవచ్చాను: నువు లేనిపోని అతిశయాలకు పోక, నీ నగరాన్ని మహిషుడి వశంచేసి, ఆయన సేవకుడవుగా ఉంటావా? లేక ఆయనతో యుద్ధానికి దిగుతావా? ఏదో ఒక నిర్ణయంచేసి చెప్పు." అన్నాడు.

"ఓరి మదాంధుడా! నీ యజమానికి అంతగా కళ్ళు నెత్తికి వచ్చాయిగా! నా ఎదటికి వచ్చి నాతో ఇలా మాట్లాడతావా? వాడి సంగతి నేను చూస్తాను. దూతవు గనగ బతికావు! నువు తిరిగి వెళ్లి నేను చెప్పానని ఇలా చెప్పు! 'ఒరే దున్నపోతా! యుద్ధంలో నన్ను జయించాలన్న కోరిక నీకు పుట్టిందా? గడ్డి తెగ మేసి, కొవ్వి ఉన్నావా? నువు మొద్దు



స్వరూపమని నాకు తెలుసు. నీ కొమ్ములు పీకి ధనుస్సు చేసుకుంటాను, ఏమనుకున్నావో?' " అన్నాడు ఇంద్రుడు.

దూత మహిషుడి వద్దకు తిరిగి వెళ్ళి, "ఇంద్రుడు నిన్ను లక్ష్యపెట్టక, ఏమేమి పేలాడో చెప్పటానికి నాకు భయంగా ఉన్నది. నీకు తృప్తి కలగటానికి అబద్ధం ఎలా చెప్పను?" అంటూ ఇంద్రుడి సందేశం చెప్పకుండా చెప్పాడు.

మహిషుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను తోక జాడించి, ఎర్రని కళ్లు తిప్పుతూ, "ఈ ఇంద్రుణ్ణి చంపాలా, వద్దా? వాడనగా ఎంత? వాడి ప్రతాపం మెత్తని వాళ్ళ దగ్గిరా, ముక్కుమూసు



అతను అష్టదిక్పాలకులనూ, దేవతలనూ జయించి, వారనుభవించే సుఖాలన్నీ రాక్షసులకు అందజేయ నిశ్చయించి, తన సేవకులతో, "నన్ను ఏ మగవాడూ జయించలేడు. మీరు ఎక్కడెక్కడ ఉన్న రాక్షసులనూ యుద్ధానికి సిద్ధం చెయ్యండి. ఎంతమందినైనా నేను నా గిట్టలతోనూ, కొమ్ములతోనూ చంపగలను. మీ అందరికీ స్వర్గసుఖాలు అందుబాటులోకి వస్తాయి." అని చెప్పి పంపేశాడు.

ఈ లోపల ఇంద్రుడు దిక్పాలకులను సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

"రంభుడి కొడుకు మహిషుడు బ్రహ్మ వల్ల వరాలు పొందిన మదంతో యుద్ధానికి సేనలను సన్నద్ధం చేస్తూ, ప్రగల్భాలు పలుకుతున్నాడు. వాడు స్వర్గాన్ని జయిస్తాడట. మహిషుడికి సేవకుడివిగా ఉంటావో, యుద్ధమే చేస్తావో తేల్చుకోమని వాడి దూత వచ్చి చెప్పిపోయాడు. అందుచేత మనం ఏం చెయ్యాలో తేల్చండి. శత్రువు ఎంత బలవంతుడైనా క్షమించరాదు. జయాపజయాలు దైవాధీనమే అయినా ప్రయత్నం మానరాదు. సంధి చేయటం మంచిదే. కాని ఇలాటి దుర్మార్గుడితో సంధి విషమిస్తుంది. యుద్ధం చెయ్యాలన్నా మన బలాలూ, శత్రు బలాలూ సరిగా అంచనా వెయ్యవలసి

కుని తపస్సు చేసుకునే వాళ్ళ దగ్గిరా, ఇతరుల భార్యల దగ్గిరా చెల్లుతుంది! అంతేగాని, యుద్ధం చెయ్యటమంటే అప్సరలను పంపి తపోభంగం చేయించటమనుకున్నాడా? కోటిమంది ఇంద్రులు వచ్చినా చీల్చి, చెండాడుతాను! నముచిని చంపిన నమ్మక ద్రోహి! వాణ్ణి క్షమిస్తే బుద్ధిమంతులు సంతోషించరు. వీడే అనుకుంటే వీడికి తోడుగా ఉండే విష్ణువూ ఇలాటివాడే. మోసంతో పందిరూపంలో హిరణ్యాక్షుణ్ణీ, సింహం మనిషి రూపంలో హిరణ్యకశిపుణ్ణీ చంపాడు కాడా? ఇంద్రుణ్ణీ, విష్ణువునూ నమ్మటం ప్రమాదకరం," అన్నాడు.

వుంటుంది. అందుకు ఒక మనిషిని పంపుదాం.''

ఇంద్రుడు పంపిన దూత వెళ్లి త్వరగా తిరిగి వచ్చి, మహిషుడి బలాలను గురించి చెప్పేసరికి ఇంద్రుడు విస్మయం చెంది, తన పురోహితుణ్ణి, ''మహిషుడు అంతు లేని సేనలతో మన మీదికి యుద్ధానికి వస్తున్నాడు. ఏమిటి ఉపాయం?'' అని అడిగాడు.

ఇంద్రుడి కంగారు చూసి బృహస్పతి, ''అపాయం ఎదురైనప్పుడు ధైర్యం విడిచి పెట్టరాదు. ధైర్యంగా ఉండు. అయేది కాకుండా ఉండదు. అయినా శాయ శక్తులా ప్రయత్నం చెయ్యవలసిందే! అందుకే కదా మహర్షులు మోక్షం కోసం తపస్సు చేస్తారు? అచ్చగా దేవుణ్ణి నమ్ము కుంటే పని జరగదు. మనం ప్రయత్నం చేసినా ఫలితం కలగకపోతే అది దైవికం," అన్నాడు.

దానికి ఇంద్రుడు, ''దేవా, ప్రయ త్నించక పని జరగదు. యతులకు విజ్ఞా నమూ, బ్రాహ్మణులకు తృప్తీ ఎలాగో రాజులకు శత్రుసంహారం అలాగు. నువు అనుకూలంగా సలహా ఇస్తే, నేను యుద్ధ యత్నం చేస్తాను. నాకు నువూ, వజ్రా యుధమూ, హరిహరులూ సహాయులు,'' అన్నాడు.



బృహస్పతి ఇంద్రుడితో, ''నేను నిన్ను యుద్ధం చెయ్యమనిగాని, వద్దనిగాని సలహా చెప్పను. నన్ను మీరంతా మహా మేధావి అంటారు. కాని చంద్రుడు, నా భార్యను ఎత్తుకుపోతే నా తెలివితేటలు ఎందుకు పనికి వచ్చాయి? అందుచేత మీమీ బుద్ధికి తోచిన ఉపాయాలు ఆలో చించండి,'' అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు బ్రహ్మను శరణు జొచ్చి, ''మహిషుడు అనేవాడు మదించి స్వర్గం మీదికి సైన్యంతో దండెత్తి వస్తు న్నాడు. వాడి నుంచి నాకు చాలా భయం కలుగుతున్నది. నా దురవస్థ చూడు!'' అన్నాడు.



ఇంద్రుడి మాటలు విని బ్రహ్మ, "మనం శివుణ్ణీ, విష్ణువునూ వెంటబెట్టుకుని యుద్ధం చెయ్యటం మంచిది. ముందు కైలాసానికి పోదాం," అన్నాడు.

ఇద్దరూ కలిసి శివుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పారు. తరవాత ముగ్గురూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళారు. అందరూ కలిసి మహిషుడితో యుద్ధం చెయ్యటానికి నిర్ణయం జరిగింది. హంస మీద బ్రహ్మ, గరుత్మంతుడి పైన విష్ణువూ, ఎద్దు మీద శివుడూ, నెమలి మీద కుమారస్వామీ, ఏనుగు మీద ఇంద్రుడూ ఎక్కి యుద్ధానికి బయలుదేరారు. దేవసేనలూ, రాక్షససేనలూ ఒకదాన్ని ఒకటి ఎదుర్కొన్నాయి.

యుద్ధం భయంకరంగా సాగింది. ఎంత శౌర్య పరాక్రమాలు ప్రదర్శించినా దిక్పాలకులూ, ఇంద్రుడూ, త్రిమూర్తులూ మహిషుడి ధాటికి తట్టుకోలేక చివరకు పారిపోయారు. స్వర్గం మహిషుడి వశమయింది. మహిషుడు ఇంద్రుడి ఆసనం మీద కూర్చుని, పదవులన్నిటా తన రాక్షసులను నిలిపి, దేవతల ధనాగారాలన్నీ స్వాధీనం చేసుకుని, స్వర్గసుఖాలు అనుభవిస్తూ పాలించసాగాడు. దేవతలు కొండలూ, గుట్టలూ పట్టిపోయి, అష్టకష్టాలూ పడ్డారు.

ఇలా కష్టాలు పడలేక దేవతలు ఒకసారి బ్రహ్మ కొలువుకు వెళ్ళి, "ఒక్క మహిషాసురుడు మమ్మల్నందరినీ జయించి, మాకు ఇటువంటి దుస్థితి తెచ్చిపెట్టాడు గదా, తండ్రి వంటివాడివి, మా దుస్థితి ఎందుకు చూడవు? సర్వజ్ఞుడివి, మా గతి ఏమిటి?" అని వాపోయారు.

"నన్నేం చెయ్యమంటారు? వాడు తనను ఏ పురుషుడూ చంపకుండా వరం పొందాడు. వాణ్ణి చంపితే ఎవతె అయినా ఆడదే చంపాలి. మనం ముందు శివుడితోనూ, తరవాత విష్ణువుతోనూ ఆలోచింతాం," అన్నాడు బ్రహ్మ.

దేవతలందరూ బ్రహ్మ వెంట శివుడి వద్దకు వెళ్ళారు.

"ఏం పని మీద వచ్చారు?" అని శివుడు వారిని అడిగాడు.

"నీకు తెలీనిదేమున్నది? మహిషాసురుడు స్వర్గం ఆక్రమించి ఇంద్రుణ్ణీ, దేవతలనూ అష్టకష్టాలపాలు చేశాడు. వాళ్ళు తమ గతి ఏమిటని అడుగుతున్నారు," అన్నాడు బ్రహ్మ.

శివుడు చిరునవ్వు నవ్వి, "దేవతలకు ఈ అనర్థం కలిగించినది నువే కదా! నీ వరం వల్ల వాణ్ణి ఏ మగవాడూ చంపలేడు. మరి వాణ్ణి చంపటానికి ఏ ఆడదాన్ని పంపుదాం? నీ భార్యను పంపుతావా? నా భార్యను పంపనా? లేక ఇంద్రుడి భార్య పోతుందా? మన భార్యలలో ఒకతె కూడా యుద్ధం చెయ్యగలది కాదే! అందుచేత ఏం చేస్తే బాగుంటుందో విష్ణువును అడుగుదాం. అతను నాకన్న తెలివిగలవాడు," అన్నాడు.

అందరూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళారు. వాళ్ళు వచ్చిన పని విని విష్ణువు, "మన మందరమూ మహిషుడితో యుద్ధం చేసి ఓడినవాళ్ళమే గదా! వాణ్ణి ఆడదే చంపాలంటే మన అందరి తేజస్సుతోనూ ఒక స్త్రీని తయారుచేసి, ఆమెకు మన ఆయుధాలిచ్చి, ఆమెచేత మహిషుడితో యుద్ధం చేయించాలి," అన్నాడు.

విష్ణువు ఇలా అంటూండగానే దేవతలందరి నుంచీ రకరకాల తేజస్సు వెలువడి, అది క్రమంగా ఏకమై, పద్దెనిమిది చేతులు గల స్త్రీ మూర్తిగా తయారయింది.



దేవతలు ఆమె చేతులలో తమ తమ ఆయుధాలు ఉంచారు.

ఆమె దేవతలతో, "భయపడకండి. ఆ రాక్షసుణ్ణి నేను చంపుతాను!" అంటూ సింహనాదం చేసింది.

దాన్ని విని మహిషుడు, "ఎవడు ఈ ధ్వని చేసినది? వెళ్ళి, వాణ్ణి పట్టి తీసుకు రండి! నా చేత చావుదెబ్బ తిన్న దేవతలకు ఇంత సాహసం ఉండదే!" అన్నాడు తన వాళ్ళతో.

వాళ్ళు వచ్చి మహాదేవి అవతారం చూసి బెదిరిపోయి, మహిషుడితో, "ఎవతో సింహం ఎక్కి వచ్చింది. ఒంటి నిండా ఆభరణాలు. పద్దెనిమిది చేతులలో ఆయుధాలు!" అని చెప్పారు.

మహిషుడు తన మంత్రితో, "ఎలాగైనా ఆ స్త్రీని తీసుకురా! నా పట్టమహిషిగా చేసుకుంటాను!" అన్నాడు.

మంత్రి వచ్చి, దూరంగా నిలబడి దేవితో, "అమ్మా, నువెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? సర్వలోకపాలకుడు మహిషాసురుడు నిన్ను కోరుతున్నాడు," అన్నాడు.

దేవి చిన్నగా నవ్వి, "వాణ్ణి చంపటానికే వచ్చాను! నువు మంచివాడివిలా గున్నావు. నిన్ను చంపను. మీ ఏలికకు నేను వచ్చిన పని చెప్పు!" అన్నది.

మహిషుడు తన మంత్రి మాటలు నమ్మలేక, రాయబారానికి తన సేనాపతిని తామ్రుణ్ణి పంపాడు. దేవి వాణ్ణి చంపింది. అంతటితో మహిషుడి ప్రేమ ఘట్టం అంతమయింది. అతను దేవితో యుద్ధానికి తన సేనాపతులను పంపాడు. అందరూ దేవి చేత చచ్చారు. తరవాత మహిషుడే దేవిసంగతి తేల్చుకు నేటందుకు వచ్చాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. మహిషుడు కామరూపి కావటంచేత, అనేక రూపాలు ధరించి దారుణ యుద్ధంచేశాడు. చివరకు దేవి వాణ్ణి చక్రాయుధంతో తల నరికి చంపేసింది.

దేవతలు పరమ సంతోషం పొంది, దేవిని స్తోత్రం చేశారు.





# దేవీ భాగవతం

మహిషాసురుణ్ణి చంపి, దేవి అంతర్ధానం అయిన అనంతరం దేవతలు మహిషుడి రాజ్యానికి శత్రుఘ్నుడు అనే సూర్య వంశపు రాజును రాజుగా అభిషేకించి, తమ దారిన తాము కూడా వెళ్ళిపోయారు.

ప్రపంచం సుఖంగా ఉన్న సమయంలో మళ్ళీ దానవుల పీడ దాపురించింది. రసాతలంలో శుంభుడూ, నిశుంభుడూ అనే ఇద్దరు దానవులు ఆహారమూ, నీరూ తీసుకోకుండా ఘోర తపస్సు చేశారు.

వారి తపస్సుకు మెచ్చి, బ్రహ్మ ప్రత్యక్షమై, ఏదన్నా వరం కోరుకోమన్నాడు.

''నీ చేత గాని, ఇతరుల చేత గాని, ఏవరి చేత గాని మాకు చావు లేకుండా వరం ఇయ్యి,'' అన్నారు వాళ్ళు.

''లాభంలేదు. ఇంకేదైనా వరం కోరండి,'' అన్నాడు బ్రహ్మ.

''ఆడదాని చేత తప్ప మరెవరి చేతా మాకు చావు లేకుండా అనుగ్రహించు. ఆడది మమ్మల్ని చంపినప్పటిమాట చూసుకుంటాం,'' అన్నారు శుంభ, నిశుంభులు.

బ్రహ్మదేవుడు వరం ఇచ్చాడు.

ఆ అన్నదమ్ములు బ్రహ్మ వల్ల ఇలా వరం పొంది, భృగుమహామునిని తమకు పురోహితుడుగా పెట్టుకున్నారు. మంచి ముహూర్తం చూసి శుంభుడు రాజ్యాభిషేకం చేసుకుని, తన తమ్ముడైన నిశుంభుడు మంత్రిగా రాజ్యపాలన సాగించాడు. చండ, ముండు లనే మహావీరులు

15. శుంభ, నిశుంభులు



సేనాపతులుగా ఉన్నారు. పాతాళం నుంచి ధూమ్రలోచనుడూ, రక్తబీజుడూ అనే వాళ్ళు రెండు అక్షౌహిణుల సేనతో వచ్చి, శుంభ, నిశుంభుల కొలువులో చేరారు.

రక్తబీజుడనేవాడు యుద్ధరంగంలో ఉద్దండుడు. యుద్ధంలో వాడికి గాయం తగిలి, వాడి రక్తం భూమి మీద పడితే, వాడిలాటి మహావీరులు వేనకువేలు పుట్టుకు వస్తారు. అందుకే వాడికి రక్తబీజుడు అనే పేరు వచ్చింది.

ఇలాగే అనేకమంది దానవవీరులు శుంభుడి కొలువులోకి వచ్చి చేరారు.

ఇలా ఉండగా ఒకసారి నిశుంభుడికి ఇంద్రుణ్ణి జయించాలని పుట్టింది. వాడు ఇంద్రుడి నగరానికి వెళ్ళేసరికి, ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని వచ్చి, యుద్ధం ప్రారంభించి, నిశుంభుణ్ణి వజ్రాయుధంతో కొట్టేసరికి వాడు కాస్తా మూర్ఛపోయాడు.

తన తమ్ముడు మూర్ఛపోయాడని విని శుంభుడు మండిపడి, యుద్ధానికి వచ్చి, దేవతలను చెల్లాచెదరుచేసి, ఇంద్రుడు మొదలైన వారిని జయించి, తానే ఇంద్రత్వం పుచ్చుకుని, అష్టదిక్పాలకులను లోబరచుకుని, మూడులోకాలూ ఏలుతూ, నందనవనంలో అప్సరసలతో విహరించ సాగాడు.

దిక్పాలకుల స్థానాలలో శుంభుడికి ఇష్టులైన దానవులు నియోగించబడ్డారు. శుంభుడి పరిపాలనలో దేవతలు దిక్కులేనివారై, అడవులుపట్టిపోయి, గుహలలో తలదాచుకుంటూ, సుఖం ఏ మాత్రమూ లేని జీవితం గడిపారు.

ఈ విధంగా వెయ్యి సంవత్సరాలు గడిచాయి. కష్టాలపాలై ఉన్న ఇంద్రుడు మొదలైనవాళ్ళు, స్వర్గాన్ని తిరిగి ఎలా సంపాదించాలో, శుంభుణ్ణి ఎలా చంపాలో తెలియక, ఒకనాడు బృహస్పతితో, ''మహాత్మా, నీకు తెలియనిదంటూ ఏదీ లేదు గదా! దేవతలకు ఈ దుస్థితి తొలగే ఉపాయం ఏదో చూడు. మంత్రాలు గొప్ప ప్రభావం గలవి. వాటితో అభిచార



హోమం గాని, మరేదైనా గాని చేయించి, మా రాజ్యం మాకు ఇప్పించు,'' అన్నారు.

''ఇంద్రా, మంత్ర తంత్రాలైనా విధిని అనుసరించే పనిచేస్తాయి. దానికి వ్యతిరేకంగా పనిచేయలేవు. వాటికి అధిపతులైన మీరే దుర్దశ అనుభవిస్తున్నారు. ఈ స్థితిలో మంత్రాలు మీకు ఎలా సహాయపడతాయి? అయినా ఒకటి చెయ్యవచ్చు. జగజ్జనని మహిషాసురుణ్ణి చంపిన సంగతి మీకు తెలుసు కదా? ఆవిడనే మళ్ళీ ఆశ్రయించండి. మీరు హిమాలయానికి వెళ్ళి ఆ దేవి మాయా బీజ పునశ్చరణ చెయ్యండి. మీ పని తీరవచ్చు,'' అన్నాడు దేవగురువైన బృహస్పతి.

దేవతలు ఆ ప్రకారమే హిమాలయానికి వెళ్ళి, మాయాబీజాన్ని జపిస్తూ, దేవిని స్తోత్రం చేశారు.

దేవి మంచి చీర కట్టి, అందమైన బంగారు ఆభరణాలు ధరించి, గంగలో స్నానం చెయ్యటానికి పోతున్నదానిలాగా ఒక గుహలో నుంచి వస్తూ, దేవతలను చూసి, ''దేవతలల్లే ఉందే? ఏం పని మీద ఇటుకేసి వచ్చారు? విచారంగా ఉన్నట్టు కనిపిస్తున్నారే? ఏమిటి కథ?'' అని అడిగింది.

వాళ్లు ఆమెకు చేతులు జోడించి, "తల్లీ, మా ఆపద తొలగించు. మేం యుద్ధంలో దానవులకు తట్టుకోలేక, మా అసమర్థత తెలుపుకోవటానికి వచ్చాం. మాకు నువే కదా దిక్కు? శుంభ, నిశుంభు లనే దానవులు మమ్మల్ని ఓడించి, స్వర్గం ఆక్రమించుకున్నారు. బ్రహ్మ ఇచ్చిన వరం మూలాన వారిని ఎవరూ చంపలేరు. అయితే వీళ్ళు కూడా మహిషుడి లాగే ఆడదాని చేత చస్తారు. కాని వారిని ఏ ఆడది చంపగలుగుతుంది? అందుచేత మేం దిక్కులేనివాళ్ళమై, ఇలా అగచాటు పడుతున్నాం. పూర్వం మహిషుణ్ణి చంపినప్పుడు, మాకు ఆపద కలిగితే దాన్ని తీర్చుతానని మాట ఇచ్చావు. శుంభ, నిశుంభులే కాదు, రక్తబీజుడూ, చండ,



ముండులూ కూడా మాకు శత్రువులై ఉన్నారు: ఇవాళ అష్టదిక్పాలకు లందరూ రాక్షసులే. అందుచేత మా మీద దయ జూపి, ఆ రాక్షసుల నందరినీ సంహరించు.'' అన్నారు.

దేవి దేవతల దైన్యం చూసి జాలిపడి, తన నుంచి కౌశికి అనే శక్తిని పుట్టించింది. ఆ శక్తి నల్లగా ఉండటం చేత కాళిక అనీ, కాళరాత్రి అనీ పిలవబడుతూ, మహా ఘోరమైన రూపం ధరించింది.

''దేవతలారా! విచారించకండి. శుంభ, నిశుంభులనూ, ఇతర రాక్షసులనూ చంపి, మీకు మేలు చేకూర్చుతాను.'' అని దేవి దేవతలకు అభయం ఇచ్చి, తన నుంచి పుట్టిన కౌశికిని తన పార్శ్వంలో ఉంచుకుని, సింహం మీద శత్రువుల నగరానికి వెళ్ళి, నగరం వెలపల ఉన్న వనంలో విడిసి, అక్కడ అతిమనోహరంగా గానం చేసింది. ఆ గానానికి దేవతలు పరమానందం చెందారు. మృగాలు తమను తాము మరిచాయి. పక్షులు చెవులు రిక్కించి విన్నాయి.

ఆ సమయంలో చండ, ముండులు విలాసంగా ఉపవనాలలో విహరిస్తూ, మనోహరమైన ఆ గానాన్ని కొంతసేపు విని, దగ్గిరికి వచ్చి జగన్మోహిని అయిన అంబ అవతారాన్ని, ఆమె వెంట ఉన్న కౌశికినీ చూసి, అమితమైన ఆశ్చర్యంతో నగరానికి తిరిగిపోయి, శుంభుడికి నమస్కారం చేసి, ఇలా అన్నారు:

''ఎక్కడినుంచో ఒక స్త్రీ సింహం ఎక్కి వచ్చింది. ఆమె అందాన్ని వర్ణించటం అసాధ్యం. మూడులోకాలలోనూ అంతటి సౌందర్యవతి లేదు. ఇక ఆమె గానాన్ని గురించి చెప్పేదే లేదు! మన ఉద్యాన వనంలో ఆమె పాడుతుంటే పశుపక్ష్యాదులు ఆలకిస్తున్నాయి. ఆమె వెంట ఇంకొకతె కూడా ఉన్నది. ఇన్ని మాటలు దేనికి? నువు వెళ్ళి, ఆమె సంగతి ఏమిటో తెలుసుకుని, తీసుకువచ్చి భార్యగా చేసుకున్నావంటే, అంతకు మించిన సుఖం



ఉండదు. ఐరావతాన్నీ, పారిజాతాన్నీ, ఉచ్చైశ్రవాన్నీ (ఇంద్రుడి గుర్రాన్నీ) విమానాన్నీ గెలుచుకున్న నీకు ఈమె భార్య కాదగి ఉన్నది.''

ఈ మాటలతో బాగా కైపెక్కిపోయి శుంభుడు తన సమీపంలో ఉన్న సుగ్రీవుడనేవాణ్ణి పిలిచి, ''నువు వెంటనే నా తరపున వెళ్ళి ఆ స్త్రీని తీసుకురా. శృంగారానికి సంబంధించినచోట భేదోపాయమూ, దండోపాయమూ ఎంతమాత్రమూ పనికిరావు. అందుచేత నువు సామ, దానోపాయాలు మాత్రమే ఉపయోగించు.'' అన్నాడు.

సుగ్రీవుడు వెళ్ళి, సింహం మీద ఎక్కి తిరుగుతున్న జగదంబను చూసి నమస్కరించి, ''అమ్మా, శుంభుడు దేవతలందరినీ జయించాడు, మన్మథాకారుడు! నీకు తెలుసునా? నేను అతని దూతను. నిన్ను గురించి విని, నీ మీద మోహం పుట్టి, నన్ను ఇక్కడికి పంపాడు. నిన్ను తన పెద్ద భార్యగా చేసుకుని, నీకు విధేయుడనుగా ఉంటానని చెప్పమన్నాడు,'' అని చెప్పాడు.

దేవి ఈ మాటలకు చిరునవ్వు నవ్వి, ''మీ రాజు దేవతల నందరినీ జయించాడని విని, అంత గొప్పవాడు గనకనే, అతని కోసమే నేను వచ్చాను. ఈ మాట అతనితో చెప్పి, ఇంకొక్క సంగతి కూడా అతనికి తెలియజెయ్యి. అదేమిటంటే, నన్ను యుద్ధంలో ఓడించే వీరుణ్ణి తప్ప పెళ్ళాడనని నా కొక వ్రతం ఉన్నది ఈ వ్రతం పట్టిననాటి నుంచి నేటిదాకా నా గర్వం అణచిన వీరుడు కానరాలేదు. మీ యజమానిని ఆ పనిచేసి నన్ను చేపట్టమని చెప్పు.'' అన్నది.

ఈ మాటకు సుగ్రీవుడు నిర్ఘాంతపోయి, ''అమ్మా, స్త్రీ సహజమైన దుస్సాహసంతో ఇలా అన్నావు గాని, శుంభుడి పేరు చెబితేనే ఎంతటి వాళ్ళూ ఆక్రందనం చేస్తారు గదా! అతన్ని ఎలా జయించగల ననుకుంటున్నావు? ఇటువంటి ఆలోచనమాని, శుంభుణ్ణో, అతని తమ్ముడు

నిశుంభుణ్ణో భర్తగా చేసుకుని సుఖంగా ఉండు,'' అన్నాడు.

దానికి అంబ, ''నా వ్రతం మానను, నా శూలానికి వెరిచినవాణ్ణి నేను ఎలా పెళ్ళాడతాను? నాతో యుద్ధానికి సిద్ధపడక పోతే మీ యజమానిని స్వర్గ, మర్త్య లోకాలు విడిచి, బంధుమిత్ర సహితంగా రసాతలానికి వెళ్ళిపొమ్మను. నా మాటలు ఉన్నవి ఉన్నట్టు చెప్పు.'' అన్నది.

సుగ్రీవుడు మతిచెడిన వాడిలాగా శుంభుడి వద్దకు తిరిగి వెళ్ళి, ముందుగానే క్షమాపణ చెప్పుకుని, దేవి అన్న మాటలు అన్నట్టుగా తెలిపాడు.



శుంభుడు నిశుంభుడి కేసి తిరిగి, ''ఒక ఆడది ఇంకో ఆడదాన్ని తోడు తెచ్చుకుని యుద్ధం చేస్తానని వచ్చిందట! నువు పోతావా? నన్ను పొమ్మన్నావా?'' అని అడిగాడు.

''నువూ వద్దు, నేనూ వద్దు. ధూమ్రలో చనుణ్ణి పంపితే ఆమెను గెలిచి తెస్తాడు. మరుక్షణంలో ఆమె నిన్ను వరిస్తుంది,'' అన్నాడు నిశుంభుడు.

ఈ మాటకు సమ్మతించి శుంభుడు ధూమ్రలోచనుడితో, ''నువు ఆ సుందరికి అండగా ఉన్న స్త్రీని చంపి, సుందరిని తీసుకురా. ఆమె నీ మీద చిన్నగా బాణాలు వేసినా, నువు ఆమెను క్రూరమైన బాణాలతో హింసించేవు సుమా! ఆమెను చెక్కు చెదరకుండా పట్టుకురా,'' అన్నాడు.

ధూమ్రలోచనుడు సేనాసహితంగా దేవి వద్దకు వెళ్ళి, తన యజమాని ప్రేమ సందేశాన్ని ఆమెకు చెప్పాడు.

వాడి మాటలకు కాళిక జవాబు చెబుతూ, ''సిగ్గులేకుండా, విటకాడిలాగా మాట్లాడతావేం? యుద్ధం చెయ్యి. మా దేవి దేనికి వచ్చిందనుకున్నావు? మీ శుంభ నిశుంభులను యముడి వద్దకు పంపటానికి!'' అన్నది.

ధూమ్రలోచనుడు మండిపడి, ''కయ్యానికి కాలుదువ్వుతావా? నీ గర్వం

అణచలేక ఇంతసేపూ మాట్లాడాననుకున్నావా ?'' అంటూ యుద్ధానికి తలపడి, కాళిక చేతిలో తాను చావటమే గాక, తన సైన్యాన్ని కూడా పోగొట్టుకున్నాడు.

దేవి దిశలు పిక్కటిల్లేలాగా శంఖం పూరించింది. అది విని శుంభుడు ఏదో మూడిందనుకుని బయలుదేరి వచ్చి చూస్తే, ధూమ్రలోచనుడి జాడ లేదు, సైన్యం జాడా లేదు. చచ్చిన మనుషుల శవాలూ, గుర్రాల శవాలూ కనిపించాయి. హతశేషులు వచ్చి జరిగినది చెప్పారు.

శుంభుడి ప్రణయగాథ తలకిందులయింది. చేస్తే దేవితో యుద్ధం చేయాలి, లేదా సంధి చేసుకోవాలి. ఆమెతో యుద్ధం చెయ్యగల శూరులు శుంభుడి వెంట చాలా మంది ఉన్నారు.

ముందు చండ, ముండులు దేవి మీదికి యుద్ధానికి వెళ్ళారు. వాళ్ళు చచ్చినాక రక్తబీజుడు వెళ్ళి, మరొకసారి దేవికి, శుంభుణ్ణి గాని, నిశుంభుణ్ణి గాని పెళ్ళాడమని సలహా ఇచ్చాడు.

''నాతో యుద్ధం చెయ్యగలవాణ్ణే తప్ప పెళ్ళాడనని నీకు ముందే చెప్పాను గదా? ఎందుకు మళ్ళీ మళ్ళీ అర్థంలేని మాటలాడతావు ? నీ శుంభ నిశుంభులను వచ్చి నన్ను యుద్ధంలో జయించి పెళ్ళాడమను,'' అన్నది దేవి.

రక్తబీజుడు మండిపడి యుద్ధం చేసి, క్షణంలో మూర్ఛపోయి తన రథంలోనే పడ్డాడు.

అయితే రక్తబీజుడి రక్తం నేల మీద పడితే, ఒక్కొక్క బొట్టుకు ఒక్కొక్క రక్తబీజుడు పుట్టుకొస్తాడు. అలా చాలా మంది పుట్టుకురావటం చూసి దేవి, వాడి రక్తం నేల మీద పడకముందే తాగెయ్యమని కాళికకు చెప్పి, లోగడ పుట్టుకొచ్చిన వాళ్ళనూ, రక్తబీజుణ్ణీ కూడా చంపేసింది.

చిట్టచివరకు దేవితో యుద్ధం చేసి చచ్చిపోయినవాళ్ళు శుంభ, నిశుంభులు. చావగా మిగిలినవారికి దేవి అభయం ఇచ్చింది. వాళ్ళు పాతాళానికి వెళ్ళిపోయారు.





# దేవీ భాగవతం

## 16. సురథుడి కథ

పరదేవత అయిన ఆదిశక్తిని ఆరాధించి, వరాలు పొందిన వారు ఎందరో ఉన్నారు.

పూర్వం సురథుడు అనే రాజు విశాలమైన రాజ్యాన్ని పాలించేవాడు. అతను చెయ్యని పుణ్యం లేదు, పాటించని నీతి, నియమమూ లేదు. అన్నివిధాలా సమర్థుడైన సురథుడి మీద కొండజాతుల వాళ్ళూ, యవనతెగలవాళ్ళూ, పెద్ద సేనలను పోగుచేసుకుని దండెత్తి వచ్చారు.

యుద్ధంలో శత్రువుల బలం అధికమై, సురథుడికి అపజయం కలిగింది. అతను తన కోటకు తిరిగి వచ్చి, తన మంత్రులు శత్రుపక్షం అయినారని తెలుసుకుని, దైవం అనుకూలించక పోవటం చింతించి, తనలో ఇలా అనుకున్నాడు:

"మంత్రులు దుర్మార్గానికి ఒడిగట్టినాక, వారిని నమ్ముకోవటం ప్రమాదకరం. వాళ్ళు నన్ను తీసుకుపోయి శత్రువుల చేతికి అప్పజెప్పుతారు. దుర్జనుడు ఎంత క్రూరత్వానికైనా ఒడిగట్ట గలడు. వాడికి నీతినియమా లెందుకుంటాయి? అలాటి వాళ్లు తాతా, తల్లీ, తండ్రీ, స్నేహితుడూ, చుట్టమూ అన్నది కూడా పాటించరు!"

ఇలా అనుకుని సురథుడు వేగవంతమైన గుర్రం మీద కీకారణ్యాల కేసి వెళ్ళిపోయాడు. అవి కాకులు దూరని కారడవి. దట్టంగా తీగలు అల్లుకుని ఉన్న చెట్ల మధ్యగా నదులు ప్రవహిస్తున్నాయి. పులులూ, సింహాలూ, ఏనుగులూ, లేళ్లూ మొదలైన మృగాలు స్వేచ్ఛగా తిరుగు



తున్నాయి. అంతటి కీకారణ్యం మధ్యనూ బ్రహ్మచారుల వేదపాఠాలు వినవస్తున్నాయి. హోమం చేసిన నీవారధాన్యపు సువాసనలూ, బాగా పండిన పండ్ల వాసనలూ తెలుస్తున్నాయి. ఇవి కొంచెం దూరంలో వున్న ఒక ముని ఆశ్రమాన్నుంచి వెలువడుతున్నాయి.

సురథుడు ఆ ఆశ్రమం కేసి వెళ్ళి, అక్కడ శిష్యులకు పాఠాలు చెప్పుతున్న మునిని చూశాడు. ఆయన శరీరం తపస్సుచేత కృశించి ఉన్నది. ఆయన జింకచర్మం మీద కూర్చుని ఉన్నాడు. ఆయన ముఖం ప్రశాంతంగా ఉన్నది. సురథుడు తన గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టేసి, వెళ్ళి ముని ముందు సాష్టాంగ పడి, కంటికీ, మంటికీ ఏకధారగా ఏడవ సాగాడు.

ముని అతన్ని లేవనెత్తి, ఒక శిష్యుడి చేత జింకచర్మం తెప్పించి, దాని మీద అతన్ని కూర్చోమని, అతిథి మర్యాదలన్నీ జరిపించి, "నాయనా, నువు ఎక్కడి నుంచి వస్తున్నావు? నీకు వచ్చిన కష్ట మేమిటి? అంతా వివరంగా చెప్పు. నా దగ్గిరికి వచ్చినాక కూడా నీకు విచారం దేనికి? నీ మనసులోని కోరిక ఎంత కష్టసాధ్యమైనదైనా సరే, నేను దాన్ని తీర్చుతాను," అన్నాడు.

దానికి సురథుడు గద్గద స్వరంతో, "నేను సురథు డనే పేరుగల రాజును. శత్రువులకు ఓడి, మీ చరణసన్నిధిని శరణుకోరి వచ్చాను. నేను రాజ్యాన్నీ, భార్యనూ, పిల్లలనూ విడిచిపెట్టి ఈ అరణ్యంలో మీ చెంతకు చేరాను. మీరే నా కిప్పుడు తల్లీ, తండ్రీనూ! మీ సేవ చేస్తూ, మీరు చెప్పిన పనులన్నీ చేస్తాను. నిస్సహాయుడనై ఉన్న నాకు శత్రుభయం పోగొట్టి, నా వారివద్ద నన్ను చేర్చండి," అన్నాడు.

ముని అతనికి అభయం ఇస్తూ, "వనవృత్తి అవలంబించి, నీవారాన్నం తింటూ శుచివిగా ఉంటూ, హింసచెయ్యకుండా

మా ఆశ్రమంలో స్వేచ్ఛగా సంచరించు. క్రమంగా నీకు శుభాలన్నీ కలుగుతాయి." అన్నాడు.

సురథుడు ఈ మాటలకు సంతోషించి, తాను కూడా మునివృత్తి పూని, ఆశ్రమంలో ఉంటూ వచ్చాడు.

ఒక రోజున అతను చల్లని చెట్టు నీడను చేరి, తన ప్రయత్నం గాని, తప్పుగాని ఏమీలేకుండా తనకు సంప్రాప్తమైన కష్టాలను, అంటే రాజ్యం పోవటమూ, భార్యా, బిడ్డలూ ఎడబాటు కావటమూ, శత్రువుల చేతిలో ఓడిపోయి పరాభవం కలగటమూ మొదలైన వాటిని గురించి ఆలోచిస్తూండగా ఒక వైశ్యుడు అక్కడికి వచ్చాడు. అతను అమిత దీనంగా ఉన్నట్టు కనబడ్డాడు.

సురథుడు ఆ వైశ్యుణ్ణి కూర్చోమని, "నువు ఎవరు? ఏం పని మీద ఇటుగా వచ్చావు? నీకు వచ్చిన కష్టం ఏమిటి?" అని అడిగాడు.

దానికి ఆ వైశ్యుడు, "నేను వైశ్యుణ్ణి, చాలా ధనవంతుణ్ణి, సత్యవ్రతంగలవాణ్ణి. దాతగానూ, ఔదార్యం గలవాడుగానూ పేరు తెచ్చుకున్నాను. ఎన్నడూ ఎలాటి కష్టమూ ఎరగను. అలాటివాణ్ణి నన్ను నా భార్యా, బిడ్డలూ ధనలోభంతో వెళ్ళగొట్టారు. ఈ అరణ్యంలో వచ్చి పడ్డాను.



నా పేరు సమాధి అంటారు. తమ కథ తెలుసుకోవచ్చునా? తమ ముఖం చూస్తే గొప్ప కళ స్ఫురిస్తున్నది," అన్నాడు.

"నా పేరు సురథుడు. నేను రాజును. శత్రువులకు చిక్కి దుర్మరణం పాలు కావటం ఇష్టంలేక, నీ లాగే ఈ అరణ్యానికి వచ్చాను. భాగ్యం పోయి, అభిమానాన్ని పోగొట్టుకుని, జడుడిలాగా ఇక్కడ సంచరిస్తున్నాను. దైవికంగా మన మిద్దరమూ ఇక్కడ కలుసుకున్నాం. కాబట్టి విచారాలు మాని, ఇక్కడే సుఖంగా ఉందాం," అన్నాడు సురథుడు.

దానికా వైశ్యుడు, "రాజా, నా మనసుకు శాంతి ఎక్కడిది? నాకు భార్యా



సుఖం దూరమయింది. నా కుటుంబానికి ఆధారం లేదు. నా కొడుకులు అప్రయోజకులు. నేను ఉప్పుకల్లు సైతం లేని గంజి కూడా తాగి కూడబెట్టిన సొమ్మంతా అలాములూ, పలాములూ చేసి దరిద్రులై పోతారన్న ఆరాటం నాకు శాంతి లేకుండా చేస్తున్నది. నేను ప్రాణాలతో మళ్ళీ వాళ్ళను చూస్తానో, లేదో!'' అంటూ కడవలకొద్దీ కన్నీరు కార్చుతూ ఏడ్చాడు.

అలా ఏడ్చే వైశ్యుణ్ణి చూసి సురథుడు, ''నిన్ను వెళ్ళగొట్టిన ఆ రాక్షసులను నువు మళ్ళీ చూస్తే మాత్రం నీకు ఏం సుఖం కలుగుతుంది? నేను కూడా రాజ్యం పోయిందే అని విచారిస్తూనే ఉంటాను. దైవికంగా వచ్చే కష్టాలు దాటాలంటే వాటిని అనుభవించవలసినదే. అయినా, ఇక్కడ ఉన్న మునిని అడిగి మనకు దుఃఖం తొలగే ఉపాయం ఉన్నదేమో తెలుసుకుందాం.'' అన్నాడు.

వైశ్యుడు అందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ ముని వద్దకు వెళ్ళి, మొక్కి నిలబడ్డారు. అప్పుడు సురథుడు మునితో ఇలా అన్నాడు:

''ఇతనొక వైశ్యుడు. ఈ అరణ్యంలోనే నాకు మిత్రుడయాడు. ఈ పుణ్యాత్ముణ్ణి భార్యా, పిల్లలూ వెళ్ళగొట్టగా, ఇతను మీ పంచన శరణు పొందుదామని వచ్చాడు. నన్ను కాపాడిన విధంగానే, పాపం, ఇతన్ని కూడా కాపాడండి. మీ దయవల్ల నేను ఇక్కడ సుఖంగానే కాలం వెళ్ళబుచ్చుతున్నాను. అయినా, నేను పడిన కష్టాలు మరపురాక, నాకు నిద్ర లేకుండా పోతున్నది. స్వామీ, మాయందు అనుగ్రహించి, మాకు శోకం లేకుండా పోయే మార్గం తెలపండి.''

ఈ మాటకు ముని, ''త్రిమూర్తులైనా మాయకు లోబడి, మోహసముద్రంలో పడి కొట్టుకుంటారన్నప్పుడు, మీ వంటి మానవమాత్రుల సంగతి అడగాలా? ఇందుకొక కథ చెబుతాను,'' అంటూ ఇలా చెప్పాడు:

పూర్వం కృతయుగంలో శ్వేతద్వీపంలో నారాయణుడు తపస్సు చేస్తూండగా, బ్రహ్మ మోహనివృత్తికోసం అక్కడే తపస్సు చేయసాగాడు. కొంతకాలానికి ఇద్దరూ తమ స్థానాలు విడిచి వస్తూ, ఒక చోట కలుసుకుని, నువ్వెవరు అంటే నువ్వెవరు అని ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.

"నేను చరాచర ప్రపంచాన్నంతటికీ సృష్టి చేసినవాణ్ణి." అన్నాడు బ్రహ్మ.

ఆ మాట విని విష్ణువు, "జగత్తునంతా నేనే సృష్టించానని నా దగ్గిరా చెబుతావు? నువ్వనగా ఎంత? నేను విష్ణువును. ఈ సృష్టి అంతా నేను చేసినది. ఆనాడు నేను మధుకైటభులను చంపి నిన్ను కాపాడిన మాటకేం చెబుతావు? నువు వట్టి రాజసుడివి. ఎందుకు నీ కింత గర్వం? నేను నిన్ను పెంచి పెద్ద చేసిన సంగతీ, దానవులు నీ మీదికి వస్తే నువు బెదిరిపోయిన సంగతీ కూడా మరచి ఇలా మాట్లాడతావా?" అన్నాడు.

"నువు రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు నీకు జగదంబ సహాయం వచ్చిన మాట మరిచావా? ఎందుకీ బింకాలు?" అన్నాడు బ్రహ్మ.

ఇలా బ్రహ్మ, విష్ణువూ కీచులాడుకుంటూండగా వారికొక లింగం కాన



వచ్చింది. వారికి ఇలా మాటలు వినిపించాయి:

"ఓ నారాయణా! ఓ బ్రహ్మ! మీ వాగ్వాదం కట్టిపెట్టి, నేను చెప్పేది వినండి. ఈ శ్వేతదీపం మీద ఇప్పుడు పుట్టుకొచ్చిన లింగానికి ఒకరు చివరా, ఇంకొకరు మొదలూ చూసి, మీలో ఎవరు ముందు తిరిగి వస్తారో వారు మీ ఇద్దరిలోకీ గొప్పవాడు."

ఇద్దరూ ఇందుకు ఒప్పుకున్నారు. లింగంయొక్క మొదలు తెలుసుకునేటందుకు విష్ణువు పాతాళానికీ, దాని చివర చూసి రావటానికి బ్రహ్మ ఆకాశంలోకీ బయలుదేరారు.



విష్ణువు పాతాళంలోకి ఎంత లోతు వెళ్ళినా లింగానికి మొదలు కనిపించనే లేదు. దాని మొదలు తనకు కనిపించ దేమోనన్న విచారం విష్ణువును బాధించ సాగింది.

అలాగే బ్రహ్మ ఆకాశంలోకి ఎంత ఎత్తు వెళ్ళినా లింగంయొక్క చివర కాన రాలేదు. బ్రహ్మకు ఎంతో సిగ్గూ, దుఃఖమూ కలిగాయి. అతను ఏం చెయ్యా టానికీ పాలుబోక ఒకచోట నిలిచిఉండగా, పైనుంచి భూమికేసి పడుతున్న ఒక మొగలిపువ్వు కనబడింది. బ్రహ్మ దాన్ని పట్టుకుని, పరమానందంతో విష్ణువు ఉన్న చోటికి వెళ్లి, "నేను లింగం చివర చూసి వచ్చాను. అక్కడ ఉన్న ఈ మొగలి పువ్వును తెచ్చాను," అన్నాడు.

అప్పుడు విష్ణువు ఆ మొగలి పువ్వుతో, "ఈ బ్రహ్మ నిజంగా లింగం తలను చూశాడా? నిన్ను దేవతలు నిజంగా లింగం మీద దించారా?" అని అడిగాడు.

"అవును! నిజమే!" అని మొగలి పువ్వు విష్ణువుతో అబద్ధ మాడింది.

విష్ణువు దాని మాట నమ్మలేక, "లోకంలో అనేకమంది డబ్బుకోసం దొంగసాక్ష్యాలు చెబుతారు. ఈ విషయంలో శివుడి మాట తప్ప మరెవరిమాటా నేను నమ్మను!" అన్నాడు.

అప్పుడు లింగరూపం అంతర్ధాన మయింది. శివుడు విష్ణువుతో, "మొగలి అబద్ధ మాడింది. అది నాతల మీదినుంచి కిందపడుతూంటే, దారిలో బ్రహ్మ దాన్ని చూసి పట్టుకుని తీసుకువచ్చాడే గాని, అతను నా శిరస్సు చూసినవాడు కాడు," అన్నాడు.

అప్పుడే శివుడు మొగలిని తన పూజకు పనికిరానిదిగా శాపం పెట్టాడు. తరవాత బ్రహ్మ, విష్ణులు తమ దారిన తాము వెళ్ళారు.

ముని సురథుడికీ, సమాధి అనే పేరు గల వైశ్యుడికీ ఈ సంఘటన గురించి చెప్పి, ఇలా అన్నాడు:

"రాజా, మోహాన్ని ఎవరూ దాటలేరు. ఎంతో ప్రవీణులైనవారు కూడా మోహ బద్ధులవుతారు. అలా మోహానికి అందనిది జగదంబ ఒక్కతే. ఆమె లక్షణాలు తెలుసుకున్నవారు మాత్రమే మోహ సముద్రాన్ని దాటగలుగుతారు."

"మహాత్మా, ఆ లక్షణాలేవి?" అని సురథుడు మునిని అడిగాడు.

ముని ఇలా చెప్పాడు:

"అంబపూజ శుభప్రదం. అది అన్ని కోరికలూ తీర్చుతుంది. ఇది ఆశ్వయుజ మాసంలో జరిపే నవరాత్ర వ్రతం. ఈ వ్రతాన్ని ఆశ్వయుజ, చైత్రమాసాలు రెండిటి ఆరంభంలోనూ తొమ్మిదేసి రోజులు చేయాలి. వ్రతం చేసేవాడు నిరాహారిగా, మంత్రాన్ని జపిస్తూ, నెయ్యీ, పాలూ, చక్కెరా కలిపిన పాయసంతో గాని, మేక మాంసంతోగాని, బిల్వ పత్రాలతోగాని హోమం చేసి, బ్రాహ్మణ సంతర్పణ చెయ్యాలి. నవరాత్రపూజ చేసేవాడు జాతిభేదాలు పాటించరాదు, స్త్రీ పురుషభేదాలు పాటించరాదు. దేవీ పూజకు ఆరుకోణాలు గల యంత్రమూ, దాని పక్కన ఎనిమిది కోణాలుగల యంత్రాన్నీ రచించి, నవాక్షర బీజ మంత్రాలతో ప్రాణప్రతిష్ఠచేసి, మండలం మధ్యలో రాగిపాత్రను పెట్టాలి. దానికి



షోడశోపచార పూజలూ చెయ్యాలి. హోమమూ, హోమంలో పదోవంతు తర్పణమూ, తర్పణంలో పదోవంతు బ్రాహ్మణసంతర్పణ వగైరాలూ జరపాలి. పదవరోజున పారణ చెయ్యాలి. ఇలా చేసిన వారికి ఉత్తమలోకాలూ, దేవీ సహాయమూ లభిస్తాయి.

"రాజా, దేవీపూజకు సమమైనది మరొకటిలేదు. దేవిని అర్చించటం ద్వారా నీ బంధువుల నందరినీ తిరిగి కలుసుకుంటావు. ఓ వైశ్యోత్తమా, నువు కూడా దేవీపూజ చెయ్యి. నీ దుఃఖం ఉపశమించి, నువు తిరిగి ఎప్పటిలా ధనికుడవుతావు."

ముని చెప్పిన ఈ మాటకు ఆ ఇద్దరూ సంతోషించి, "మహాత్మా, తమ దయవల్ల మాకు మనోవ్యధ పోయింది. మాకు ఆ మంత్రం ఉపదేశించండి," అన్నారు.

ముని వారికి నవాక్షర మంత్రం బీజ సహితంగా ఉపదేశించాడు. వారు ముని వద్ద శలవు తీసుకుని, ఒక నదీతీరాన నిర్జనప్రదేశంలో ఆకులే ఆహారంగా రెండు సంవత్సరాలు మంత్రం జపించారు. ఒక నాడు కలలో వారికి దేవి ఎర్రని బట్టలు ధరించి కనిపించింది. అయినా వారు తపస్సు మానక, మూడో సంవత్సరమంతా జలమే ఆహారంగా గడిపారు. కాని దేవి సాక్షాత్కరించలేదు.

వాళ్ళు ఆత్మాహుతి కావటానికి నిశ్చయించుకుని, ఒక కుండం తవ్వి, అందులో అగ్నిరగిల్చి, తమ మాంసంకోసి అగ్నిలో వేల్చనారంభించే సరికి, దేవి వారికి ప్రత్యక్షమయింది.

"మీ సాహసానికి మెచ్చాను, వరం కోరండి," అన్నదామె.

సురథుడు, "తల్లీ, శత్రువులకు ఓడి, రాజ్యభ్రష్టుణ్ణి అయి పోయి, ఇంత కాలానికి నా పుణ్యం పండి నీ దర్శనం సంపాదించాను. నాకు నా రాజ్యం తిరిగి ఇప్పించి, నాకష్టాలు కడతేర్చు," అన్నాడు.

"నువు నీ శత్రువులను ఓడిస్తావు. నీ మంత్రులు నిన్ను కొలుస్తామని వస్తారు. నువు వెయ్యేళ్లు సుఖంగా రాజ్యం చేస్తావు. నీకు మంచికాలం సమీపించింది," అని దేవి చెప్పింది.

సురథుడు అలాగే తన గుర్రం మీద తిరిగి వెళ్ళి, శత్రువులను జయించి, తిరిగి రాజ్యం ఏలుతూ, చివరకు దేవి సాయుజ్యం పొందాడు.

వైశ్యుడు మాత్రం, "తల్లీ, నాకు సిరి సంపదలు వద్దు. నాకు శాశ్వతమైన సుఖం కావాలి," అన్నాడు.

దేవి అతనికి దివ్యజ్ఞానం ఇచ్చింది. అతను జీవితాంతమూ నిస్సంగుడై తీర్థయాత్రలు చేసి, దేవి సాయుజ్యం పొందాడు.





# దేవీ భాగవతం

పూర్వం త్వష్ట్రుప్రజాపతి దేవతలందరిలోకీ గొప్పవాడూ, గొప్ప తపస్సు చేసిన వాడూనూ. ఆయన ఇంద్రుడిపై ద్వేషంతో మూడు తలలు గల విశ్వరూపుణ్ణి సృష్టి చేశాడు. విశ్వరూపుడు పెరిగి పెద్ద అవుతూ, మూడు తలలతోనూ మూడు వేరు వేరు పనులు చేస్తూంటే మునులందరూ మెచ్చుకునేవారు. అతను ఒక నోటితో వేదపఠనం చేసేవాడు, మరొక నోటితో కల్లు తాగేవాడు, మూడో ముఖంతో ప్రపంచంలో జరుగుతున్నదంతా గమనించేవాడు.

అలాటి విశ్వరూపుడు పంచాగ్నుల మధ్య తపస్సు చేశాడు. ఒంటికాలి మీదా, చలికాలం నీటిలోనూ, వేసవిలో అగ్నుల మధ్యా నిలబడి, నిరాహారుడై తపస్సు చెయ్యటం చూసి, అతను తన పదవి కాజెయ్యటానికి చూస్తున్నాడనుకుని, అతని తపస్సు భగ్నం చేయ నిశ్చయించి, ఇంద్రుడు తన ,సభకు వెళ్ళి, రంభా, ఊర్వశీ, మేనకలను పిలిపించి వారితో, "సుందరాంగులారా, మూడు తలకాయలవాడు నా సింహాసనం కోసం తపస్సు చేస్తున్నాడు. ఎలాగైనా అతని తపస్సు చెడగొట్టి, మీరు నన్ను రానున్న ఆపద నుంచి కాపాడాలి. చక్కగా అలంకరించుకుని, మీ నృత్య గాన కళలను వినియోగించి, ఆ విశ్వరూపుణ్ణే మన్మధుడి పాలపడవెయ్యండి," అని చెప్పాడు.

**17. వృత్రుడి విజృంభణ**



ఇంద్రుడు తమను దీనంగా అలా కోరుతూంటే, అప్సరలు అతనితో, ''ఆ మునిని మా తళుకు బెళుకులతోనూ, ఓరచూపులతోనూ, క్షణంలో మాకు దాసుణ్ణి చేసుకుంటాం,'' అనేసి, విశ్వరూపుడి ఆశ్రమానికి వచ్చారు.

అప్సరలు తన ఎదట పాడుతూ, ఆడుతూ, చిత్ర విచిత్రాల అభినయాలు చేస్తూంటే, మూగవాడూ, గుడ్డివాడూ, చెవిటివాడూ అయినట్టుగా విశ్వరూపుడు కొంచెం కూడా చలించలేదు.

అప్సరలు కొన్ని రోజులపాటు ఆడి, పాడి, విశ్వరూపుడి మనోనిబ్బరానికి ఆశ్చర్యపడుతూ, ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్ళి, ''మా ప్రయత్నాలన్నీ ఆ ముని ముందు బూడిద పోసిన పన్నీరు అయాయి. ఎంత కవ్వించినా చలించడు! ఇంకా నయం! శాపం పొందకుండా తిరిగి రాగలిగాం!'' అన్నారు.

ఇంద్రుడు మహాత్ముడైన ఆ విశ్వరూపుణ్ణి చంపటానికి నిశ్చయించాడు. అది ఎటువంటి మహాపాతకమో అతను ఆలోచించలేదు. అతను ఐరావతాన్నెక్కి, విశ్వరూపుడు తపస్సమాధిలో ఉన్న చోటికి వెళ్ళి, ఆయన మీద వజ్రాయుధం ప్రయోగించి, చంపాడు.

అది చూసిన మునులు, ''ఈ దేవేంద్రుడికి ఏం తెగులు పుట్టింది? అంతటి పుణ్యాత్ముణ్ణి చంపాడు! దీనికి ఇతను తప్పక అనుభవించి తీరుతాడు!'' అన్నారు.

విశ్వరూపుణ్ణి చంపి, ఇంద్రుడు ఇంటికి వెళ్ళిపోయాడు. అయితే అతని మనసులో ఒక సందేహం మిగిలింది. చచ్చిపోయిన విశ్వరూపుడు మళ్ళీ బతకడు గద! ఎందుకంటే, వజ్రం దెబ్బ తిని చచ్చిపోయినాక కూడా విశ్వరూపుడిలో తేజస్సు అనర్గళంగా ఉన్నది.

ఈ అనుమానంతో ఇంద్రుడు వడ్రంగిని పిలిచి, ''విశ్వరూపుడు చచ్చి కూడా జీవకళ ఉట్టిపడుతూ కనిపిస్తున్నాడు.

అతను మళ్ళీ బతకకుండా అతని తల కాయలు చెక్కెయ్యి.'' అన్నాడు.

దానికి వడ్రంగి, ''అదేమిటి? ఇతను వజ్రాయుధం దెబ్బతో చనిపోయాడు. చచ్చినవాణ్ణి వధించి పాపం కట్టుకోనా? నువు నిష్కారణంగా ఈ మునిని ఎందుకు చంపావో నాకైతే తెలీదు. అయినా చచ్చి పోయిన వాడి తల నరకవలసిన పని ఏమిటి? ఇంతకూ ఇతనంటే నీకెందుకు భయం?'' అని అడిగాడు.

''ఇతను గొప్ప ముని అయితేనేంగాక, నాకు శత్రువు! శత్రువును చంపటం విధి గనక చంపాను. చచ్చిపోయి కూడా బతికి ఉన్నట్టే కనబడ్డాడు. అగ్నిశేషమూ, ఋణశేషమూ, శత్రుశేషమూ ఉండ నియ్యరాదుగదా!'' అన్నాడు ఇంద్రుడు.

''నిరపరాధీ, బ్రహ్మతేజస్సుగలవాడూ అయిన ఇతన్ని చంపినందుకు నీకు బ్రహ్మహత్యాదోష భయంలేదా?'' అని వడ్రంగి అడిగాడు.

''నాకు శత్రుశేషం అంటే ఉన్న భయం బ్రహ్మహత్యాపాపం అంటే లేదు. ఆ పాపాన్ని ఎలాగైనా పోగొట్టుకోవచ్చు కాని శత్రుశేషానికి ప్రాయశ్చిత్తం లేదు గదా! అందుచేత శత్రునిర్మూలనకు ఏ పాపమైనా చెయ్యవచ్చు.'' అన్నాడు ఇంద్రుడు.



''ఇటువంటి పాపిష్ఠి కార్యానికి నిన్ను లోభం పురిగొల్పిందేమో, నన్ను పురి కొల్పే లోభం ఏదీలేదే, నేనెందుకు యిలాంటి పాపం చెయ్యాలి?'' అని వడ్రంగి అడిగాడు.

''నువు అలా అనేటట్టుంటే, ఇక నుంచీ నీకు యజ్ఞంలో భాగం ఇప్పిస్తాను. యజ్ఞంలో బలి చేసే పశువు తల ఇక నుంచీ నీదే!'' అన్నాడు ఇంద్రుడు.

ఆ మాట మీద వడ్రంగి తన గొడ్డలితో విశ్వరూపుడి తలలు నరికాడు. చిత్రంగా ఆ తలలు నేల మీద పడేటప్పుడు, ఒక్కొక్క తలనుంచి ఒక్కొక్క రకం పక్షులు అనేక వేల సంఖ్యలో బయటికి



వచ్చి, ఎగిరిపోయాయి. వేదం చదివే ముఖం నుంచి కపింజలాలు అనే పక్షులూ లోకాన్నంతనూ పరిశీలించే ముఖం నుంచి తీతువుపక్షులూ, కల్లుతాగే ముఖం నుంచి ఊరపిచ్చుకలూ వెలువడ్డాయి.

తన పని పూర్తి అయినట్టు తృప్తిపడి ఇంద్రుడు తనకు కలిగిన బ్రహ్మహత్యా పాతకానికి ప్రాయశ్చిత్తం చేసుకునే ప్రయత్నంలో ఉన్నాడు.

తన పుత్రుణ్ణి ఇంద్రుడు హత్య చేశాడని విని త్వష్ట్రుప్రజాపతి మండిపడి, ''ఒరే దేవతలారా, చూశారా? ఏ పాపమూ ఎరగకుండా తపస్సు చేసుకుంటున్న నా కొడుకును చంపిన ఇంద్రుణ్ణి నాశనం చెయ్యటానికి మహాబలుడైన కొడుకును పుట్టించబోతున్నాను!'' అని, అధర్వణ మంత్రాలతో అగ్నిని అర్చించి వ్రేల్చేసరికి, అగ్నిహోత్రుడికి తీసిపోకుండా ప్రకాశిస్తున్న కొడుకు పుట్టుకొచ్చాడు.

త్వష్ట వాణ్ణి చూసి, ''పుట్టగానే సరి కాదురా! వెంటనే పెరిగి పెద్దవాడవై, ఇంద్రుణ్ణి హతమార్చెయ్యి!'' అని శాసించాడు.

చూస్తూండగానే ఆ శిశువు పర్వతాకారుడై, కాలమృత్యువులాగా కనబడి, దేవతలకు కంపరం కలిగిస్తూ, "నా పేరు ఏమిటి? నన్ను ఎందుకు పుట్టించావు? నీకుగల విచారం ఏమిటి? నీ మనసులోని కోరిక ఎంత అసామాన్యమైనదైనా సరే సాధిస్తాను. తండ్రి కోరిక తీర్చలేని కొడుకు కన్న హీనుడుండడు గదా!'' అని తన తండ్రిని అడిగాడు.

దానికి త్వష్ట ''నీ పేరు వృత్రుడు. వేదతత్వం తెలిసినవాడూ, మూడుతలలు గలవాడూ అయిన మీ అన్నను చంపిన ఇంద్రుణ్ణి హతమార్చటానికి నువు పుట్టావు. ఆ పని చెయ్యి,'' అని వృత్రుడితో అని, రకరకాల ఆయుధాలు తయారుచేసి ఇచ్చి, రథం కూడా ఇచ్చి, మంచి ముహూర్తాన, బ్రాహ్మణాశీర్వాదాలతో సహా ఇంద్రుణ్ణి చంపటానికి పంపాడు.

వృత్రుణ్ణి గురించిన ఈ వార్త ఇంద్రుడికి వెంటనే చేరింది.

"త్వష్టృప్రజాపతి నిన్ను చంపటానికి పర్వతాకారుడైన వృత్రుణ్ణి సృష్టిచేసి పంపాడు. అతను బలవంతులైన రాక్షసులను వెంటబెట్టుకుని వస్తున్నాడు." అని దూతలు ఇంద్రుడితో అంటూండగానే, వృత్రుణ్ణి స్వయంగా చూసి బెదిరి పారిపోయి వచ్చిన దేవతలు ఇంద్రుడితో ఇలా అన్నారు:

"దేవా, అతి భయంకరమైన దుశ్శకునాలు తమ పురంలో కనిపిస్తున్నాయి. కాకులూ, గుడ్లగూబలూ, రాబందులూ కూస్తున్నాయి. ఇళ్లమీద రాక్షసుల అరుపులు వినిపిస్తున్నాయి. స్త్రీలకు పీడకలలు వస్తున్నాయి."

ఈ అశుభాలు విని ఇంద్రుడు భయపడి బృహస్పతితో, "ఈ దుశ్శకునాలకు శాంతి ఏమిటి?" అని అడిగాడు.

"ఉత్తపుణ్యానికి నిరపరాధుడైన మునిశ్రేష్ఠుణ్ణి చంపి ఏం బావుకున్నావు? ఆ పాపం నిన్ను కట్టి కుడపకుండా వదిలిపెట్టుతుందా? ఏదైనా చేసేటప్పుడు ముందూ, వెనకా ఆలోచించి మరీ చెయ్యాలి. లేకపోతే జీవితం కష్టాల పాలవుతుంది. మోహలోభాలకు వశుడివై బ్రహ్మహత్య మెడకు చుట్టుకున్నావు.



పెద్ద ఎత్తున చేసే పుణ్య, పాపాలకు ఫలితం వెంటనే కనబడుతుంది. ఇతరులను పీడించే వాడికి సుఖం ఉండదు. నీకు కష్టకాలం ఆసన్నమయింది. ఈ వృత్రుడు మహాబలవంతుడు. తేలికగా చావడు. వాడికి త్వష్ట ఆయుధాలు కూడా ఇచ్చాడు. వాటిలో ఏ ఒకదానికీ నీ వజ్రం సరిరాదు. వాడి ధాటి చాలా గొప్పది." అన్నాడు బృహస్పతి.

దేవేంద్రుణ్ణి హతమార్చటానికి వృత్రుడు వస్తున్నాడని విని, మునులూ, యక్షులూ, దేవతలూ కంగారుగా పారిపోయారు. అలా ఇళ్లూ, వాకిళ్లూ విడిచి పారిపోతున్న దేవతలను చూసి ఇంద్రుడు



పడ్డాయి. ముందు వరుణుడు పారిపోయాడు. తరవాత క్రమంగా వాయుగణాలూ, యముడూ, కాంతి నశించిన అగ్నీ నిష్క్రమించారు. ఇంద్రుడు పలాయనం చెయ్యక తప్పలేదు: దేవతలనందరినీ జయించి, వృత్రుడు తండ్రి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, ''అందరూ ఓడి, భయపడి పారిపోయారు. భయపడ్డవాళ్ళు అని ఎవరినీ చంపలేదు. ఇంద్రుడు కాలిసత్తువకొద్దీ పరిగెత్తిపోతే, అతని ఏనుగును తెచ్చాను. దీన్ని నువు కానుకగా తీసుకో. ఇంకా ఏం చెయ్యాలో చెప్పు, ఎంత కష్టమైనా చేస్తాను,'' అన్నాడు.

త్వష్ట తన కొడుకును చూసి చాలా సంతోషించి, ''నాయనా, నీ పరాక్రమం సాటిలేనిది. మళ్ళీ నలుగురిలో తల ఎత్తుకు తిరగగలను. నా మనోవేదన పోయి, జీవితం ఫలించింది. నాకు స్థిమితం కలిగింది. ఇక నువు చెయ్యవలసినపని చెబుతాను, విను. ఇంద్రుణ్ణి నమ్మరాదు. అతను చేసే ఇంద్రజాలాన్ని లక్ష్యపెట్టక, బ్రహ్మను గురించి తపస్సు చేసి, చావు లేనివాడివై, ఇంద్రుణ్ణి పరిమార్చు. తపస్సుతో సాధించరానిది ఏదీ లేదు. ఆ దుర్మార్గుడు అకారణంగా నా కొడుకును చంపాడన్న సంగతి

విచారంతో తన సేవకులను పిలిచి, ''రుద్రులనూ, ఆదిత్యులనూ, వసువులనూ, దిక్పాలకులనూ విమానాల మీద యుద్ధానికి రమ్మని పిలవండి,'' అన్నాడు.

ఇలా అని, ఇంద్రుడు బృహస్పతిని కూడా తన ఏనుగు మీద ఎక్కించుకుని, యుద్ధానికి తరలాడు. అతని వెనక ఆయుధాలతో సహా దేవతలు కూడా వెళ్ళారు. వృత్రుడు కూడా దానవసేనలను వెంట బెట్టుకుని వచ్చాడు. ఉభయపక్షాలూ మానససరస్సుకు ఉత్తరాన ఉన్న పర్వతం మీద సంఘటించాయి.

నూరు సంవత్సరాలపాటు యుద్ధం సాగింది. దానిమూలంగా లోకాలన్నీ బాధ

మనసులో నుంచి పోకుండా ఉన్నది. ఆ ఇంద్రుణ్ణి అంతం చెయ్యి,'' అన్నాడు.

వృత్రుడు తండ్రి వద్ద సెలవు పుచ్చుకుని, క్రోధావేశంతో గంధమాదన పర్వతం మీదికి వెళ్ళి, గంగలో స్నానాలు చేస్తూ, దర్భచాప మీద ఉండి, అన్ని రకాల ఆహారమూ త్యజించి, యోగం అవలంబించి, మునులకు అద్భుతమనిపించేలాగా బ్రహ్మను గురించి తపస్సు చేశాడు.

ఇంద్రుడికి దడపుట్టింది. తనకు చేతనైనది తపోభంగం చెయ్యటం. అందుకుగాను అతను అప్సరలను పంపాడు. వాళ్ళ చేష్టలు వృత్రుడి మీద పనిచెయ్యలేదు. వాళ్ళు విచారంగా ఇంద్రుడి వద్దకు తిరిగివెళ్ళి, వృత్రుడి తపస్సు చెడగొట్టటం తమ శక్తికి మించిన పని అని చెప్పారు.

చివరకు వృత్రుడి తపస్సుకు బ్రహ్మ సంతోషించి, ప్రత్యక్షమై, ''ఇంక నీ తపస్సు చాలించి, నీకు ఏం కావాలో అడుగు,'' అన్నాడు.

వృత్రుడు బ్రహ్మకు చేతులు జోడించి, "దేవా, ఇదివరకే ఇంద్రపదవి సంపాదించి ఎంతో సంతోషించాను. ఇవాళ నీ దర్శన భాగ్యం లభించటం అంతకంటె ఎంతో ఎక్కువ కదా! ధన్యుణ్ణి! నేను కోరిన వరం ఇయ్యదలిస్తే, లోహాలవల్ల గాని, కర్రలవల్ల గాని, ఎండిన, ఎండని వెదురు వస్తువులతో గాని, ఇతర ఆయుధాలచేత గాని నాకు చావు లేకుండా వరం ఇయ్యి. యుద్ధం సాగినకొద్దీ నా శక్తి పెరిగేటట్టు వరం ఇయ్యి,'' అన్నాడు.

బ్రహ్మ అతను కోరినవరం ఇచ్చి వెళ్ళిపోయాడు.

వృత్రుడు పరమానందంతో తన తండ్రి వద్దకు తిరిగివెళ్ళి, జరిగినదంతా ఆయనకు చెప్పాడు.

''నాయనా, నీకు శుభం! నీ అన్నను, విశ్వరూపుణ్ణి, అకారణంగా చంపి, బ్రహ్మహత్యాపాతకం మెడకు చుట్టుకున్న ఆ ఇంద్రుణ్ణి ఇప్పుడు నిర్భయంగా చంపెయ్యి,'' అన్నాడు త్వష్ట.





# దేవీ భాగవతం

ఇంద్రుణ్ణి నిర్మూలించమని త్వష్ట చెప్పిన మీదట వృత్రుడు రథం ఎక్కి, గొప్ప సేనను వెంట బెట్టుకుని, యుద్ధానికి బయలుదేరాడు. ఇంద్రుడు మరొకసారి వృత్రుడితో యుద్ధం చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఇంద్రుడికీ, వృత్రుడికీ గొప్ప యుద్ధం జరిగింది. ఇద్దరూ పోరాడారు. చూసి, చూసి వృత్రుడు ఇంద్రుణ్ణి పట్టుకుని తన నోట్లో పెట్టుకున్నాడు.

అది చూసి దేవతలు ఆక్రోశిస్తూ, ఇంద్రుడి విముక్తికి మార్గం చెప్పమని బృహస్పతిని అడిగారు.

''నేను మాత్రం ఏం చెయ్యగలను? ఇంద్రుడు చావలేదు. ఆ వృత్రుడి నోట్లో ప్రాణాలతోనే ఉన్నాడు.'' అన్నాడు బృహస్పతి.

అప్పుడు దేవతలు కూడబలుక్కుని, జృంభిక అనే శక్తిని సృష్టించారు. ఆ శక్తి వృత్రుణ్ణి ఆవహించి, అతనికి ఆవలింత తెప్పించింది. వృత్రుడు నోరు తెరవగానే ఇంద్రుడు బయటికి దూకాడు.

యుద్ధం చాలా దీర్ఘకాలం సాగిన మీదట ఇంద్రుడు పూర్తిగా ఓడి, దిక్కులేని వాడయాడు. వృత్రుడు అమరావతికి వచ్చి, అక్కడి సకల సంపదలనూ స్వాధీనం చేసుకున్నాడు.

తన కొడుకు స్వర్గానికి రాజు కావటం చూసి త్వష్ట ఎంతో సంతోషించాడు. దేవతలు యజ్ఞభాగాలు పోగొట్టుకుని,

**18. వృత్రుడి వధ**



చెట్టులూ, పుట్టలూ పట్టిపోయారు. దేవ నగరం రాక్షసనగరమయింది.

దేవతలు వెళ్ళి శివుడికి తమ గోడు చెప్పుకున్నాడు.

"తమ శరణు జొచ్చాం. మమ్మల్ని కాపాడాలి," అన్నారు వాళ్ళు.

శివుడు మామూలు ధోరణిలో దేవతలతో, "మనం బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణువు వద్దకు పోదాం. అతనే వృత్రుణ్ణి చంపుతాడు," అన్నాడు.

ఇంకేం? అందరూ కలిసి వైకుంఠానికి వెళ్ళారు. విష్ణువు వారికి దర్శనం ఇచ్చి, "మీరంతా ఇలా వచ్చారు. ఏమిటి విశేషం?" అని అడిగాడు.

అందరూ విచారంగా ఉండటం చూసి విష్ణువే మళ్ళీ, "మీకు వచ్చిన కష్టమేమిటో చెప్పితే దానికి తగిన పరిష్కారం చేస్తాను," అన్నాడు.

దేవతలు తమ కష్టం చెప్పుకున్నారు. వారితో విష్ణువు ఇలా అన్నాడు:

"అవును, మీకు వచ్చిన కష్టం నాకు తెలుసు. వృత్రుణ్ణి ఏ మోసంతోనైనా చంపే ఉపాయం ఆలోచించి మీకు చెబుతాను. బ్రహ్మ నుంచి పొందిన వరాలతో ఎవరివల్లా చావులేక, మదించి, నిరంకుశుడుగా ప్రవర్తిస్తున్నాడు వృత్రుడు. మీరు వృత్రుడికీ, ఇంద్రుడికీ స్నేహం కలిగించండి. నేను వజ్రాయుధంలో అదృశ్యంగా ఉండి మీకు సహాయపడతాను. ఏలాటి కపటంతో వాణ్ణి స్నేహానికి ఒప్పించటం సాధ్యం అవుతుందో అలాటి కపటాన్ని ప్రయోగించండి. ఎలాగైనా వాణ్ణి నమ్మించండి. తరవాత ఇంద్రుడు యుక్తిగా వాణ్ణి చంపేస్తాడు. నేను లోగడ మోసాలు చెయ్యలేదా? వామనుడి రూపంలో వెళ్ళి బలిని మోసగించలేదా! మోహినీరూపంలో దానవులను మోసగించలేదా? అది అలా ఉంచి, సమస్త కోరికలూ తీర్చగల జగజ్జననిని ప్రార్థించినట్టయితే, ఆమె తన యోగమాయతో సహాయపడుతుంది. ఆమె మాయకు

లోబడి వృత్రుడు ఇంద్రుడి చేతిలో చస్తాడు. మీరు కూడా ఆమె సహాయంతో వృత్రుణ్ణి చంపండి.''

దేవతలు కల్పవృక్షాలతో కూడిన మేరు పర్వతం మీదికి వెళ్ళి, మహాదేవిని ధ్యానించారు. వాళ్ళు మహాదేవి తమకు లోగడ సహాయపడి, మహిషాసురుణ్ణీ, శుంభ నిశుంభులనూ, ఇతర రాక్షసులనూ ఎలా చంపినదీ చెప్పి, ''తల్లీ, ఈ వృత్రుడు నీకు కూడా శత్రువే అయి ఉండాలి. లేకపోతే, నీ భక్తులమైన మమ్మల్ని ఇలా ఎందుకు హింసలపాలు చేస్తాడు?'' అన్నారు.



వారి పొగడ్తలకు సంతోషించి దేవి ఆభరణాలతో, మూడు కళ్ళతో, నాలుగు చేతులతో, దివ్యమైన ఆయుధాలతో రక్త చందనం రంగుగల వస్త్రాలు ధరించి, వారి ఎదట ప్రత్యక్షమయింది.

ఆమె వారికి సహాయం చేస్తానని మాట ఇచ్చి అంతర్ధానమయింది. దేవతలు కూడా తృప్తిపడి తిరిగి వచ్చి, ఇంద్రుడితో స్నేహానికి ఒప్పించటానికి మునులను వృత్రుడి వద్దకు పంపారు.

మునులు వృత్రుడి వద్దకు వెళ్ళి ఇలా అన్నారు:

''వృత్రా! నువు మహాయోగ్యుడవు. ఇంద్రుడు కూడా గొప్పవాడు అనిపించుకున్నవాడే. అలాటప్పుడు మీ రిద్దరూ స్నేహంగా ఉంటే వేరే చెప్పాలా? ఇంద్రుడు నీతో స్నేహప్రమాణం చేస్తాడు. నువు కూడా అలాగే చెయ్యి. మునులు మీకు మధ్యవర్తులుగా ఉంటారు.''

దానికి వృత్రుడు, ''మీరంటే నాకు చాలా గౌరవం. మీ మాట తీసివేయటానికి వీల్లేదు. అయితే పాపాత్ముడూ, బ్రహ్మహంతకుడూ అయిన ఇంద్రుణ్ణి, ఎలా నమ్ముతాను?'' అన్నాడు.

దానికి మునులు, ''ఎవడి ద్రోహం వాణ్ణే కట్టికుడుపుతుంది. బ్రహ్మహత్యాపాతకానికీ, కల్లు తాగిన పాపానికీ ప్రాయశ్చిత్తం ఉన్నది. కాని మిత్ర



ద్రోహానికి ప్రాయశ్చిత్తం లేదే! అందుచేత నువూ, ఇంద్రుడూ ప్రమాణపూర్వకంగా స్నేహం చేసుకోవచ్చు.'' అన్నారు.

''తడి దానితోగాని, పొడి దానితోగాని, రాతితోగాని, కర్రతోగాని, కఠినమైన వజ్రంతోగాని, పగలుగాని, రాత్రిగాని దేవతలూ, వారి అధిపతి అయిన ఇంద్రుడూ నన్ను చంపకూడదు. ఇందుకు అభ్యంతరం లేకపోతే, మీరు కోరినట్టు చేయగలను,'' అన్నాడు వృత్రుడు.

మునులు ఈ మాట తీసుకుపోయి ఇంద్రుడితో చెబితే అతను సరేనన్నాడు. ఇంద్రుడు వృత్రుడి నియమానికి అగ్ని సాక్షిగా ఒప్పుకున్నా నన్నమీదట. ఆ మాట నమ్మి వృత్రుడు ఇంద్రుడితో స్నేహం చేశాడు.

ఇద్దరూ స్నేహంగా కలిసి తిరిగారు. సముద్రతీరానా, నందనవనంలోనూ సంచరించారు. వృత్రుడు తృప్తిపడ్డాడు. కాని ఇంద్రుడు మాత్రం వృత్రుణ్ణి చంపే అవకాశం కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.

తన కొడుకు ఇంద్రుడితో స్నేహం చేసినట్టు విని త్వష్ట అమితాశ్చర్యంతో కొడుకును చూడవచ్చి ఇలా అన్నాడు:

''నువు ఈ ఇంద్రుణ్ణి ఎలా నమ్మావు! అందరూ మనలాటివాళ్ళే అనుకోవటం పొరపాటు. ఎంత వెర్రివాడైనా శత్రువును నమ్ముతాడా? అందులోనూ అవకాశం దొరికితే నమ్మకద్రోహం చేసేవాడు ధర్మానికి కట్టుపడతాడా?''

ఈ ధోరణిలో తండ్రి ఎంత బోధించినా, కాలం మూడిన వృత్రుడి తలకెక్కలేదు.

ఒకనాటి సంధ్యవేళ ఇంద్రుడూ, వృత్రుడూ సముద్రతీరాన తిరుగుతున్నారు. అది రాత్రీ కాదు, పగలూ కాదు; అంతేగాక వృత్రుడు ఒంటరిగా ఉన్నాడు. అందుచేత ఇంద్రుడు వృత్రుణ్ణి చంపటానికి అదే అదను అనుకుని, విష్ణు

వును తలచుకున్నాడు. విష్ణువు వచ్చి, అదృశ్యంగా వజ్రాయుధంలో ప్రవేశించాడు. ఇంద్రుడికి సముద్రపు నురుగు కనిపించింది ; అది తడిదీ కాదు, పొడిదీ కాదు ; ఏ విధమైన ఆయుధమూ కాదు. ఇంద్రుడు దేవిని కూడా తలచుకున్నాడు. ఆమె తన అంశను ఆ నురుగులో ప్రవేశ పెట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని నురుగుతో కప్పి, వృత్రుడి మీద బలంగా విసిరాడు. ఆ దెబ్బతో వృత్రుడు కొండ విరిగిపడినట్టు పడి, అప్పటికప్పుడు ప్రాణాలు వదిలాడు.



శత్రుభయం తీరిపోయిన ఇంద్రుడు అమరావతికి తిరిగివచ్చి, మునుల నుంచి స్తోత్రాలు పొందుతూ, మహాదేవికి ఉత్సవం చేయించి, నందనోద్యానంలో రత్నమయమైన ఆలయాన్ని దేవికి కట్టించి, ప్రతిష్ఠించాడు. తరవాత అతను తనకు సహాయపడిన విష్ణువును దేవత లందరితో కలిసి పూజించాడు. వృత్రుణ్ణి చంపినది దేవీ, విష్ణువూ, ఇంద్రుడూ అయినా, కీర్తి ఇంద్రుడికే వచ్చింది. విష్ణువు వెళ్ళిపోయాడు.

అయితే ఇంద్రుడికి మిత్రద్రోహం చేశానన్న భయం పట్టుకున్నది. ఈ పాతకంలో తమకూ, విష్ణువుకూ కూడా భాగం ఉన్నందుకు మునులు కూడా భయపడ్డారు. జరిగినదానికి పశ్చాత్తాప పడుతూ మునులు తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు.

తన కొడుకు మరొకడు పోయినందుకు త్వష్ట విచారపడి, కొడుక్కు ఉత్తర క్రియలు జరిపి, మోసంతో వృత్రుణ్ణి చంపినందుకు ఇంద్రుణ్ణి కష్టాలపాలు కమ్మని శపించాడు.

పాపం కట్టి కుడుపుతుంది. వృత్రుణ్ణి చంపిన అనంతరం ఇంద్రుడి తేజస్సు తగ్గిపోయింది. ''ఇంద్రుడు కృతఘ్నుడు," అంటూ దేవతలు వెటకారంగా మాట్లాడ సాగారు. ప్రమాణాలన్నిటినీ గాలికి వదిలి, మిత్రఘాతకుడు కావటంలో ఇంద్రుడికి



సమమైనవాడు మూడు లోకాలలోనూ లేడని చెప్పుకున్నారు. మనుషులలో కూడా ఇంద్రుడికి అపఖ్యాతి వచ్చింది.

ఇంద్రుడు సభలో తన ముఖం చూపలేక, కుములుతూ ఇంట్లో కూర్చున్నప్పుడు, అతని భార్య అతనితో, ''శత్రువు భయం తీరి కూడా సుఖంగా లేవెందుచేత? అలాటి శత్రువు మరెవ్వడూ లేడు గదా?'' అని అడిగింది.

ఇంద్రుడు శచితో, ''నాకిప్పుడు పట్టుకున్నది శత్రుభయం కాదు, బ్రహ్మహత్యాభయం! నందనవనమూ, అమృతమూ, గంధర్వగానమూ, అప్సరల నృత్యాలూ, నువ్వూ, ఇతర స్త్రీలూ, కామధేనువూ, కల్పవృక్షమూ, ఏదీ నాకిప్పుడు సుఖం కలిగించదు!'' అన్నాడు.

ఇలా అని ఇంద్రుడు మానససరస్సు వద్దకు పోయి, ఎవరికీ కనబడకుండా ఒక తామరతూడులో ప్రవేశించి, నీటిపాములాగా నీటిలో సంచరించసాగాడు.

ప్రపంచం అరాజకమయింది. ఆ స్థితి నివారించటానికి దేవతలూ, మునులూ కలిసి ఆలోచించి, ఇంద్రపదవికి నహుషుణ్ణి తెచ్చారు. స్వతహాగా మహాధర్మాత్ముడైనా, అధికారమదం తలకెక్కి నహుషుడు స్త్రీలోలుడైపోయాడు. శచీదేవి చాలా అందగత్తె అని అతనికి తెలిసింది. అతను ఋషులను పిలిచి, ''ఇప్పుడు నేను దేవతల రాజును గదా! నన్ను కొలవటానికి ఇంద్రుడి భార్య రాదేం? ఆమెను పిలిపించండి,'' అన్నాడు.

ఈ మాటకు కలవరపడి, ఋషులు వెళ్ళి శచీదేవితో నహుషుడి మాటలు చెప్పారు. ఆమె బృహస్పతితో తనను నహుషుడి నుంచి కాపాడమన్నది. బృహస్పతి ఆమెకు అభయం ఇచ్చాడు. కాని మునులు ఆమెను ఇంద్రుడి వద్దకు తీసుకుపోకుండా ఉండటానికి భయపడ్డారు. బృహస్పతి ఆమెకు ఒక ఆలోచన చెప్పి, ఆమెను మునుల వెంట నహుషుడి వద్దకు పంపాడు.

శచి నహుషుడితో, ''నా భర్త జాడ తెలిస్తేగాని నేను నీకు భార్యను కాలేను. ఆయన సంగతి తెలిసినదాకా ఆగు,'' అన్నది.

నహుషుడు సరేనన్నాడు. ఆమె తరఫున దేవతలు విష్ణుమూర్తి వద్దకు పోయి, ఇంద్రుడు ఎక్కడ ఉన్నాడని అడిగారు.

''మీరు అశ్వమేధయాగం చేసి జగదంబను తృప్తిపరచినట్టయితే, ఇంద్రుడు తిరిగి మీకు రాజవుతాడు. శచి తన భర్తను తిరిగి పొందుతుంది,'' అన్నాడు విష్ణువు.

దేవతలు ఇంద్రుడి జాడ తెలుసుకుని, అతనిచేత అశ్వమేధం చేయించారు. అయినా అతను తిరిగి రాకపోవటానికి శచి విచారించి, బృహస్పతిని కారణం అడిగింది. ఆయన ఆమెను దేవిని ఆరాధించమన్నాడు. ఆమె అలాగే చేసింది. దేవి ప్రత్యక్షమై, తన మాయచేత నహుషుడు చావబోతున్నాడని చెప్పి, శచి ఇంద్రుడి వద్దకు వెళ్ళే ఏర్పాటు చేసింది.

శచి ఇంద్రుణ్ణి చేరి జరిగినదంతా చెప్పి, నహుషుడు తనను కోరుతున్నట్టు తెలిపింది. ఇంద్రుడు, ''ఋషులు మోసే వాహనంలో నహుషుణ్ణి నీ వద్దకు రమ్మను. ఆ సమయంలో, ఆ కామాంధుడు ఋషుల శాపానికి గురి అవుతాడు,'' అని శచికి సలహా ఇచ్చాడు.

ఆ ఎత్తు పారింది. శచీదేవిని తన భార్యను చేసుకునేటందుకు, తన వాహనాన్ని సప్తర్షులు మోయాలనీ, ఇతర ఋషులు వెంట రావాలనీ నహుషుడు కోరాడు. వాళ్ళు అందుకు కూడా ఒప్పుకున్నారు. అయితే వాళ్ళు వేగంగా నడవటంలేదని, ''సర్ప, సర్ప!'' అంటూ అగస్త్యుణ్ణి కాలితో తన్నాడు.

అగస్త్యుడు అతన్ని, ''నువే సర్పంకా!'' అని శపించాడు. ఆ శాపంతో నహుషుడు పాము రూపం పొంది, స్వర్గం నుంచి భూమి మీద పడ్డాడు.

ఈ విధంగా ఇంద్రుడు తిరిగి స్వర్గాధిపతి అయాడు.





# దేవీ భాగవతం

సూర్యవంశంలో రాముడికి పూర్వం చాలా కాలం క్రితం త్రిశంకుడు అనే రాజు ఉండేవాడు. ఈ త్రిశంకుణ్ణే విశ్వామిత్రుడు బొందితో స్వర్గానికి పంపుతానని చెప్పి పంపలేక, అతని కోసం త్రిశంకు స్వర్గం ఒకటి సృష్టించాడు.

ఈ త్రిశంకుడికి హరిశ్చంద్రుడు అనే కొడుకు ఉండేవాడు. అతనికి సంతానం లేకపోవటంచేత, తనకు పిల్లలు కలిగితే వరుణుడికి నరబలి ఇస్తానన్నాడు. తరవాత అతని భార్య గర్భవతి అయి, ఒక కొడుకును కన్నది. హరిశ్చంద్రుడు గొప్పగా బారసాల చేసి, దానాలు చేశాడు.

అ సందర్భంలో బ్రాహ్మణుడి రూపంలో వరుణుడు వచ్చాడు. అతను కూడా దానాలు పుచ్చుకుని, "నీ కొడుకును నాకు బలిపెట్టి, అన్నమాట నిలుపుకో." అన్నాడు.

''మహాత్మా, నా భార్యకు నెలదాకా పురిటిమైల పోదు గదా, అంతదాకా ఆగు.'' అన్నాడు హరిశ్చంద్రుడు.

వరుణుడు సరే నని వెళ్ళిపోయి, నెల కాగానే మళ్ళీ వచ్చాడు. హరిశ్చంద్రుడు అతనికి అతిథిసత్కారాలు చేసి, ''తమరు వచ్చిన పని ఏమిటి?'' అని అడిగాడు. వరుణుడు చెప్పాడు.

''ఇంత పసిగుడ్డు యజ్ఞపశువుగా పనికి రాదు గదా! వాడికి ఉపనయనసంస్కారం అయినదాకా ఆగండి,'' అన్నాడు హరిశ్చంద్రుడు.

**19. హరిశ్చంద్రుడి కథ**



కొండగుహలో దాక్కున్నాడు. వాడికి నాలుగుకాలాలపాటు బతకాలని ఉన్నది!

ఇంతలో వరుణుడు వచ్చి నరమేధం చెయ్యమని కూర్చున్నాడు.

"అయ్యో, బాబూ! నా కొడుకు ఎటో పారిపోయాడు. నేనేంచేతును?" అన్నాడు హరిశ్చంద్రుడు దీనంగా.

"అబద్ధమాడి నన్ను మోసగించి నందుకు నీకు జలోదరం అనే వ్యాధి కలుగుగాక!" అని వరుణుడు హరిశ్చంద్రుణ్ణి శపించాడు.

శాపం తగిలి, హరిశ్చంద్రుడు ఒకవంక వ్యాధితో బాధపడుతూ, మరొకవంక కొడుకు కోసం తపించసాగాడు.

వరుణుడు కోపంతో, "కొడుకు మీది ప్రేమతో ఇలా అంటున్నావు. నేను తెలుసుకోలేనా? అయినప్పటికీ ఈసారికి నీ మాట ప్రకారం వెళ్ళిపోయి, నీ కొడుకు ఉపనయన సంస్కారం జరిగినాక మళ్ళీ వస్తాను. అప్పుడు మరొకసారి మాట తప్పావో, నిన్ను శపించి తీరుతాను," అని వెళ్ళిపోయాడు.

తరవాత హరిశ్చంద్రుడు తన కొడుక్కు లోహితాక్షుడు అని నామకరణం చేసి, చక్కగా చదివించాడు.

తాను బలిపశువుగా చావవలసి ఉన్న దని ఎరిగి, ఆ కుర్రవాడు, ఇంటి నుంచి పారిపోయి, ఎవరికీ కనపడకుండా ఒక

ఈ పరిస్థితిలో, రహస్యంగా గుహలో జీవిస్తున్న లోహితాక్షుడికి బాటసారి ఒకడు కనిపించి, "నీ కోసం నీ తండ్రి విలవిల లాడిపోతూంటే, నీ లాగా పట్టించుకోని కొడుకు ఎక్కడైనా ఉంటాడా?" అన్నాడు.

ఇంతమాట అనిపించుకుని లోహితాక్షుడు తన తండ్రిని చూడటానికి బయలు దేరుదా మనుకుంటూండగా, ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో వచ్చి, ఎంతో జాలి ఉట్టిపడేలాగా వాడితో, "ఎందుకు వెళ్ళి నిష్కారణంగా చస్తావు? నా మాట విను. నీ తండ్రి రోగ బాధ నుంచి విముక్తి పొందటానికి నిన్ను వరుణుడికి బలి ఇయ్య

బోతున్నాడు! అలా ఇస్తానని నువు పుట్టక ముందే వరుణుడికి మాట ఇచ్చాడు," అని, వాడి మనసు మార్చేశాడు.

ఇలా ఒకసారి కాదు, అనేకసార్లు జరిగింది: తన తండ్రి వ్యాధిపీడ అనుభవిస్తున్నాడని విని లోహితాక్షుడు ఇంటికి బయలుదేరబోవటమూ, ఇంద్రుడు అతని నిర్ణయాన్ని పడగొట్టటమూనూ!



ఒకనాడు హరిశ్చంద్రుడు తన కుల గురువైన వసిష్ఠుడితో, "ఈ జలోదరంతో బాధపడుతున్న నన్ను ఎలాగైనా కాపాడు!" అన్నాడు.

దానికి వసిష్ఠుడు, "ఇందుకు ఒకటే ఉపాయం ఉన్నది. కొడుకులలో పదమూడు రకాలవాళ్ళున్నారు. అందులో క్రీతుడు (డబ్బు ఇచ్చి కొనుక్కున్నవాడు) ఒకడు. కనక, ఎవరి కొడుకునైనా కొని, వాణ్ణి బలిపశువుగా పెట్టి యజ్ఞం చేసి, ఈ వ్యాధి నుంచి బయటపడు," అన్నాడు.

ఆ మాట మీద హరిశ్చంద్రుడు తన మంత్రులతో, "ఎవరన్నా బ్రాహ్మణుడు తన కొడుకును అమ్మేటట్టుంటే, అతడికి ధనాశ ఎంత ఉన్నా సరే తృప్తిపరచి, కుర్రవాణ్ణి కొనుక్కురండి," అన్నాడు.

వాళ్ళు అనేక గ్రామాలు గాలించి, చివరకు అజీగర్తుడు అనే కటిక దరిద్రుడైన బ్రాహ్మణుడి కొడుకులలో మధ్యవాణ్ణి, శునశ్శేఫుడు అనే వాణ్ణి; బ్రాహ్మణుడు అడిగిన ధనం ఇచ్చి కొన్నారు.

నరబలికి మనిషి దొరికినందుకు సంతోషించి, హరిశ్చంద్రుడు యజ్ఞసంభారాలు సమకూర్చుకుని, ఋత్విక్కులను నియమించి, యజ్ఞం ప్రారంభించాడు. శునశ్శేఫుణ్ణి యూపస్తంభానికి కట్టారు. వాడు పెద్దపెట్టున ఏడుస్తూ ఉంటే, విశ్వామిత్రుడికి వాడిమీద జాలికలిగింది. ఆయన హరిశ్చంద్రుడితో ఇలా అన్నాడు:

"రాజా, ఈ బ్రాహ్మణ బాలుణ్ణి ఎందుకు చంపుతావు? విడిచిపెట్టు. వాడు ఏడుస్తూంటే నా గుండె నీరయిపోతున్నది. పూర్వం మీ వంశపు రాజులు ఇతరుల



కోసం తమ ప్రాణాలు ధారపోశారు. నీ రోగం నయం చేసుకునేటందుకు ఇలాటి పని చేస్తావా? నీ బాధ నేను నివారణ చేస్తాను. ఈ కుర్రవాణ్ణి విడిచి పెట్టు. ఎంత పాపిష్టివాడివి కాకపోతే ఈ కుర్రవాణ్ణి చంపబోతావు?'' అన్నాడు.

ఈ విధంగా విశ్వామిత్రుడు ఎంత చెప్పినా హరిశ్చంద్రుడు శునశ్శేపుణ్ణి విడిచిపెట్టటానికి ఒప్పుకోలేదు. అప్పుడు విశ్వామిత్రుడు శునశ్శేపుడికి వరుణదేవుడికి ప్రీతి కలిగించే మంత్రం ఉపదేశించాడు.

శునశ్శేపుడు ఆ మంత్రాన్ని జపించే సరికి వరుణుడు పరమసంతోషంతో అతి వేగంగా వచ్చి, కుర్రవాణ్ణి విడిపించి, హరిశ్చంద్రుడికి వ్యాధిబాధ లేకుండా చేసి, వెళ్ళిపోయాడు.

ఈ విధంగా శునశ్శేపుడు బతికి బయటపడటానికి విశ్వామిత్రుడు సహాయపడ్డాడు. కాని హరిశ్చంద్రుడు తన మాట వినలేదన్న సంగతి మనసులో ఉంచుకున్నాడు.

ఇంతలో ఒకనాడు హరిశ్చంద్రుడు కౌశికనదీ తీరాన వేటకు వెళ్ళి, ఒక అడవిపందిని తరుముతూండగా, మధ్యాన్నం వేళ, విశ్వామిత్రుడు ఒక ముసలి బ్రాహ్మణుడి రూపంలో అక్కడికి వచ్చి, హరిశ్చంద్రుణ్ణి మోసం చేసి, అతని రాజ్యంతో బాటు సర్వస్వమూ కాజేశాడు.

తరవాత వసిష్ఠుడు విశ్వామిత్రుణ్ణి యాదృచ్ఛికంగా కలుసుకుని, ''నువు ఎంత నీతిమాలినవాడివి! నా యజమాని అయిన హరిశ్చంద్రుణ్ణి నిష్కారణంగా మోసపుచ్చి అడవులపాలు చేశావు గదా! నువు తాపసులలో అధముడివి! నీ తపస్సు బకధ్యానం! నువు కొంగవైపో!'' అని శపించాడు.

ఇందుకు విశ్వామిత్రుడు మండిపడి, ''సరే, నేను ఎంతకాలం కొంగగా ఉంటానో నువు అంతకాలమూ

కొక్కెరగా ఉండు!'' అని వసిష్ఠుడికి ప్రతిశాపమిచ్చాడు.

అదిమొదలు ఇద్దరూ పక్షిరూపాలు ధరించి, మానసతీర్థం గట్టున ఉండే చెట్ల మీద నివసిస్తూ, రోజూ హెూరాహెూరి పోట్లాడుకుంటూ, ఒకరి నెత్తురు ఒకరు కళ్ళజూస్తూ వచ్చారు. ఎంత మహర్షులైనా, అహంకారం చావదు గదా!



వసిష్ఠ విశ్వామిత్రులు రోజూ పక్షుల రూపంలో పరస్పరం హింసించుకొంటూంటే, బ్రహ్మ వచ్చి ఇద్దరి శాపాలూ, తీర్చి, వాళ్ళను తమ తమ ఆశ్రమాలకు పంపాడు. అయినా వసిష్ఠుడు నిమిని శపించి, నిమి చేత మళ్ళీ ప్రతిశాపం పొందాడు. అది ఇలా జరిగింది:

ఇక్ష్వాకుడి కొడుకైన నిమి ధర్మాత్ముడూ, సద్వర్తనం గలవాడూనూ. అతను బ్రాహ్మణుల కోసం, గౌతమాశ్రమానికి సమీపంగా, అన్ని సౌకర్యాలూ కలిగిన జయంతుపురం అనేదాన్ని నిర్మించాడు.

తరవాత కొంతకాలానికి నిమికి దీర్ఘకాల యాగం చెయ్యాలన్న కోరిక కలిగింది. అతను తన తండ్రి అనుమతిపొంది, మహామునులు చెప్పిన ప్రకారం సంభారాలు సమకూర్చుకుని, భృగువూ, అంగిరసుడూ, గౌతముడూ, పులస్త్యుడూ, ఋచీకుడూ, పులహుడూ లాటి యజ్ఞనిపుణులను ఆహ్వానించి, తన కులగురువైన వసిష్ఠుడితో, "మహాదేవిని గురించి అయిదు వేల ఏళ్ళ యజ్ఞం చేయ నిశ్చయించి, సంభారాలు సమకూర్చాను. నా చేత యజ్ఞం చేయించు,'' అన్నాడు.

దానికి వసిష్ఠుడు, ''ఇంద్రుడు కూడా జగదంబ యజ్ఞం తనచేత చేయించమని నన్ను అడిగాడు. అది అయిదువందల ఏళ్ళలోనే పూర్తి అవుతుంది. అది పూర్తి చేసి వచ్చి, నీ చేత యజ్ఞం చేయిస్తాను. అంతదాకా ఓపికపట్టు,'' అని నిమితో అన్నాడు.

''మునులనందరినీ పిలిచాను. సంభారాలు సిద్ధం చేయించాను. మా సూర్య



వంశానికి పురోహితుడివై ఉండి, ఇలా అనటం భావ్యమా? ధనలోభం కొద్దీ నన్ను ఇలా మోసం చేస్తావా?'' అని నిమి అడిగాడు.

అయినా వసిష్ఠుడు వినిపించుకోకుండా, ఇంద్రుడి చేత యజ్ఞం చేయించటానికి వెళ్ళిపోయాడు. అప్పుడు నిమి గౌతముణ్ణి ఋత్విజుణ్ణిగా పెట్టుకుని, అంబ గురించి విజయవంతంగా యజ్ఞం చేసి, అందరికీ ఘనంగా దక్షిణ లిచ్చాడు.

ఈలోపలనే వసిష్ఠుడు ఇంద్రుడి చేత యజ్ఞం చేయించి, పుష్కలంగా దక్షిణ తీసుకుని, యజ్ఞదీక్షలో ఉన్న నిమిని చూడ వచ్చాడు. కాని నిమి ఆ సమయంలో నిద్ర పోతూ ఉండటంచేత వసిష్ఠుడికి నిమి దర్శనం కలగలేదు.

వసిష్ఠుడు మండిపడి, ''కులగురువునైన నన్ను కాదని, నా పదవి మరెవరికో నిర్లక్ష్యంగా ఇచ్చి, యజ్ఞం చేయించుకోవటంతో పోనియ్యక, నేను నిన్ను చూడ వస్తే అవమానిస్తావా? నీ దేహం నేలబడు గాక! నువు విదేహుడవై పోవుదువుగాక! ఇదే నీకు నా శాపం!'' అన్నాడు.

ఈ శాపం విని కంగారుపడి నిమిని అతని సేవకులు నిద్రలేపి, వసిష్ఠుడి శాపం గురించి చెప్పారు. నిమి పచ్చి వసిష్ఠుడితో, ''బ్రహ్మదేవుడికి దగ్గిర బంధువువై ఉండి, పాపభీతి లేకుండా నన్ను నిష్కారణంగా శపించావు! ధనలోభంతో నీ శిష్యుడినైన నన్ను వదిలేసి వెళ్ళిపోయావు. ధనం నీకు సిగ్గు కూడా లేకుండా చేసింది! నువు చేసిన తప్పు నాకు అంటగట్టి నన్ను శపించావు. ఇంత క్రోధం గల నీ శరీరానికి కూడా నా శరీరానికి పట్టే గతే పట్టుగాక!'' అని ప్రతిశాపమిచ్చాడు.

ఇలా ఇద్దరూ ఒకరి నొకరు శపించుకున్న అనంతరం వసిష్ఠుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి, ''నిమి అనే రాజు నా శరీరం పడిపోవాలని శపించాడు. మరొక దేహంలో నా జ్ఞానం నిలిచి ఉండే దారి చెప్పు, మహాత్మా!'' అన్నాడు.

దానికి బ్రహ్మ, "మిత్రావరుణ దేహాంశ గలవాడివై, జ్ఞానం దక్కించుకో," అన్నాడు.

వసిష్ఠుడు బ్రహ్మకు నమస్కరించి, వెంటనే వరుణ లోకానికి వెళ్ళి, తన శరీరాన్ని అక్కడ వదిలేసి, తన ప్రాణాన్ని మిత్రావరుణుల యందు ప్రవేశపెట్టాడు.

కొంతకాలం గడిచినాక అక్కడికి ఊర్వశి వచ్చింది. మిత్రావరుణులు ఆమెను మోహించి, ఆమెతో కొంతకాలం సంసారం చేశారు. దాని ఫలితంగా వారికి ఊర్వశి యందు అగస్త్యుడూ, వసిష్ఠుడూ పుట్టారు. అగస్త్యుడు పుట్టుతూనే తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోయాడు.

వసిష్ఠుణ్ణి ఇక్ష్వాకుడు తన గురువుగా పెట్టుకున్నాడు.

అక్కడ నిమి కూడా కొస ప్రాణాలతో యజ్ఞం పూర్తి చేశాడు. యజ్ఞభోక్తలు అతని వద్దకు వచ్చి, "రాజా, నీ యజ్ఞం మాకు చాలా తృప్తి కలిగించింది. నీ కోరిక చెప్పు. తీర్చుతాం. నీకు నరదేహం కావాలా? సురదేహం కావాలా?" అని అడిగారు.

"మహాత్ములారా, శరీరం ఉన్నంత కాలమూ దానికి అపాయం ఉండనే ఉంటుంది. నాకు ఏ శరీరమూ వద్దు. వాయురూపం అనుగ్రహించండి," అన్నాడు నిమి.

"రాజా, నీ కోరికను జగదంబ తీర్చగలదు." అని దేవతలు నిమికి చెప్పారు.

నిమి ప్రార్థించగా, దేవి ప్రత్యక్షమై, "సమస్త భూతాల కళ్ళయందూ నీకు నివాసం కలిగిస్తాను. నీ మూలంగా ప్రాణులకు నిమిషం (రెప్పపాటు) కలుగుతుంది," అన్నది.

తరవాత మునులు నిమి దేహాన్ని మథించి, దాని నుంచి జనకుణ్ణి పుట్టించారు. జనకుడు విదేహుడైన నిమి కొడుకు గనక అతను విదేహుడని పేరు తెచ్చుకుని, మిథిల రాజధానిగా గంగాతీరాన రాజ్యం చేశాడు. ఆ రాజ్యం పేరే విదేహ అయింది.





# దేవీ భాగవతం

హైహయ వంశంలో పుట్టిన ప్రఖ్యాతుడు కార్తవీర్యుడు సాటిలేని శౌర్యపరాక్రమాలు గలవాడు, వెయ్యి చేతులవాడు, అంతులేని యజ్ఞాలు చేసి, చేతికి ఎముకలేకుండా దానాలూ, దక్షిణలూ ఇచ్చాడు. అతని గురువు దత్తాత్రేయుడు. అతని పురోహితులు భృగువులు. అందుచేత కార్తవీర్యుడు చేసిన యజ్ఞాలలో దక్షిణలు పుచ్చుకుని భృగులు అపార ధనవంతులయారు.

కార్తవీర్యుడు చనిపోయినాక అతని సంతతికి చెందిన హైహయులు దరిద్రులైపోయి, తమ గురువులైన భృగులను యాచించారు. కాని భృగులు హైహయులకు తమ ధనం ఇయ్యటం ఇష్టంలేక అక్కడా, అక్కడా పాతిపెట్టి, రాజుల భయంతో కొండగుహలకు పారిపోయి, దాక్కున్నారు.

హైహయులు వచ్చి వెతికితే బ్రాహ్మణుల ఇళ్లన్నీ నిర్జనంగా ఉన్నాయి. వాళ్ల ఇళ్లు తవ్వితే అంతులేని ధనం బయటపడింది. కోపం పట్టలేక, హైహయులు కొండల్లో దాగిన వారినందరినీ చంపారు. గర్భవతులుగా ఉన్న స్త్రీల గర్భాలను ఆయుధాలతో పొడిచారు.

ఈ దారుణ హింసాకాండ చూడలేక, ఆ ప్రాంతాల తీర్థాలలో ఉంటున్న మునులు హైహయులతో, "ఈ దుర్మార్గం కట్టిపెట్టండి. బ్రాహ్మణజాతిని ఈ విధంగా నిర్మూలించవచ్చునా? ఆడవాళ్ల గర్భాలు

**20. లక్ష్మీదేవికి శాపం**



కూడా ఛేదిస్తారా? ఇవి రాజులు చేసే పనులేనా? ఇంత పాపానికి ప్రతిఫలం ఉండదా?'' అని, మందలించారు.

దానికి హైహయులు, ''మీరు చాలా మహాత్ములు. కాని వీళ్ళు మా పూర్వుల దగ్గిర అంతులేని ధనం పుచ్చుకుని, దాచుకున్న దొంగలు! దొంగలను చంపటం పాపమా? అప్పు ఇయ్యరట! కార్తవీర్యుడు వీళ్ళకు డబ్బిచ్చింది పాతిపెట్టటానికా? ఇలాటి వాళ్ళను మీరు మెచ్చుతారా? చెప్పండి! యజ్ఞాలు చేయించి సంపాదించిన డబ్బును బ్రాహ్మణుడు తాను అనుభవించాలి, కటిక పేదలకు ఇయ్యాలి. లేకపోతే ధనం రాజులపాలో, దొంగలపాలో, అగ్గిపాలో అవుతుంది. అలా కాక, ధనం దాచిపెట్టినవాడు, తాను తిన్నవాడూ, ఇతరులకు పెట్టినవాడూ కాక పోవటమే గాక, చచ్చి నరకానికి పోతాడు. మేం మా పురోహితులైన ఈ భృగులను అప్పు అడిగాం. మా వృద్ధికోసమని అడిగితే ఇయ్యరు! ఇలాటి నీచులను మా వంటి రాజులు దండించటం తప్పా? అందుచేత మేం చేసే ఈ పనిని మీరు క్షమించాలి,'' అని మునుల చేత ఔననిపించి, భృగు స్త్రీల గర్భాలు నాశనం చెయ్యసాగారు.

ఆ స్త్రీలందరూ హడలిపోయి హిమవత్పర్వతానికి పారిపోయారు. ధనలోభంతో బ్రాహ్మణులు చచ్చారు. ధనలోభం ఎంతటి పనులనైనా చేయిస్తుంది. దాన్ని మించిన శత్రువు లేదు. కామక్రోధాహంకారాలను మించినది లోభం. లోభి ప్రాణాలైనా విడవటానికి సిద్ధపడతాడంటే, వాడు చేయరానిదంటూ ఏముంటుంది?

హిమాలయానికి పారిపోయిన భృగు స్త్రీలు మట్టితో గౌరీవిగ్రహం తయారుచేసి, నది ఒడ్డున ప్రతిష్ఠించి, దాన్ని పూజిస్తూ చావు కోసం ఎదురుచూడసాగారు.

ఇలా ఉండగా ఒక రాత్రి వాళ్ళకు దేవి అందమైన అవతారంలో కలలో కనబడి, ''మీలో ఒకతెకు తొడ నుంచి కొడుకు పుట్టుతాడు. నా అంశన పుట్టి, వాడు

మిమ్మల్ని కాపాడుతాడు,'' అని చెప్పింది. నిద్రలేచి ఆ స్త్రీలు ఎంతో ఆనందించారు.

వారిలో ఒకతె తన తొడలో గర్భం ధరించి ఉన్నది. ఆమె తొడ నుంచి పుత్రుడు వెలువడ్డాడు. వాడు సూర్యుడి లాగా వెలిగిపోతున్నాడు. ఆ స్త్రీలను వెతుక్కుంటూ వచ్చిన క్షత్రియులు ఆ పిల్ల వాణ్ణి చూడగానే వాళ్ళ కళ్ళు పోయాయి.

ఇదంతా బ్రాహ్మణ ప్రభావం కాబోలు నని భయపడుతూ హైహయులు ఆ స్త్రీని చేరి, ఆమె శరణు వేడుతూ, ''అమ్మా, నిన్ను చూస్తూనే మేం కాస్తా గుడ్డివాళ్ళమై పోయాం, నీ మహిమ ఏమిటో గాని! మమ్మల్ని అనుగ్రహించి, మాకు తిరిగి కళ్ళు తెప్పించు. గుడ్డి కన్న చావు మేలు గదా! ఇంకెన్నడూ దుర్మార్గాలు చెయ్యక, భృగువంశం వారికి విధేయులమై ఉంటాం. బుద్ధితక్కువగా మేం చేసిన తప్పులు క్షమించి, మాకు నేత్రదానం చెయ్యి. నువ్వూ, నీ కొడుకూ సుఖంగా ఉండగలరు,'' అన్నారు.

ఆ బ్రాహ్మణ స్త్రీ వారి మాటలకు ఆశ్చర్యపోతూ, ''మీ కళ్ళు ఎందుకు పోయాయో నాకు తెలీదు. నాకు మీ మీద ఏమీ కోపం లేదు. మిమ్మల్ని ఇలా చేసినది నా కొడుకు. మీరు దుర్మార్గులు! డబ్బు కోసం హత్యాకాండ సాగిస్తే ఊరికే పోతుందా? గర్భంలో ఉన్న పిండాలనూ, శిశువులనూ, వృద్ధులనూ విచక్షణ లేకుండా చంపారే! మిమ్మల్ని అణచ





టానికి వీడు పుట్టాడు. జగదంబ దయ వల్ల వీడు నా తొడ నుంచి పుట్టాడు. తన తండ్రులు చచ్చినందుకు చాలా కోపంలో ఉన్నాడు. వీణ్ణి వేడుకుని, శాంతింప జేయండి, మీకు కళ్ళు తిరిగి వస్తాయి,'' అన్నది.

తొడ (ఊరువు) నుంచి పుట్టిన కారణంగా ఆ కుర్రవాడికి ఔర్వుడని పేరు వచ్చింది. హైహయులు వాణ్ణి ప్రార్థించారు. దానితో ఔర్వుడు శాంతించి, వారితో ఇలా అన్నాడు:

''దేవి నిర్ణయాలు ఎలా తప్పుతాయి? ఆమె ఇచ్ఛానుసారం జరిగిన వాటిని గురించి జ్ఞాని అయినవాడు విచారించడు. ఇకనుంచీ ఋషుల సుఖానికి భంగం కలగకుండా చూడండి. వెళ్ళిరండి.''

హైహయులకు దృష్టి తిరిగి వచ్చింది. ఔర్వుణ్ణి తల్లి ఆశ్రమంలో తగిన విధంగా పెంచుతూ వచ్చింది.

భరతవంశానికి భరతుడు మూల పురుషుడు. యాదవవంశానికి యదువు మూలపురుషుడు. హైహయవంశం ఎలా ఏర్పడింది? దీనికి ఒక కథ ఉన్నది.

సూర్యుడి కొడుకైన రేవంతుడు అనే వాడు ఉచ్చైఃశ్రవం అనే గుర్రాన్ని ఎక్కి, విష్ణువును చూడగోరి వైకుంఠానికి వెళ్లాడు. లక్ష్మి తన అన్న అయిన (తనతోబాటు సముద్ర మథన మప్పుడు పుట్టిన) ఉచ్చైఃశ్రవాన్నీ, దాని మీద ఉన్న అందగాణ్ణీ సమ్మోహితురాలై చూడసాగింది.

''మూడు లోకాలలోనూ సాటిలేని అందగాడు! ఆ గుర్రం ఎక్కి వస్తున్న వాణ్ణి ఎరుగుదువా?'' అని విష్ణువు లక్ష్మిని అడిగాడు.

కాని రేవంతుడి అందంతో సమ్మోహితురాలై ఉన్న లక్ష్మికి తన భర్త అడిగినది వినిపించలేదు. విష్ణువు ఆమె స్థితి గ్రహించి, కోపావేశంతో ఇలా అన్నాడు:

''ఏమిటి అలా చూస్తావు? ఆ గుర్రాన్ని చూసి నీ మనస్సు వివశమైపోయింది. రతివీ, రమవూ అనిపించుకుంటూ.

చంచలస్వభావంతో అపకీర్తి పాలైపో! భూలోకంలో ఆడగుర్రానివై పుట్టు!''

ఈ శాపానికి లక్ష్మి బెదిరిపోయి, ఏడుస్తూ విష్ణువు కాళ్ళమీద పడి, ''నన్ను నిర్దయగా ఇలా శపించుతావా? ఈ కాస్త భాగ్యానికి నా మీద నీకు సహజంగా ఉండే ప్రేమ పోయిందా? కోపమనేది ఎన్నడూ ఎరగని, వెన్నలాటి నీ స్వభావం ఇంతలో ఇలా మారిందా? నిన్ను విడవటం జరిగితే ఇప్పుడే ప్రాణాలు విడుస్తాను. దయచేసి శాపవిమోచనం చెప్పు.'' అన్నది.

విష్ణువు మనస్సు కరిగింది. అతను లక్ష్మితో, ''నీ గర్భాన నన్ను పోలిన కొడుకు పుట్టగానే నీకు శాపం తీరిపోతుంది. నావద్దకు తిరిగివస్తావు,'' అన్నాడు.

రేవంతుడు కూడా విష్ణువు కోపంగా ఉన్నట్టు గ్రహించి, చప్పున నమస్కారం చేసి, శలవు తీసుకుని, తన తండ్రి వద్దకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాడు.

లక్ష్మి కూడా తన భర్త వద్ద శలవు తీసుకుని, సువర్ణాక్ష మనే చోటికి చేరి, ఆడగుర్రం రూపంలో శివుణ్ణి గురించి తపస్సు చేయసాగింది.

ఆమె తపస్సుకు మెచ్చి, శివుడు పార్వతీ సహితంగా వృషభవాహనం మీద, ప్రమథులను వెంటబెట్టుకుని వచ్చి, ఇలా అన్నాడు:



''అమ్మా, నా కోసం ఎందుకు తపస్సు చేస్తున్నావు? ఏది ఇయ్యటానికైనా సమర్థుడు విష్ణువు గదా! వివేకంగల స్త్రీకి భర్త కన్న గొప్ప దైవం ఎక్కడన్నా ఉంటాడా? పోనీ నీ భర్త సామాన్యుడు కనకనా?''

''అదంతా నిజమే. కాని ఆ మొగుడే శాపం ఇచ్చాడు. దానికి నీ దయవల్ల విరుగుడు కలుగుతుందని నిన్ను గురించి తపస్సు చేశాను. కొడుకు పుట్టితే శాపం పోతుందట. ఎలా పుట్టుతాడు కొడుకు? దయచేసి చెప్పు. నా భర్త ఎక్కడో వైకుంఠంలో ఉన్నాడు. నేనేమో ఇక్కడ అరణ్యంలో ఉన్నాను. మాకు సంతానం



కలిగేది ఎలా? నా తపస్సుకు నువు నిజంగా తృప్తిపడితే నా కోరిక తీర్చు. నీకూ నా భర్తకూ తేడా ఏమీలేదు. నిన్ను కోరితే అతన్ని కోరినట్టే! అందుచేత నా భర్త ఎలాగైనా వచ్చి, నన్ను కలిసేటట్టు చెయ్యి.'' అన్నది ఆడగుర్రం రూపంలో ఉన్న లక్ష్మి.

దానికి శివుడు, ''విచారించకు. నీ భర్త గుర్రం రూపంలో నీ వద్దకు వస్తాడు. మీకు కొడుకు కలుగుతాడు. వాడు ప్రపంచాన్ని అంతనూ ఏలుతాడు. వాడికి ఏకవీరుడని పేరు వస్తుంది. వాడితో హైహయవంశం ఆరంభమవుతుంది. ఆ తరవాత నువూ, నీ భర్తా వైకుంఠానికి వెళ్ళి, సుఖంగా ఉండండి. నీకు ఇలా కష్టాలు కలగటానికి కారణం పరశక్తిని గుర్తించి, కొలవక పోవడమే.'' అని వెళ్ళిపోయాడు.

ఆయన కైలాసం చేరుతూనే చిత్రరూపుడు అనే ప్రమధుణ్ణి పిలిచి, ''నువు వైకుంఠానికి వెళ్ళి, విష్ణువుతో, నీ భార్య శోకం పోగొట్టమని స్నేహపూర్వకంగా చెప్పానని చెప్పు,'' అని పంపేశాడు.

చిత్రరూపుడు వైకుంఠానికి వెళ్ళి, విష్ణువు ఇంటి ద్వారపాలకులైన జయవిజయులతో తాను వచ్చినట్టు విష్ణువుకు చెప్పమన్నాడు.

జయుడు లోపలికి వెళ్ళి విష్ణువుతో, ''శివుడు పంపగా చిత్రరూపుడనే వాడు వచ్చాడు. వాణ్ణి లోపల ప్రవేశపెట్టవచ్చునా?'' అని చెప్పేసరికి, విష్ణువు వెంటనే ప్రవేశపెట్టమన్నాడు.

చిత్రరూపుడు లోపలికివచ్చి, విష్ణువుకు నమస్కరించి క్షేమసమాచారాలు అయినాక, ''దేవా, తమతో ఒక్క విషయం చెప్పటానికి వచ్చాను. శివుడు తమతో ఇలా చెప్పమన్నాడు: 'నీ భార్య లక్ష్మి గుర్రం రూపంలో కాళిందీ, తమసా నదుల సంగమం వద్ద ధ్యాననిష్ఠలో క్షేమంగా ఉన్నది. లక్ష్మిని దేవతలంతా పూజిస్తారు. ఆమె అనుగ్రహం పోగొట్టు

కుని ఏ మానవుడూ సుఖంగా ఉండలేడు. అలాటి భార్యను దూరం చేసుకుని నువ్వు మాత్రం ఏం సుఖంగా ఉండగలవు? మామూలు మనిషి కూడా భార్యను వదులుకోలేడు. అలాటప్పుడు నిష్కారణంగా నీ భార్యను నువ్వు ఎలా వదిలిపెట్టావు? నా మాట విని, వెంటనే వెళ్ళి ఆమెను ఓదార్చి, చేరదీసుకో. దక్షయజ్ఞంలో భార్యను పోగొట్టుకున్నప్పుడే నాకు భార్యావియోగం ఏమిటో తెలిసింది. అందుచేత ఎవరికి భార్యావియోగం కలిగినా నాకు కష్టంగా ఉంటుంది. భార్య నీకు దూరమై చాలా కాలమయింది. నువ్వు ఏం సుఖపడ్డావు? వెంటనే గుర్రం రూపంలో నీ భార్య ఉన్నచోటికి వెళ్ళు.'' అన్నాడు.

విష్ణువు ఈ సందేశం వింటూనే గుర్రం రూపంలో లక్ష్మి వద్దకు వెళ్ళాడు. ఇద్దరికీ కొడుకు కలిగాడు.

తరవాత విష్ణువు లక్ష్మితో, ''మనం వైకుంఠానికి తిరిగి పోదాం. ఈ కొడుకును ఇక్కడే విడిచిపెట్టుదాం. గుర్రం రూపం వదిలెయ్యి.'' అన్నాడు.

''ఏ స్త్రీ గాని తన గర్భాన పుట్టిన శిశువును అడవిపాలు చెయ్యటానికి ఒప్పుకుంటుందా? ఈ నదీతీరంలో ఈ బిడ్డను ఎవరు కాపాడుతారు?'' అని లక్ష్మి అంటూండగానే వారిద్దరికీ దివ్యశరీరాలు తిరిగి వచ్చాయి. వారి కోసం విమానం కూడా వచ్చింది.

లక్ష్మి తన కొడుకును ఎత్తుకుని, "వీడు అన్నివిధాలా నిన్ను పోలినవాడు. వీణ్ణి వదిలి పెట్టను. ముగ్గురమూ పోదాం.'' అన్నది.

''వీడి వల్ల ఒక కార్యం ఉన్నది. యయాతికి తుర్వసుడు అనే కొడుకు ఉన్నాడు. అతను పిల్లల కోసం తపస్సు చేస్తున్నాడు. అతను ఈ శిశువును పెంచుకునేటట్టు చూస్తాను. తుర్వసుడు ఇక్కడికి వచ్చేదాకా వీడికి ఏ భయమూ రాదు." అని విష్ణువు లక్ష్మికి నచ్చచెప్పి, ఆమెతో సహా వైకుంఠానికి వెళ్ళిపోయాడు.





# దేవీ భాగవతం

భర్త ఇచ్చిన శాపం వల్ల ఆడగుర్రమైన లక్ష్మి ఆ భర్తకే ఒక పిల్లవాణ్ణి కని, శాపంతీరి భర్తతో సహా వైకుంఠానికి తిరిగి పోతూ,, తన కొడుకును నదీతీరపు అరణ్యంలో వదిలిపెట్టి వెళ్ళిన కొద్ది సేపటికి, చంపకుడు అనే విద్యాధరుడు మదాలస అనే తన భార్యతో విమానంలో అటుగావచ్చి, అసాధారణమైన తేజస్సు గల ఆ శిశువును చూసి, విమానం నుంచి దిగి, ఆ పిల్లవాణ్ణి తీసుకుని మదాలసకు ఇచ్చాడు. మదాలస అమితానందంతో ఆ బిడ్డను తీసుకుని మూర్కొని, తన రొమ్ముకు గట్టిగా అదుముకుని, ఒడిలో పెట్టుకుని, తన భర్తతో, "ఎవరీ పిల్లవాడు? నీకు ఎలా దొరికాడు? వీణ్ణి ఎవరు కని, ఈ అడవిలో పారేసిపోయి ఉంటారు?" అన్నది.

"ఈ బిడ్డ ఎవరో ఇంద్రుణ్ణి అడిగి, ఆయన సరే నంటే పెంచుకుందాం," అంటూ చంపకుడు ఇంద్రుడి వద్దకు వెంటనే వెళ్ళాడు.

అతను ఇంద్రుడికి ఆ బిడ్డను చూపి, "ఈ బిడ్డ ఎవరో తెలీదు. తమసానదీ తీరానదొరికాడు. ఎవతో వీణ్ణి అప్రాంతంలో కని పారేసి పోయింది. నువు అనుమతిస్తే వీణ్ణి యింటికి తీసుకుపోయి పెంచుకుంటాను," అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు చంపకుడితో, "గుర్రాలరూపంలో ఉన్న లక్ష్మినారాయణులకు వీడు పుట్టాడు. హైహయుడు

21. హైహయుడి కథ




అనదగిన ఈ శిశువును విష్ణువు, యయాతి కొడుకు తుర్వసుడికి పెంపుడు ఇచ్చే ఉద్దేశంతో కన్నాడు. అందుచేత నువు ఈ పిల్లవాణ్ణి వెంటనే అక్కడ వదిలెయ్యి. విష్ణువు ప్రేరణతో తుర్వసుడు త్వరలోనే అటుగా వస్తాడు. ఏకవీరు డని వీడికి పేరు వస్తుంది,'' అన్నాడు.

ఆ మాట విని చంపకుడు ఆ పిల్లవాణ్ణి తీసుకుపోయి, ఎక్కడ దొరికాడో మళ్ళీ అక్కడే పెట్టేసి, తన దారిన తాను పోయాడు.

ఇంతలో విష్ణువు యయాతికొడుకుకు కనిపించాడు. ఎంతో పుణ్యాత్ములకు గాని కలగని విష్ణు దర్శనం తనకు కలిగినందుకు పరమానందం చెంది, తుర్వసుడు ఎంతో భక్తితో ఆ దేవుణ్ణి స్తోత్రం చేశాడు.

''నీ కోరిక ఏమిటి?'' అని విష్ణువు అతన్ని అడిగాడు.

''కొడుకు!'' అన్నాడు తుర్వసుడు.

''నీ కోసం లక్ష్మికి నేను ఒక కొడుకును కన్నాను. వాడు తమసా కాళిందీ సంగమం వద్ద ఉన్నాడు. వెళ్ళి తెచ్చుకో,'' అన్నాడు విష్ణువు.

తుర్వసుడు పరమానంద భరితుడై విష్ణువు చెప్పిన చోటికి వెళ్ళి, తన కాలి బొటనవేలు నోట పెట్టుకుని ఆడుకుంటున్న శిశువును చూసి, వాడి అందానికి ఆశ్చర్యపోతూ, వాణ్ణి చేతుల్లోకి తీసుకుని, ''నాయనా, అతికష్టమైన తపస్సు చేస్తే విష్ణుమూర్తి నిన్ను నాకు ఇచ్చాడురా! నా వంశం నిలబెట్టు!'' అంటూ ఆనందోత్సాహంతో మునిగి తేలుతూ, వెంటనే బయలుదేరి తన నగరానికి వెళ్ళాడు.

రాజభవనమంతా ఉత్సవాలతో నిండిపోయింది. హరివర్మ అనే మరో పేరు కూడా గల తుర్వసుడు బిడ్డను తన భార్యకు ఇచ్చి, ఆ బిడ్డ తనకు దొరికిన కథ అంతా ఆమెకు చెప్పాడు. పిల్లవాడికి ఏకవీరుడు అని నామకరణం చేశారు.

వాడు చక్కగా పెరిగి రాసాగాడు. వాడికి ఆరు నెలలు నిండగానే అన్నప్రాశనా, మూడేళ్ళకు పుట్టు వెంట్రుకలు తీయించటమూ చేశారు. పదకొండవ ఏట ఉపనయనం జరిగింది. వేదమూ, ధనుర్వేదమూ అభ్యసించాడు.

యుక్తవయసురాగానే ఏకవీరుడికి అతని తండ్రి వైభవంగా పట్టాభిషేకం జరిపించి, భార్యాసమేతంగా వానప్రస్థం వెళ్ళి, పార్వతిని గురించి తపస్సు చేశాడు. కాలక్రమాన భార్యాభర్త లిద్దరూ స్వర్గస్థులైనారు. ఈ వార్త తెలిసి ఏకవీరుడు తన తల్లిదండ్రులకు ఉత్తర క్రియలుచేసి, సుఖంగా రాజ్యం చేయసాగాడు.

ఒకసారి అతను కుటుంబపరివార సమేతంగా గంగా తీరానికి వెళ్ళాడు. అక్కడ ఋషుల ఆశ్రమాలు చక్కని చెట్లతో పక్షుల కలకలంతో ఎంతో మనోహరంగా ఉన్నాయి. అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ అతను నదీతీరం వెంబడి నడుస్తూ, ఒక చోట ఒంటరిగా ఉన్న ఒక స్త్రీని చూశాడు. ఆమె నదిలో ఉన్న ఒక నూరురేకుల పద్మానికి దక్షిణంగా ఉన్నది. అత్యంత సౌందర్యవతి అయిన ఆ స్త్రీ విచారంలో ఉన్నట్టు కనబడింది.



ఆమెను చూసి ఏకవీరుడు, "ఎందుకు విచారంగా ఉన్నావు? నువు మనుష్య స్త్రీవా? లేక దేవతాస్త్రీ వా? నీ పేరేమిటి? నీ తండ్రి ఎవరు? ఈ కారడవిలో నిన్నెవరు విడిచి పెట్టారు? నీ భర్త ఎవరు? నీ శోకానికి కారణం చెబితే దాన్ని నేను చక్క చేస్తాను—నీ దుఃఖానికి కారకులు మానవులైనా సరే, దానవులైనా సరే, దేవతలైనా సరే!" అన్నాడు.

దానికి ఆమె ఇలా అన్నది:

ఏదో ఒక ఆపద కలగకుండా ఎవరికి గాని దుఃఖం ఎందుకు సంప్రాప్తమవుతుంది? నీ దేశం కాని మరొక దేశానికి రభ్యుడనే వాడు రాజు. అతను గొప్ప



పుణ్యాత్ముడు. అతని భార్య రుక్మరేఖ. ఆమెకు సంతానం లేక పోయింది. ఆమె తన భర్తతో, పిల్లలు లేని జీవితం కన్న స్త్రీకి హైన్యంలేదు గదా అన్నది. భార్య ఇలా అనేసరికి, ఆ రాజు బ్రాహ్మణులను నియోగించి, సంతానం కోసం యజ్ఞం చేయించాడు. అప్పుడు అగ్నికుండం నుంచి బంగారు బొమ్మలాటి అమ్మాయి పుట్టుకొచ్చింది. యజ్ఞం చేయించిన హోత ఆమెను రాజుకు చూపి, 'ఈ పిల్ల ఏకావళి (ఒంటిపేట హారం) లాగా అగ్ని నుంచి పుట్టింది. ఏకావళి అని పేరు పెట్టుకుని, ఈమెను ఈ నాటినుంచి కొడుకులాగా పెంచుకో. ఈమె నీకు విష్ణువు ఇచ్చిన ప్రసాదం!' అన్నాడు.

రభ్యుడు ఎంతో సంతోషించి ఆ పిల్లను తన భార్య అయిన రుక్మరేఖకు అప్పగించాడు. ఆమె కూడా తాను స్వయంగా కొడుకును కన్నంతగా సంతోషించింది. ఆ పిల్ల కొడుకులాగే పెరుగుతూ వచ్చింది. ఆ రాజు యొక్క మంత్రికూతుర్ని నేను. నా పేరు యశోవతి. మే మిద్దరమూ ఒకే ఈడు వాళ్ళం. అందుచేత రాజు నన్ను తన కూతురికి ప్రియసఖిగా నియమించాడు. మేమిద్దరమూ ఎంతో సఖ్యంగా ఆడుకుంటూ ఉండేవాళ్ళం. రాజకుమార్తెకు పద్మాలంటే అమిత ఇష్టం. అందుచేత ఆమె రోజూ నన్నూ, ఇతర చెలికత్తెలనూ వెంట బెట్టుకుని, గంగా నదిలో పద్మాలుండే చోట జలక్రీడలాడటానికి వెళ్ళేది. అంత దూరం పోవద్దని నేను ఎంత చెప్పినా వినేదికాదు. అందుచేత నేను ఆమెకుగల ఈ అలవాటు గురించి ఆమె తండ్రికి చెప్పాను. అప్పుడు రభ్యమహారాజు తన నగరంలోనే అనేక పద్మాల కొలనులు నిర్మింపజేసి, తన కుమార్తెతో, 'అమ్మా, నీకు పద్మాల నీటిలో క్రీడించాలనిపిస్తే, వీటిలో జలకాలాడు. అంతేకాని ఇంకెక్కడికీ వెళ్ళకు,' అన్నాడు.

కాని ఆమె దూరప్రదేశాలకు వెళ్ళటం మానలేదు. అందుచేత రాజు ఆమె కోసం సాయుధభటుల రక్షణ ఏర్పాటు చేశాడు. ఆమె రోజూ తండ్రితో చెప్పి, నన్నూ, ఇతర చెలికత్తెలనూ వెంట బెట్టుకుని, గంగానదికి వస్తూండేది. ఇలా ఉండగా ఒకనాడు ఉదయం మేము మామూలు ప్రకారం ఇక్కడికి వచ్చాం. మా కన్న ముందే రతీదేవి, అప్సరసలతో వచ్చి, ఇక్కడ జలక్రీడలాడుతున్నది. నా సఖి వారితోకలిసి ఆడసాగింది.

ఇంతలో కాలకేతు డనే రాక్షసుడు రాక్షసపరివారంతో ఇటుగా వచ్చి, నా సఖి ఏకావళిని చూసి, ఆమెను ఎత్తుకుపోయే ఉద్దేశంతో సమీపించాడు. నేను అది చూసి, ఎవడో రాక్షసుడు వస్తున్నాడని గట్టిగా కేక పెట్టాను. అప్పుడు నా సఖి తిరిగి చూసి, రాక్షసుడికి భయపడి, పరిగెత్తుకుంటూ వచ్చి, మా అందరి చెలికత్తెల మధ్యా దాగింది. తరవాత కాలకేతుడు తన గదతో మా సాయుధ సైనికులందరినీ తరిమికొట్టి, జగన్మోహిని అయిన నా సఖిని తీసుకుపోసాగాడు. నా సఖి భయంతో ఏడవసాగింది. నేను చేసేది ఏమీ లేక, ఆ రాక్షసుడితో, 'ఆమెను వదిలిపెట్టు. కావాలంటే నన్ను తీసుకుపో,' అని ఎంతగానో వేడుకున్నాను. వాడు నా మాటలు వినిపించుకోక, ఆమెను తీసుకుని బయలుదేరాడు. నేను కూడా ఏడుస్తూ





వాడి వెంట వెళ్ళాను. నన్ను చూసి ఏకావళి కొంచెం స్వస్థురాలయింది. ఆమె నన్ను కౌగలించుకుని ఏడుస్తూండడం చూసి, కాలకేతుడు తన నగరం చూపించి, 'నా నగరం స్వర్గానికి తీసి పోదు. నీ సఖికి ధైర్యంకలిగేలాగ చెప్పు. నేను తనకు దాసుడుగా ఉంటాను. మీరు నిశ్చింతగా ఉండండి,' అని నాతో అని, నన్ను కూడా ఏకావళితోబాటు రథం మీద ఎక్కించుకుని, వేగంగా తన నగరానికి చేరాడు. అక్కడ ఒక తెల్లని ఇంట మా కిద్దరికీ బస ఏర్పాటయింది. దాని చుట్టూ విచ్చుకత్తులు పట్టిన రాక్షసులు కాపలా ఉన్నారు.

రాక్షసుడు మర్నాడు వచ్చి, నాతో, 'ఎలాగైనా నీ సఖి నన్ను పెళ్ళాడేలాగు చెయ్యి. నా రాజ్యానికి తానే అధికారిణి అని చెప్పు. నేను తనకు సేవకుడుగా ఉండి, ఏ కోరిక కోరినా సరే, తప్పక తీర్చుతాను,' అన్నాడు.

అంటే నేను, 'నీ కోరిక తీర్చే సామర్థ్యం నాకు లేదు. అందుచేత, నువే ఆమెతో మాట్లాడుకో,' అన్నాను. అప్పుడు కాలకేతుడు నా సఖితో, 'నేను నీ దాసుణ్ణి. నన్ను అనుగ్రహించు. నీ యౌవనం శాశ్వతం కాదు,' అన్నాడు.

దానికి నా సఖి, 'నా తండ్రి నన్ను ఒక రాజకుమారుడికి ఇద్దామనుకుంటున్నాడు. నేను హైహయుడనే రాజకుమారుణ్ణి వరించాను. అందుచేత ఇంకొకరికి ఎలా భార్యను కాగలను? కన్యలు తల్లిదండ్రులు చెప్పినవాణ్ణి పెళ్ళాడాలి తప్ప, స్వతంత్రలు కారు గదా!' అన్నది.

అయినా ఆ దుర్మార్గుడు తన పట్టు వదలలేదు. వాడి పురం పాతాళగర్భంలో, రాక్షసుల రక్షణలో ఉన్నది. అక్కడికి ఎవరూ వెళ్ళలేరు.

యశోవతి చెప్పిన ఈ కథ అంతా విని, ఏకవీరుడు, ''రాక్షసుడు నిన్నూ, నీ సఖినీ తన పురంలో ఉంచాడన్నావు గదా, నువు

ఎలా ఇక్కడికి రాగలిగావు ? హైహయుణ్ణి మీ సఖి ప్రేమించినట్టు చెప్పావు. నేను తప్ప హైహయు డనేవాడు మరెవడూ లేడు. మీ రాజుగారు నా కియ్యటానికే ఈ పిల్లను కన్నాడా? సంకోచం లేకుండా చెప్పు. అదే అయే మాటైతే, ఆ రాక్షసుణ్ణి చంపి నీ సఖిని తెస్తాను. అక్కడికి దారి చెప్పు. ఇంతకూ తన కూతుర్ని రాక్షసుడు హరించిన సంగతి రాజుకు తెలుసా ? తెలిస్తే ఆమెను రక్షించే ప్రయత్నం చేయకుండా ఉంటాడా? ఆయన బొత్తిగా అసమర్థుడా ? '' అన్నాడు.

దానికి యశోవతి ఇలా అన్నది: '' చిన్నతనంలో ఒక సిద్ధుడు నా కొక మంత్రం చెప్పాడు. నేనా రాక్షసుడి పట్టణంలో ఉండగా నాకు ఆ మంత్రం జ్ఞాపకం వచ్చింది ఆ మంత్రంతో దేవిని ఆరాధిస్తే ముక్తి లభిస్తుందనుకుని ఆ మంత్రం జపించాను. ఎర్రటి బట్టలు ధరించి ఆ దేవి నాకు కలలో కనిపించి, నువు వెంటనే లేచి, గంగకు వెళ్ళిపో. నీకు రాక్షసుడి భయం వద్దు. అక్కడికి నా భక్తుడైన హైహయుడు వస్తాడు. అతను నిన్ను చూసి, రాక్షసుణ్ణి చంపి, ఏకావళిని చెర విడిపిస్తాడు. తరవాత వారిద్దరికీ నువు పెళ్ళి చెయ్యి, అని చెప్పి, అంతర్ధానమయింది.




నేను దేవి మాటలకు పరమానందం చెంది, నిద్రలేచి, ఏకావళికి ఈ సంగతి చెప్పాను. ఆమె ఎంతో సంతోషించింది. నేను ఆ పరాశక్తి దయవల్ల ఇలా వచ్చాను,'' అన్నది.

''లక్ష్మీదేవి నాకు తల్లి. నేను హైహయుణ్ణి. నన్ను ఏకవీరుడు అంటారు. నీ సఖి అందం గురించి వింటేనే నాకు ఆమెపై మోహం కలిగింది. ఆమె నన్ను ప్రేమించిందని నువు చెప్పగానే నేనామెకు దాసుణ్ణి అయాను! నీ ఋణం ఎలా తీర్చుకుంటాను? నీ సఖి ఉన్న చోటికి ఎలా వెళతాను ? '' అని ఏకవీరుడు అడిగాడు.

"రాజా, నీకు మంత్రం చెబుతాను. దాని సహాయంతో రాక్షసనగరానికి వెళ్ళి, కాలకేత రాక్షసుణ్ణి చంపి, రాజకుమార్తెను తీసుకురా," అని యశోవతి త్రిలోకతిలకం అనే మంత్రాన్ని అతనికి ఉపదేశించింది.

దాని సహాయంతో ఏకవీరుడు యశోవతినీ, తన సేననూ వెంటబెట్టుకుని రాక్షసుడి పురానికి వెళ్ళాడు. పెద్ద సేన వస్తున్నదని దూతలు కాలకేతుడికి చెప్పారు.

కాలకేతుడికి ఈ వార్త వినగానే కోపంతో ఒళ్ళుతెలియకుండాపోయింది. వాడు ఏకావళి దగ్గిరికి పోయి, "సేనతో వస్తున్నవాడు నీ తండ్రి అయితే ఎదురువెళ్ళి స్వాగతం చెబుతాను. మరొకడు అయేమాటైతే తక్షణం చంపేస్తాను. చెప్పు, ఎవడా వచ్చేది?" అన్నాడు.

"నీ నిర్బంధంలో ఉన్న నాకు ఎవరు వచ్చేదీ ఎలా తెలుస్తుంది? నా తండ్రి గాని, అన్న గాని కాదని నిశ్చయంగా చెప్పవచ్చు. ఎవరైనప్పటికీ, ఆ బలశాలి ఎందుకు వస్తున్నాడనేదే నా సందేహం,' అన్నది ఏకావళి.

ఇంతలో దూతలు వచ్చి కాలకేతుణ్ణి యుద్ధానికి సిద్ధంకమ్మని హెచ్చరించారు. కాలకేతుడు రథమెక్కి వెళ్ళాడు. ఏకవీరుడు గుర్రం మీద అతనితో యుద్ధానికి తలపడ్డాడు. యుద్ధం ఘోరంగా జరిగింది. త్వరలోనే కాలకేతుడు ఏకవీరుడి చేతిలో చచ్చాడు. వాడి సేనలు చెల్లాచెదరై పోయాయి.

యశోవతి వెళ్ళి ఏకావళికి ఈ వార్త చెప్పింది. ఇద్దరూ కలిసి ఏకవీరుడి శిబిరానికి వచ్చారు. తరవాత అందరూ కలిసి ఏకావళి తండ్రి నగరానికి వెళ్ళారు. అక్కడ ఏకవీరుడికీ, ఏకావళికీ వైభవంగా వివాహం జరిగింది. తరవాత ఏకవీరుడు భార్యాసమేతంగా తన నగరానికి వెళ్ళి, సుఖంగా రాజ్యం చేశాడు.

ఏకవీరుడి కొడుకు కృతవీర్యుడు. కృతవీర్యుడి కొడుకు కార్తవీర్యుడు. అలా హైహయవంశం వర్ధిల్లింది.





# దేవీ భాగవతం

ఒకసారి నారదుడు సంచారం చేస్తూ, వ్యాసుడి ఆశ్రమానికి వచ్చాడు. వ్యాసుడు అతనికి భక్తిగా అర్ఘ్యపాద్యాలిచ్చి కూర్చో బెట్టి, ''మహాత్మా, సంసారంలో సుఖమనేది కొంచెం కూడా లేదా?'' అంటూ తన అనుభవాలన్నీ చెప్పాడు. వ్యాసుడు పుట్టినప్పుడే అతన్ని తల్లి వదిలేసింది. అతను తపస్సు చేసుకుంటూ కొడుకును సంపాదించుకున్నాడు. శివుడి దయవల్ల కలిగిన ఆ కొడుకు తండ్రిని వదిలేసి, దుఃఖంలో ముంచి వెళ్ళిపోయాడు. ఈ విధంగా ముందు తరంచేతా, వెనుక తరంచేతా విసర్జించబడిన వ్యాసుడికి మళ్ళీ సంసార బంధంలో చిక్కుకునే అగత్యం ఏర్పడింది. అతని తల్లి అయిన సత్యవతి శంతనుణ్ణి పెళ్ళాడి కొడుకులను కని, ముందు భర్తనూ, తరవాత కొడుకులనూ పోగొట్టుకున్నది. ఆమె ఆజ్ఞవల్ల వ్యాసుడు ఆమె కోడళ్ళకు గుడ్డివాడైన ధృతరాష్ట్రుణ్ణీ, పాలిపోయిన పాండ్యుణ్ణీ, దాసీ పుత్రుడైన విదురుణ్ణీ కనవలసి వచ్చింది. ఇలా ముగ్గురిని కన్నాడే గాని, వారిలో ఒక్కడూ వ్యాసుడికి పిండాలు పెట్టటానికి పనికి రాడు!

ఆ తరవాత వ్యాసుడి సంతతి వాళ్ళయిన ధృతరాష్ట్రుడూ, పాండుడూ ఇంకో తరాన్ని కన్నారు. వాళ్ళ తగాదాలలో వ్యాసుడు తల దూర్చవలసి వచ్చింది. పాండుడి కొడుకులు అడవులకు పోయి అష్టకష్టాలూ పడ్డారు. ఈ విధంగా

**22.** నారద సంసారం



వ్యాసుడు సుఖదుఃఖాల మధ్య తాను ఎలా నలిగినదీ చెప్పి, "మహాత్మా, కొడుకులూ, తండ్రులూ, మనమలూ అనే ఈ భ్రాంతి నుంచి విముక్తి ఎలా కలుగుతుంది? సంసారంలో చిక్కిన వాడి మనస్సుకు సుఖం ఎలా లభిస్తుంది? దయచేసి చెప్పు," అని అడిగాడు.

దానికి నారదుడు, "నాయనా, సంసారంలోపడి మోహం చెందని ప్రాణి ఎక్కడైనా ఉంటాడా? హరిహర బ్రహ్మదులు సైతం మోహంలో పడి, నేను గొప్పజ్ఞానినని నన్ను మెచ్చుకుంటారు. కాని అది నిజం కాదు. ఒకప్పుడు నేను మోహంలో పడి, భార్యకోసం ఎటువంటి పాట్లు పడ్డానో చెబుతాను విను." అంటూ తన కథ వ్యాసుడికి ఇలా చెప్పసాగాడు:

ఒకనాడు నారదుడూ, పర్వతుడూ భూలోక సంచారం చేస్తూ, పుణ్యక్షేత్రాలూ, ఋష్యాశ్రమాలూ చూస్తూ, తమలోతాము ఒక నియమం చేసుకున్నారు. అదేమిటంటే, ఒకరి ఆలోచనలు ఇంకొకరి దగ్గిర దాచకుండా చెప్పెయ్యాలి.

వారు అలా సంచారం చేస్తూండగా ఎండాకాలం అంతమై, చాతుర్మాస్యం (వానాకాలం) వచ్చింది. చాతుర్మాస్యం జరపటానికి ఏదో ఒక చోట ఉండిపోవాలి. వారికి సంజయుడు అనే రాజు ఉండే నగరు అందుకు దొరికింది. వారు రాజుగారి ఇంటనే బస ఏర్పాటు చేసుకున్నారు. వానలు కురిసే ఆ నాలుగు మాసాలూ సంచారానికి పనికిరావు. రాజుగారి ఇంట వాళ్ళు సుఖంగా ఉంటూ వచ్చారు. రాజు కూతురు మదయంతి స్వయంగా వాళ్లకు పరిచర్యలు చేయసాగింది. వాళ్ళు స్నానం చెయ్యటానికీ, భోజనాలకూ, పడుకోవటానికీ ఆమె చక్కని ఏర్పాట్లు ఎంతో శ్రద్ధగా, ఇద్దరి మధ్యా పక్షపాతం ఏ మాత్రమూ లేకుండా చేస్తూ వచ్చింది. వాళ్ళకు వేదాధ్యయనంతోనూ, గానవినోదాలతోనూ కాలం మహాసుఖంగా గడవసాగింది.



క్రమంగా మదయంతికి నారదుడి మీద మోహం పుట్టుకు వచ్చింది. అతని వీణా వాదనమూ, సామగానమూ ఆమె మన సును అమితంగా ఆకర్షించాయి. ప్రేమ పూర్వకంగా ఆమెచేసే పనులు నారదుణ్ణి బలంగా ఆకర్షించాయి. ఆమె సహజంగా, ఇద్దరికీ సౌకర్యాలు అమర్చటంలో, నారదుడి పట్ల పక్షపాతం చూపసాగింది. స్నానం చేసేటప్పుడు నారదుడికి వేడి నీళ్ళూ, పర్వతుడికి చన్నీళ్ళూ ఏర్పా టయేవి; భోజనం దగ్గిర నారదుడికి పెరుగు వడ్డన అయితే, పర్వతుడికి మజ్జిగ మాత్రమే లభించేది. పక్కలు కూడా ఇద్దరికీ ఒక విధంగా అమరేవి కావు. ఆమె నారదుడికేసి చూసే చూపులు గురించి చెప్పనే అక్కర్లేదు.

వారిద్దరికీ రాజకుమార్తె మదయంతి పరిచర్యలు చెయ్యటంలో ఈ తేడా కొట్ట వచ్చినట్టు కనపడేసరికి, పర్వతుడు నార దుడితో ఏకాంతంగా, "రాజు కూతురు వాలకమూ, ప్రవర్తనా చూస్తే నిన్ను వరించినట్టుగా కనపడుతుందే! నీకు కూడా ఆమె మీద మోహం వున్నట్టే ఉన్నది. మరి మనం ఒకరి దగ్గిర ఒకరం రహస్యాలుంచుకోరాదన్న నియమం మరి చావా? చాటుమాటెందుకూ? నిజం చెప్పు!" అన్నాడు.

నారదుడు కొంచెం సిగ్గుపడుతూ, "మునీంద్రా, ఇందులో దాచేటందుకు ఏమున్నదీ? రాజకుమార్తె నన్ను వల చింది, నేనూ ఆమెను ప్రేమిస్తున్నాను," అన్నాడు.

ఆ మాట వింటూనే పర్వతుడికి కోపం వచ్చి, "నియమం తప్పి నన్ను మోస గించావు గనక, నీది కోతిముఖం అయి పోవుగాక!" అని శపించాడు.

నారదుడు కూడా కోపోద్రేకం కలిగి, "ఈ కాస్త తప్పుకు నన్ను శపించిన నీకు స్వర్గప్రాప్తి లేకపోవుగాక!. ఇక నువు భూలోకంలోనే ఉండిపో!" అని ఎదురు శాపం యిచ్చాడు.



ఇలా శాపం పొంది పర్వతుడు వెళ్ళి పోయాడు. నారదుడికి కోతిముఖం వచ్చేసింది. అయినా, నారదుడి వీణా గానం విని ఆనందిస్తూ రాజకుమార్తె అతనికి ఆదరంతో శుశ్రూషలు చేస్తూ వచ్చింది. తన మేనల్లుడైన పర్వతుడు వెళ్ళిపోయినందుకు నారదుడు మాత్రం బాధపడ్డాడు.

ఇంతలో సంజయరాజు తనకుమార్తెకు స్వయంవరం నిశ్చయించి, తన మంత్రితో, ''అమ్మాయికి పెళ్ళి చేస్తాను. దాని అందానికి తగిన అందమూ, గుణమూ, కులమూగల వరుణ్ణి చూడు,'' అన్నాడు.

''మహారాజా, మీరు కోరినలాటి వరులు ఎందరో వున్నారు. వారిలో మీకు నచ్చిన వాణ్ణి మీరు నిర్ణయించండి.'' అన్నాడు మంత్రి.

తన పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నట్టు తెలిసి, మదయంతి తన దాది ద్వారా తండ్రికి కబురు పంపుతూ, తాను నారదుణ్ణి వరించాననీ, మరొకరిని పెళ్లాడలేననీ తెలియజేసింది.

దాది వచ్చి సంజయరాజుకు ఈ మాట చెప్పినప్పుడు అతని భార్య కైకేయి అక్కడే ఉన్నది. రాజు ఆమెకేసి చూసి, ''అమ్మాయి ఆ కోతిముఖాన్ని ఎలా వరించింది? అతను మన పిల్లకు ఎలా తగి ఉంటాడు? అతనికి పిల్లను యెలా ఇయ్యటం? బుద్ధిలేక మనపిల్ల తప్పుడు నిర్ణయాలు చేస్తే, దాన్ని సరిదిద్దటం మన కర్తవ్యం. అతగాడు బిచ్చగాడని నువు అమ్మాయికి తెలియజెయ్యి.'' అన్నాడు.

కైకేయి తన కూతురితో ఏకాంతంగా, ''అమ్మా, నువు నవనవలాడే శరీరంగల దానివి; ఆ నారదుడు బూడిద పట్టించడం చేత మొరటుదేలిన శరీరం గలవాడు! నీ ముఖం ఎంత అందమైనది! అతనిది కోతి ముఖం! అతన్ని ఎలా వరించావు? అది అలా వుండగా, అతను అస్తమానమూ తిరుగుతూ బిచ్చమెత్తుకునేవాడు! ఇతన్నా నువు వరించేది? నీ మతిమాలినతనం చూసి మీ నాన్నగారు చాలా బాధపడు

తున్నారు. ఎవరైనా లేత తమలపాకులను తీసుకుపోయి ఒంటెకు మేపుతారా? నిన్ను ఆ నారదుడికిచ్చి పెళ్ళి చేస్తే, మమ్మల్ని చూసి అందరూ నవ్వరూ?'' అంటూ రకరకాలుగా బోధించింది.

కాని సంగీత వ్యామోహంగల మదయంతి తన మనసు మార్చుకోక, "అమ్మా, మనిషి శుంఠ అయితే మొహమూ, మనిషీ బాగుండి, రాజ్యమూ, ధనమూ వుండి ఏం లాభం? ఈ నారదుడి వంటి సంగీతప్రవీణుడికి మొహమూ, రాజ్యమూ, ధనమూ, అందమూ ఎందుకు? ఇతని గానానికి రాళ్లు పరవశం చెందుతాయి. ఇతనిలాటి గాయకుడు మూడు లోకాలలోనూ మరొకడు లేడు. రసజ్ఞతలేని వాణ్ణి కట్టుకున్న దానికి ప్రతిక్షణమూ చావే! రసజ్ఞుడికి భార్య అయితే జీవితమంతా ఆనందమే! స్వరజ్ఞానం గలవాడు మామూలు మనిషి అయినా దేవతలతో సమానుడే! పశువులను కూడా ఆనందంలో ఓలలాడించే సంగీతం వినటం విషయంలో పెద్దలు అనాదరణ చూపితే, వారి జన్మ ఏంజన్మ? నారదుడి శక్తి నాన్నకు తెలియదు. శాపం తగిలి అతనికి వానరముఖం రాకమునుపు నుంచీ నేనతన్ని ప్రేమించాను. కోతి ముఖం వచ్చినా అతను నా ప్రియుడే! కిన్నరుల ముఖాలు గుర్రం ముఖాలు.



అందుచేత వారిగానాన్ని ఆదరించని వాళ్లు ఎవరైనా ఉంటారా? విద్య లేకపోయాక ముఖం దేనికి? అతన్ని తప్ప, నవ మన్మధుడు వచ్చినా, నేను పెళ్ళాడను. నన్ను అతని కిచ్చి పెళ్ళి చేయించు. అందుకు నాన్నను ఒప్పించు.'' అన్నది.

కైకేయి తన భర్త వద్దకు వెళ్లి, తన కూతురు నిశ్చయాన్ని తెలిపింది. రాజు మరే అభ్యంతరమూ చెప్పకుండా, పెళ్లి ప్రయత్నాలు చేసి, నారదుడికి మదయంతి నిచ్చి పెళ్ళి చేసేశాడు.

నారదుడు మామగారి ఇంటనే ఉండిపోయాడు. భార్య తన వద్దకు వచ్చినప్పుడల్లా అతను తన కోతిముఖం తలచు



కుని అమితంగా బాధపడేవాడు. కాని మదయంతి ఆ విషయం ఏ మాత్రమూ బాధపడేది కాదు.

కొంతకాలం గడిచింది. ఈ లోపల పర్వతుడు ఎన్నోచోట్లు తిరిగి, నారదుణ్ణి చూడటానికి వచ్చి, తన మేనమామ ముఖం చూసి జాలిపడి, "రాజకుమార్తె కోసం నా శాపాన్ని ఉపసంహరించు కుంటున్నాను. నీ ముఖం యథాపూర్వం ఉండుగాక," అన్నాడు.

"నేను కూడా నిన్ను దుర్బుద్ధితో శపించాను. నువు మామూలు ప్రకారం స్వర్గానికి వెళ్ళు," అన్నాడు నారదుడు పర్వతుడితో.

పర్వతుడు సంతోషించి వెళ్ళిపోయాడు. నారదుడిలో మార్పుకు ఎంతో ఆనందం పొందిన రాజకుమార్తె తన తల్లి దగ్గిరికి వెళ్ళి, తన భర్త ముఖం మళ్ళీ అందంగా మారినట్టు చెప్పింది. ఆమె ఈ మాటను రాజుతో చెప్పింది. రాజు కూడా సంతోషించాడు.

ఈ విధంగా నారదుడికి సంసారంలో మాయవల్ల కష్టాలు ఎలా సంభవించేదీ అనుభవంలోకి వచ్చింది. అతను వ్యాసుడికి తన అనుభవం మరొకటి కూడా చెప్పాడు.

ఒకసారి నారదుడు శ్వేతద్వీపంలో విష్ణువును చూడబోయాడు. లక్ష్మీదేవి నారదుణ్ణి చూడగానే చప్పున లోపలికి వెళ్ళిపోయింది. ఇందుకు నారదుడు కొంచెం నొచ్చుకుని, విష్ణువుతో, "నేనేమైనా విటగాడినా, దుర్మార్గుడినా? తపస్వినీ, ఇంద్రియాలను జయించిన వాడినీనూ! అలాటప్పుడు నీ భార్య నన్ను చూడగానే చప్పున లోపలికి వెళ్ళిపోయింది గదా? ఇదేమన్నా మర్యాదగా ఉన్నదా?" అన్నాడు.

అతిశయ పూర్వకంగా నారదుడు ఇలా మాట్లాడినందుకు విష్ణువు కోపగించుకోక, "భర్తకాక ఏ ఇతర పురుషుడి సాన్నిధ్యంలోనూ ఉండకపోవటం స్త్రీ ధర్మం.

ఎంతటి వాళ్లయినా ఇంద్రియాలకు అధీనులు కాకుండా ఉండలేరు గదా! ఎంతటి మహా మహులకూ అది సాధ్యంకాదు. మా త్రిమూర్తులం కూడా మాయకు లోబడిన వాళ్ళమే.'' అన్నాడు.

నారదుడు ఆశ్చర్యపోయి, ''మాయ ఎలాటిది ? దాని బలం ఎటువంటిది ? '' అని అడిగాడు.

''నా వెంట వచ్చావంటే నీకు మాయ కనపడేలాగా చేస్తాను, దాన్ని చూసి దుఃఖ పడవద్దు,'' అని విష్ణువు గరుత్మంతుణ్ణి పిలిచాడు.

నారదుడూ, విష్ణువూ గరుత్మంతుడి మీది ఎక్కి, ఎక్కడికో వెళ్ళారు.

కాన్యకుబ్జ మనే ఊరికి సమీపంగా చక్కని చెరువు ఉన్నది. అందులో అందమైన కలవలూ, తామరలూ ఉన్నాయి. అందులోని నీరు ఎంతో నిర్మలంగా ఉన్నది.

విష్ణువు నారదుడి చిటికెన వేలు పట్టుకుని చెరువు వద్దకు తెచ్చి, ''ఇందులో స్నానం చేసి, కాన్యకుబ్జనగరానికిపోదాం,'' అన్నాడు.

నారదుడు వీణా, జింకతోలూ ఒకచోట పెట్టి, చెరువులోకి దిగే సరికి, అతని పురుషరూపంపోయి, స్త్రీరూపం వచ్చింది. ఆ సంగతి నారదుడు ఎరగడు. కాని



విష్ణువు నారదుడి వీణా, జింకచర్మమూ తీసుకుని, గరుత్మంతుడి మీద ఎక్కి వెళ్ళిపోయాడు.

నారదుడు స్త్రీ రూపంతో నీటి నుంచి బయటికి వచ్చేసరికి, అతనికి తన వీణగాని, విష్ణువుగాని జ్ఞాపకం రాలేదు. ఇంతలో రథం మీద తాలధ్వజు డనే రాజు ఏనుగులనూ, గుర్రాలనూ, భటులనూ వెంట బెట్టుకుని వచ్చి, నారదుడి కేసి ఆసక్తితో చూసి, ''నువు నదీసుందరివా? దేవసుందరివా ? నాగసుందరివా? ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నావు?'' అని అడిగాడు. అతను ఆ స్త్రీని ప్రేమించి, పెళ్లాడతానన్నాడు. స్త్రీగా ఉన్న నారదుడు

అందుకు సమ్మతించాడు. ఇద్దరూ నగ రానికి వెళ్ళి, అక్కడ పెళ్ళి చేసు కున్నారు.

నారదుడిలో పురుషభావంగాని, బ్రహ్మ జ్ఞానంగాని కొంచెం కూడా మిగలలేదు. తనకు సాటిరాగల స్త్రీలే లేరన్న గర్వం కూడా వచ్చింది. నారదుడు పన్నెండేళ్ళు కాపరం చేసినాక గర్భం కలిగింది. తరవాత కొడుకు పుట్టాడు. వాడికి వీర వర్మ అని పేరు పెట్టారు. తరవాత వరసగా కొడుకులు పుట్టుకురాసాగారు. నారదుడు ఆ స్త్రీ రూపంలో పన్నెండు మంది కొడుకులను కన్నాడు. కొడుకులు పెద్దవారై, పెళ్ళిళ్ళు చేసుకుని, తాము కూడా పిల్లల్ని కన్నారు. వంశం విస్త రించింది.

కొంత కాలానికి కాన్యకుబ్జ నగరం మీదికి శత్రువులు యుద్ధానికి వచ్చారు. ఆ యుద్ధంలో నారదుడు కన్న కొడుకులూ, వాళ్ళ కొడుకులూ చచ్చారు. నారదుడికి తీరని గర్భశోకం సంప్రాప్తమయింది.

ఆ సమయంలో విష్ణువు ముసలి బ్రాహ్మణుడి రూపంలో వచ్చి, "ఎవరు కొడుకులు? ఎవరు నువు? కాలవశాన అన్నీ అవుతాయి. ముందు స్నానం చేసి, తర్పణాలు విడు," అని చెప్పాడు.

అతను నారదుణ్ణి తన వెంట పురుష తీర్థం అనే సరస్సుకు తీసుకుపోయి, అందులో స్నానం చెయ్యమన్నాడు. అందులో మునగగానే నారదుడి స్త్రీరూపం పోయి పురుషరూపం వచ్చింది. ఒడ్డున తన వీణనూ, జింక చర్మాన్నీ పట్టుకుని విష్ణువు కనిపించి, "ఎంతసేపు, నారదా? వచ్చెయ్యి!" అన్నాడు.

నారదుడు బయటికి వచ్చి, స్త్రీగా తన జీవితాన్ని మరిచిపోయాడు. కాని తాల ధ్వజుడు మాత్రం తన భార్య మగవాడై పోయినందుకు ఎంతో దుఃఖించాడు. విష్ణువు ఆ రాజుకు వేదాంతం బోధించి పంపేశాడు. మాయచేతిలో మనిషి ఎలాటి కీలుబొమ్మ అయినదీ నారదుడికి తెలిసి వచ్చింది.





# దేవీ భాగవతం

శర్యాతి అనే రాజుకు భార్యలు వేల సంఖ్యలో ఉండేవారట. అందరు తల్లులకూ సుకన్య ఒక్కతే కూతురు కావటం చేత అమిత గారాబంగా పెరిగింది.

రాచనగరు వెలపల ఒక అందమైన తటాకం సమీపంలో చ్యవనుడు అనే భృగువంశం వాడు అంబను గురించి తపస్సు చేస్తున్నాడు. అతని చుట్టూ పుట్టలు లేచాయి, లతలు చుట్టుకున్నాయి.

ఆ చెరువు ఉన్న ప్రాంతానికి శర్యాతి స్త్రీలతో సహా విహారానికి వచ్చాడు. వాళ్ళ వెంట వచ్చిన సుకన్య సీతాకోకచిలుకలాగా పూలకోసం అటూ ఇటూ పరిగెత్తి కోస్తూ, తన చెలికత్తెలతో కలిసి తిరుగుతున్నది. ఇంతలో ఆమెకు చ్యవనుడున్న పుట్ట కనబడింది. సుకన్య కుర్రతనం కొద్దీ అందులోకి తొంగి చూసేసరికి రెండు వస్తువులు ఏవో ప్రకాశిస్తూ కనిపించాయి. వెంటనే ఆమె ముళ్ళతో వాటిని పొడవబోయింది.

అది చూసి చ్యవనుడు, "అమ్మాయీ, ఈ పుట్ట జోలికి రాకు, దూరంగా వెళ్ళు. నేను తపస్సు చేసుకుంటున్నాను," అన్నాడు.

సుకన్య ఆ మాటలు వినక, ముళ్ళతో చ్యవనుడి కళ్ళు పొడిచి, అతన్ని అంధుణ్ణి చేసింది. సుకన్య తాను చేసిన పనికి క్షణంపాటు పశ్చాత్తాపపడినా, వెంటనే ఆ మాట మరచిపోయి క్రీడోత్సాహంలో పడిపోయింది.

23. చ్యవనుడి కథ



చ్యవనుడు మాత్రం బాధ సహించలేక రోదన ప్రారంభించాడు. అదే సమయంలో రాజుకూ, అతని పరివారానికీ మల మూత్రాలు స్తంభించిపోయాయి. అందరికీ ఒకేసారి శాపం తగిలినట్టుగా ఇలా కావటానికి ఆశ్చర్యపడుతూ, శర్యాతి తన నగరానికి తిరిగి వెళ్ళి, తన సైనికులతో, ''మన పురానికి సమీపంలో నే చ్యవనుడనే వృద్ధుడు తపస్సు చేసుకుంటున్నాడు. ఎవరుగాని అయనకు బాధ కలిగించలేదు కద? ఈ పని ఎవరు చేసినదీ మీరు తెలుసుకోండి,'' అన్నాడు.

సైనికులు మాకు తెలియదంటే, మాకు తెలియదన్నారు. రాజు వాళ్ళ మాటలు నమ్మక, నిజం చెప్పమని హింసించ నారంభించాడు.

ఈ సంగతి సుకన్య విని, ''నాన్నా, నేను వనవిహారం చేస్తుండగా ఒక పుట్ట కనబడింది. అందులో రెండు రంధ్రాలున్నాయి. వాటికుండా రెండు కాంతులు వెలువడటం చూసి, పొడిచేసరికి వాటి నుంచి నీరు కారనారంభించింది. అదే సమయంలో ఏదో ఆర్తనాదం హీనంగా వినిపించింది. అలా వినిపించినందుకు ఆశ్చర్యపడుతూ అక్కడి నుంచి వచ్చేశాను. నేను దేన్ని పొడిచానో నాకు తెలీదు,'' అన్నది.

మహామునికి జరిగిన అపచారం ఇదే అయి ఉంటుందనుకుని, రాజు వెంటనే బయలుదేరి చ్యవనుడున్న చోటికి పోయి, పుట్టను తొలగించి, కళ్ళు పోయి బాధతో కుమిలిపోతున్న మునికి సాష్టాంగపడి, ''మహాత్మా, తెలియక నా కూతురు నీకు చేసిన హానికి ఆగ్రహించవద్దు. మీ వంటి తాపసులకు ఆగ్రహం తగదు,'' అని వేడుకున్నాడు.

దానికి చ్యవనుడు, ''రాజా, నా మనస్సులో కోపం ఏ కోశానా లేదు. నీ కూతురు నా కళ్ళు పొడిచిన కారణంగా నీకు అలా బాధ కలిగింది. అంతేగాని నేను శపించలేదు. ఎవరికీ ఎలాటి హానీ కలిగించ



కుండా తపస్సు చేసుకునేవారికి హాని చేస్తే ఊరికేపోతుందా? ఈశ్వరుడు ఆగ్రహించడా? ముసలివాణ్ణి! ఇప్పుడు గుడ్డివాణ్ణి కూడానూ! ఈ దిక్కులేని నాకు ఇప్పుడు ఎవరు పరిచర్యలు చేస్తారు?'' అంటూ దుఃఖించాడు.

''మహామునీ, నీకు ఎందరు సేవకులు కావాలన్నా పంపుతాను. వాళ్ళు నీకు కావలసిన విధంగా సేవలు చేస్తారు. మనస్సులో కోపం మాత్రం పెట్టుకోవద్దు,'' అని రాజు అన్నాడు.

దానికి ముని, ''అయ్యో, గుడ్డివాణ్ణి కదా, నాకు నిష్ఠ ఎలా సాగుతుంది? నీ సేవకులు నాకేం చేయగలరు? నాకు సేవ చెయ్యటానికి నీ కూతురిని నాకు పెళ్ళిచెయ్యి. నేను మునిని గనక సంకోచించ నవసరంలేదు,'' అన్నాడు.

ఈ మాట విని శర్యాతి విచారగ్రస్తుడై, దీర్ఘాలోచనలో పడి, ఎటూ చెప్పలేకపోయాడు. ముసలివాడూ, గుడ్డివాడూ, మొరటువాడూ అయిన చ్యవనుడు అతి నాజూకుగా పెరిగిన సుకన్యను ఏం సుఖపెట్టుతాడు? సుకన్య ఇలాటి భర్తతో ఎలా కాపరం చేస్తుంది?

ఇలా అనుకుని శర్యాతి చ్యవనుడికి తన కూతురిని భార్యగా ఇయ్యటం ఇష్టం లేక, ఇంటికి తిరిగివెళ్ళి, తన మంత్రులతో, ''చూశారా, పరిస్థితి ఎలా వచ్చిందో? నేను నా కూతురిని ఆ మునికి ఇయ్యాలి, లేదా మలమూత్ర స్తంభనతో మనం బాధపడాలి!'' అన్నాడు.

దానికి మంత్రులు, ''మహారాజా, సుకన్యను మునికి ఇయ్యటం మాకు కూడా సమ్మతం కాదు,'' అన్నారు.

అంతలో సుకన్య అక్కడికి వచ్చి, విషయం తెలుసుకుని, ''నా కోసం మీరంతా ఇంత బాధపడటం దేనికి? నేను చేసిన తప్పు వల్ల కదా ఆ ముని కళ్ళు పోయాయి? ఆయన దయ సంపాదించుతాను. మీరంతా సుఖంగా ఉండండి!'' అన్నది.



దానికి రాజు, "అయ్యో! ఆ గుడ్డి, ముసలి చ్యవనుడికి అడవిలో నువు పరిచర్యలు ఎలా చేస్తావు? నా సుఖం కోసం నిన్ను మునికి ఇయ్యనా? నీ చేత ఈ అడివిలో ముసలి మొగుడితో కాపరం చేయిస్తే నాకు పుట్టగతులుంటాయా? అమ్మా, నేనూ, నా రాజ్యమూ ఏమై పోయినాసరే గాని, నా చేతి మీదుగా నిన్ను నేను ఆ కళ్ళులేని ముసలిమునికి ఇయ్యను," అన్నాడు.

దానికి సుకన్య, "నీ మాట సవ్యంగా లేదు. ఈ ముని లోకోత్తరుడు. ఆయన వృద్ధుడైతేనేం? ఆయనను సేవించుకుంటాను. నేను సుఖపడాలని కోరటం లేదు. నా మూలంగా మీ కందరికీ సుఖం కలగటం చాలదా?" అన్నది.

ఆమె దృఢసంకల్పం చూసి రాజూ, మంత్రులూ ఆశ్చర్యపోయారు. తరవాత శర్యాతి ఆ ముని వద్దకు తిరిగివెళ్ళి, నమస్కరించి, "నా కుమార్తెను నీ కిచ్చి వివాహం చేస్తాను. అనుగ్రహించి ఆమెను గ్రహించు." అన్నాడు.

చ్యవనుడికీ, సుకన్యకూ శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. రాజుకూ, సైనికులకూ వ్యాధి నివారణ అయింది. తండ్రి తిరిగి పోయేటప్పుడు సుకన్య, తన నగలు ఇచ్చి, తనకు చర్మమూ, నారబట్టలూ ఇయ్యమన్నది.

తరవాత సుకన్య కొత్త జీవితం ఆరంభించింది. ఆమె అడవిలో అన్నిదిక్కులూ తిరిగి ఫలాలూ, దుంపలూ తెచ్చేది; అగ్నుల కోసం ఎండు సమిధలు ఏరేది; నువ్వులూ, దర్భలూ చేర్చి, తోమిన కమండలంతో బాటు ఒకపక్క ఉంచి, భర్తను వేడినీళ్ళతో స్నానం చేయించి, చర్మం పరచి, తన భర్తను నిత్యకర్మకు సిద్ధంచేసేది; నిత్యకర్మ అయిన తరవాత ఆయనను చేయిపట్టి తెచ్చి కూర్చోబెట్టి, భోజనం పెట్టేది; భోజనానంతరం ఆయన చేతులూ, కాళ్ళూ కడిగేది; తరవాత తాను భోజనం చేసి,



భర్తకు కాళ్ళు పట్టేది. భర్త ఎక్కడికి వెళ్ళాలన్నా సుకన్య చెయ్యి పట్టుకుని నడిపించుకు పోయేది. ఇలా ఆమె తన భర్తను భక్తితో సేవిస్తూ, కాలం గడుపుతున్నది.

ఒకనాడు ఆమె చెరువులో స్నానం చేసి వస్తుండగా అశ్వినులు ఆమెను చూసి, ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపడి, ఆమెను సమీపించి, ''అమ్మాయీ, కొంచెం ఆగు! మేం అశ్వినులం. నువు ఎక్కడి నుంచి వస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు? నీ భర్త ఎవరు? తండ్రి ఎవరు? నువు రాజకుమార్తెవా? లేక అప్సరవా? ఇదంతా ఉత్త పొగడ్తకాదు,'' అన్నారు.

వారి మాటలకు సుకన్య కొంచెం సిగ్గుపడి, "నేను శర్యాతికూతుర్ని. గౌరవనీయుడైన చ్యవనుడి భార్యను. ఆయన వృద్ధుడూ, అంధుడూనూ. ఆయనకు సేవచేస్తూ ఉంటాను. నా కోరిక మీదనే నా తండ్రి నన్ను ఆయనకు ఇచ్చి పెళ్ళి చేశాడు. అ కనిపించేదే ఆయన ఆశ్రమం. మీ రెవరో మంచివాళ్ళులా గున్నారు. అక్కడికి దయచెయ్యండి,'' అన్నది.

ఈ మాట విని అశ్వినులు, ''గుడ్డివాడైన ముసలికి నీ తండ్రి నిన్ను ఏమని ఇచ్చాడు? నీ వంటి అందగత్తెలు దేవతా స్త్రీలలో కూడా లేరు. గుడ్డికి భార్యగా ఎలా ఉండగలుగుతున్నావు? నీకు ఈడైనవాణ్ణి చూసి వరించరాదా? అలాచేసి జీవితమంతా సౌఖ్యం అనుభవించు,'' అన్నారు.

దానికి సుకన్య, ''మీరు సూర్యుడి కొడుకులు. మీకు తెలియనిదేమీ లేదు. అన్యకాంతనైన నాతో మీరు ఇలా మాట్లాడవచ్చునా? నేను కుల కన్యను. మీరు అధిక ప్రసంగం చేస్తే మిమ్మల్ని శపించే శక్తి నాకున్నది!'' అన్నది.

ఆ మాటకు అశ్వినులు భయపడి, ఆమెను మంచి చేసుకునే ఉద్దేశంతో, ''అమ్మా, శీలం విషయంలో నువు లీలావతి కన్నా గొప్పదానివి. వరం కోరుకో, ఇస్తాం!'' అన్నారు.

వాళ్ళు ఆమెకు ఒక అవకాశం ఇచ్చారు. అదేమంటే, చ్యవనుణ్ణి తమతో సమానమైన వయసూ, అందమూగల వాణ్ణిగా చేసేటట్టూ, అప్పుడు ఒకే రూపులో ఉన్న ముగ్గురిలో సుకన్య ఒకరిని భర్తగా వరించేటట్టూనూ !

సుకన్య తమ ఆశ్రమానికి వెళ్ళి, చ్యవనుడితో అశ్వినులు అన్నమాట చెప్పి, ఏం చెయ్యాను అని అడిగింది.

అశ్వినులు కోరినట్టే చెయ్యమన్నాడు చ్యవనుడు. సుకన్య వెళ్ళి, వాళ్ళను తమ ఆశ్రమానికి తెచ్చింది.



చ్యవనుడు యువకుడు కావాలంటే నీటిలో మునగాలి. చ్యవనుడు సరే నన్నాడు. ముగ్గురూ చెరువులో మునిగి ఒకే రూపులో బయటికి వచ్చారు. వారిలో కావలసినవాణ్ణి సుకన్య ఎన్నుకోవాలి.

సుకన్య తనకు జగదంబే శరణ్య మనుకుని, ఆమెను ధ్యానించింది. అంబ అనుగ్రహించి ఆమెకు దివ్యజ్ఞానం ఇచ్చింది. సుకన్యకు ఆ ముగ్గురిలో తన భర్త ఎవరో తెలిసిపోయింది. ఆమె తన భర్తనే ఎన్నుకోవటం చూసి, అశ్వినులు ఆమె శీలాన్ని మెచ్చుకున్నారు.

చ్యవనుడు అశ్వినులను ప్రశంసిం చుతూ, "మీ ధర్మాన నాకు యౌవనమూ, కళ్ళూ కూడా ప్రాప్తించాయి. అందగాణ్ణి అయాను. ఉపకారానికి ప్రత్యుపకారం చేయాలి. కనక చెప్పండి, నా నుంచి మీరు ఏం కోరుతారు ?" అన్నాడు.

దానికి అశ్వినులు ఇలా అన్నారు :

"మేం వైద్యం చేసేవాళ్ళమన్న నెపంతో యజ్ఞాలలో మాకు సోమపానం చేసే హక్కు లేకుండా చేశారు. నీకు ఇష్టమైతే మాకు ఆ హక్కు కలగజెయ్యి."

"శర్యాతి చేత యజ్ఞం చేయించి మీకు సోమం ఇప్పిస్తాను." అన్నాడు చ్యవనుడు అశ్వినులతో.

అశ్వినులు తృప్తిపడి వెళ్ళిపోయారు. యౌవనం పొందిన చ్యవనుడు సుకన్యతో తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

ఒకనాడు శర్యాతి భార్యకు తన కూతురు ముసలి, గుడ్డి మొగుడితో ఎలా వేగుతున్నదో, అని ఆందోళన పట్టుకున్నది. శర్యాతికి కూడా తన కూతురిని చూడాలనిపించింది. ఇద్దరూ రథం మీద చ్యవనాశ్రమానికి వచ్చారు. అక్కడ సుకన్య వెంట ఒక అందమైన యువకుడు వారికి కనిపించాడు. తన కూతురు ముసలిభర్తను చంపి, యౌవనోద్రేకం కొద్దీ ఇంకెవరినో వరించిందని శర్యాతి ఆందోళన చెందాడు.

కాని సుకన్య తన తండ్రి ఆందోళనను పోగొట్టుతూ, జరిగిన సంగతి అంతా చెప్పింది. చ్యవనుడు తాను అశ్వినులకు ఇచ్చిన మాట గురించి చెప్పాడు.

తన అల్లుడి కోసం శర్యాతి యజ్ఞం తలపెట్టాడు. యజ్ఞం జరుగుతున్నచోటికి దేవతలతో సహా ఇంద్రుడూ, అశ్వినులూ కూడా వచ్చారు.

తరవాత చ్యవనుడు అశ్వినులకు సోమం ఇయ్యబోతే, ఇంద్రుడు వారిస్తూ, "వీళ్ళు వైద్యం చేసుకునేవాళ్ళు. సోమపానానికి అర్హులు కారు!" అన్నాడు.

"వీరికి సోమం ఇప్పించటానికనే ఈ రాజు చేత యజ్ఞం చేయించాను. నేను వీరికి సోమం ఎలా ఇస్తానో చూస్తూం డండి," అన్నాడు చ్యవనుడు, అశ్వినులకు సోమం ఇస్తూ.

ఇంద్రుడికి కోపం వచ్చింది. అతను చ్యవనుణ్ణి చంపటానికి వజ్రాయుధం ప్రయోగించాడు. చ్యవనుడు దాన్ని తన తపశ్శక్తితో ఆపి, కృత్యను సృష్టించి, ఇంద్రుణ్ణి చంపటానికి హోమం చేశాడు. భయంకరాకారంతో కృత్య అగ్నిగుండం నుంచి ఆవిర్భవించాడు. ఆ అవతారం చూసి ఇంద్రుడూ, దేవతలూ వణికిపోయారు.

బృహస్పతి ఇంద్రుడితో, "చ్యవనుడి శరణు వేడు. కృత్యను అతనే నిగ్రహించ గలడు," అన్నాడు.

ఇంద్రుడు అలాగే చేసి, ప్రాణాలతో బయటపడ్డాడు.





# దేవీ భాగవతం

ఒకప్పుడు సూర్యవంశంలో అరుణుడు అనే రాజు ఉండేవాడు. అతని కొడుకు సత్యవ్రతుడు. సత్యవ్రతుడి ప్రవర్తన అంత మంచిది కాదు. ఒకసారి అతను పెళ్ళి కాబోతున్న సమయంలో ఒక బ్రాహ్మణబాలికను ఎత్తుకుపోయాడు. ఆమె బంధువులు ఏడుస్తూ అరుణుడి వద్దకు వెళ్ళారు. వాళ్లను చూడగానే అరుణుడు తన కొడుకు ఏదో చెయ్యరాని పని చేసి ఉంటాడని ఊహించి, "నా కొడుకు తెలిసిగాని, తెలియకగాని మీకు ఏమన్నా ద్రోహం చేశాడా?" అని అడిగాడు.

"అవును, రాజా. పెళ్ళి కాబోతున్న మా పిల్లను నీ కొడుకు ఎత్తుకుపోయాడు." అన్నారు వాళ్ళు.

ఈ మాట విని రాజు మండిపడి, తన కొడుకును పిలిచి, "దుర్మార్గుడా, నీ పేరే చెరుపుకున్నావు గదరా! ఇలాటి పాపిష్టి పని ఎందుకు చేశావు? నువు క్షత్రియ పుటక పుట్టలేదా? నా కడుపుచెడబుట్టావు. ఇక్కడ వుండదగవు. ఎక్కడికైనా వెళ్ళిపో!" అన్నాడు.

సత్యవ్రతుడు జంకూ, గొంకూ లేకుండా, "ఎక్కడికి పోను?" అని ఎదురు తిరిగి అడిగాడు.

"కుక్కలను తినే వాళ్ళు కూడా చెయ్యని పని చేశావు గనక చండాలురు ఉండే చోటికి పో. నీ అపకీర్తి నేను సహించను. నీ మూలంగా వంశం కళంకమయింది!" అన్నాడు తండ్రి.

24. త్రిశంకుడి కథ



వసిష్ఠుడు అరుణుడి వైఖరిని ఎగదోశాడు. అందుచేత వసిష్ఠుడు అంటే మండిపడుతూ, సత్యవ్రతుడు విల్లంబులు తీసుకుని అరణ్యంలో ఆటవికుల మధ్య తిరగసాగాడు.

ఉన్న కొడుకును వెలివేసిన అనంతరం అరుణుడు మళ్ళీ కొడుకుల కోసం తపస్సు చేయటానికి అరణ్యానికి వెళ్లాడు.

అదేసమయంలో, అరుణుడి రాజ్యంలో అధర్మం జరిగిందని ఇంద్రుడు అక్కడ వాన కురవకుండా చేశాడు.

ఆ కాలంలోనే విశ్వామిత్రుడు తన భార్యనూ, కొడుకులనూ వదిలేసి, తపస్సు చేసుకోవటానికి కౌశికీ నదీ తీరానికి వెళ్ళాడు. ఇంతలో కరువు రావటంచేత, కొడుకులు ఆకలితో అల్లల్లాడిపోతూ, "అమ్మా, అన్నం!" అని ఏడుస్తుంటే, విశ్వామిత్రుడి భార్య అమితంగా బాధపడింది. తన దగ్గిర చిల్లిగవ్వలేదు. తన భర్త తననూ, పిల్లలనూ గాలికి వదిలేసి తపస్సు చేసుకోబోయాడు. రాజునైనా యాచింతామంటే, రాజు నగరంలో లేడు: పిల్లల కోసం ఎక్కడో తపస్సు చేస్తున్నాడు. దిక్కులేని ఆడది పిల్లలకు ఎలా ఆకలి బాధ తీర్చగలదు?

"అందరూ ఆకలితో మాడి చచ్చేకన్న, మనసు రాయిచేసుకుని ఒక పిల్లవాణ్ణి తెగనమ్మితే, నాలుగు డబ్బులు వస్తాయి. కొంత కాలం మిగిలిన వాళ్ళ ప్రాణాలు నిలుస్తాయి! ఏ తల్లికీ రాగూడని పరిస్థితి నాకు దాపురించింది!" అనుకున్నది విశ్వామిత్రుడి భార్య.

ఇలా అనుకుని ఆమె తన కొడుకులలో మధ్య వాడి మెడకు దర్భలతాడు తగిలించి, వాణ్ణి విక్రయ పశువులాగా తీసుకుని, ఇంటి నుంచి బయలుదేరింది. ఆమె కొంగుపట్టుకుని లాగుతూ, "ఎక్కడికి పోతున్నావు?" అంటూ మిగిలిన కొడుకులు వెంటపడ్డారు.

ఈ దృశ్యాన్ని చూశాడు సత్యవ్రతుడు. అతను ఆమెతో, "ఏమమ్మా, గుండె

పగిలేటట్టు ఏడుస్తున్న ఈ కుర్రాడి మెడకు తాడుకట్టి ఎక్కడికి తీసుకుపోతున్నావు? ఏం జరిగింది? నువు ఎవరు?'' అని అడిగాడు.

''విశ్వామిత్రుడు అనే మహాపురుషుడు నన్నూ, ఈ పిల్లలనూ వదిలేసి తపస్సు చేసుకోబోయాడు. బాబూ, నేను ఆ మహాత్ముడి భార్యను! డబ్బు లేదు! దిక్కు లేని దాన్ని! పిల్లలను పోషించాలి గద? అందుకని వీణ్ణి అమ్మటానికి తీసుకు పోతున్నాను.'' అన్నది విశ్వామిత్రుడి భార్య.



''ఛీ, ఛీ! ఇదేం పని, తల్లీ! నువు నీ ఆశ్రమానికి తిరిగి వెళ్లు. నీ కొడుకులు రోజూ తినటానికి ఆహారం మూటగట్టి తెచ్చి, మీ ఆశ్రమంలో చెట్టుమీద ఉంచుతాను. మాట తప్పను. కొంత కాలానికి నీ భర్త రానేవస్తాడు,'' అన్నాడు సత్యవ్రతుడు.

ఈ మాటకు ఆమె ఎంతో సంతోషించి, తన పిల్లలతో ఆశ్రమానికి తిరిగి వెళ్లింది. ఆమె కొడుకు గళానికి బంధం వేసిన కారణంగా అతనికి గాలవుడు అని పేరు వచ్చింది.

సత్యవ్రతుడు అన్నమాట తప్పకుండా, రోజూ లేళ్ళనూ, పందులనూ, ఎనుములనూ, కుందేళ్లనూ చంపి తెచ్చి, మాంసం మూటగట్టి, విశ్వామిత్రుడి ఆశ్రమంలో చెట్టుకు కట్టేవాడు. ఆ మాంసంతో పిల్లల ఆకలి తీర్చుతూ విశ్వామిత్రుడి భార్య రోజులు వెళ్ళబుచ్చుతున్నది.

అరుణుడు కొడుకుల కోసం తపస్సు చేస్తానని వెళ్లినప్పటి నుంచీ, వసిష్ఠుడు అయోధ్యలోనే ఉంటూ రాజనగరునూ, రాజభవనాన్నీ చూసుకుంటున్నాడు.

ఒక రోజు సత్యవ్రతుడికి వేటాడటానికి ఏ జంతువూ దొరకలేదు. అయితే నగరంలో వసిష్ఠుడి హోమధేనువు కనబడింది. అసలే వసిష్ఠుడంటే చాలా కోపంగా ఉన్నాడేమో సత్యవ్రతుడు




58

ఆ గోవును చంపి, దాని మాంసం తాను కొంత తిని, మిగిలినది మూటగట్టి విశ్వామిత్రుడి ఆశ్రమంలో చెట్టుమీద ఉంచాడు. అది అవు మాంసమని గుర్తించకుండా, విశ్వామిత్రుడి భార్యా, పిల్లలూ సంతోషంగా దాన్ని తినేశారు.

తన అవు చచ్చిందనీ, దాన్ని చంపిన వాడు సత్యవ్రతుడనీ వసిష్ఠుడికి తెలిసింది. ఆయన సత్యవ్రతుణ్ణి పట్టుకుని, ''ఓరీ, దుర్మార్గుడా! నిన్ను త్రిశంకు డనవచ్చు! ఎందుకంటే, ఒకసారి బ్రాహ్మణ బాలికను హరించావు, తరవాత తండ్రిచేత వెలివేయ బడ్డావు; ఇప్పుడు గోవును నిష్కారణంగా చంపావు! ఇక నుంచీ నువు త్రిశంకు డని పిలవబడుతూ, లోకులకు పిశాచాకారంలో కనబడుతూ ఉండు!'' అని శపించాడు.

అది మొదలు సత్యవ్రతుడు త్రిశంకుడై పోయి, పిశాచరూపంలో తిరుగుతూ, ఒక ముని కుమారుడి ఉపదేశం పొంది దేవిని గురించి తపస్సు చేయసాగాడు. అతను కొంతకాలం నవాక్షరీ మంత్రం జపించి, బ్రాహ్మణుల వద్దకు పోయి, ''అయ్యా, నేనిప్పుడు హోమం చెయ్యాలి. మీరు ఋత్విక్కులుగా ఉండి, నా చేత హోమం చేయించి, నన్ను కృతార్థుణ్ణి చేయండి. నా పేరు సత్యవ్రతుడు.'' అన్నాడు.

దానికి బ్రాహ్మణులు, ''నిన్ను నీకుల గురువు పిశాచం కమ్మని శపించాడు. నువు వేదోక్త కర్మలు ఎలా చేస్తావు?'' అని అతన్ని తిట్టారు.

అంతటితో అతనికి జీవితం మీద విరక్తి కలిగింది. తండ్రి తనకు రాజ్యం లేకుండా చేశాడు, కులగురువు తనను శపించాడు, ఏపని చెయ్యటానికీ పనికిరాని స్థితిలో తానున్నాడు! ఇంక బతికి ఏం ప్రయోజనం.

ఇలా అనుకుని త్రిశంకుడు ఎండు కట్టెలతో చితిపేర్చి, దానిమీద కాలి పోవటం కోసం, స్నానం చేసి, జగజ్జననిని స్మరిస్తూండగా, ఆకాశంలో దేవి

ప్రత్యక్షమై, "తొందరపడకు. నీ తండ్రి ముసలివాడయాడు. అతను నీకు రాజ్యం ఇచ్చి, నిర్విచారంగా తపస్సు చేసుకోబోతున్నాడు. నా ప్రభావం వల్ల, నీకు పట్టాభిషేకం చేయగలందులకు రేపు నీ తండ్రి మంత్రులను పంపుతాడు," అని చెప్పి అదృశ్యమయింది.

త్రిశంకుడు ఆత్మహత్యా ప్రయత్నం మానుకున్నాడు.

ఇంతలో నారదుడు అరుణుడి వద్దకు వెళ్ళి, "నీ కొడుకు జీవితం మీద రోత పుట్టి ఆత్మహత్య చేసుకోబోతున్నాడు," అని చెప్పాడు.



అరుణుడు ఈ మాట విని బాధపడి, మంత్రులను పిలిచి, "నా కొడుకు నేను పొమ్మన్నదే తడవుగా అరణ్యం పాలై పోయాడు. వాణ్ణి తెచ్చి రాజునుచెయ్యండి. నేను ఎక్కైనా పోయి తపస్సు చేసుకుంటాను," అన్నాడు.

మంత్రులు వెళ్ళి త్రిశంకుణ్ణి తెచ్చి తండ్రికి చూపారు. తన కొడుకు తల అంతా జడలు కట్టి ఉన్నది. ముఖం విచారగ్రస్తంగా ఉన్నది. అరుణుడికి పశ్చాత్తాపం కలిగింది. రాజ్యం చేయవలసిన వాడు ఇలా అయిపోయినందుకు తానే కారణమని సిగ్గుపడుతూ, అతను కొడుకును కౌగలించుకుని, రాజనీతి చెప్పి, పట్టాభిషిక్తుణ్ణి చేసి, తాను భార్యతో సహా తపస్సు చేసుకోబోయాడు. అంబను కొలిచిన కారణంగా త్రిశంకుడికి వసిష్ఠుడి శాపంకూడా పని చెయ్యకుండా పోయింది. అతను మరో ఇంద్రుడిలాగా ప్రకాశిస్తూ, రాజ్యం చేయసాగాడు.

త్రిశంకుడు రాజ్యంచేస్తూ అనేక యజ్ఞాలుచేసి, ఎంతో కీర్తి తెచ్చుకున్నాడు. అతనికి హరిశ్చంద్రుడు అనే కొడుకు కలిగాడు. ఆ హరిశ్చంద్రుడు యుక్తవయస్కుడు అయేసరికి త్రిశంకుడు, తన కొడుకుకు రాజ్యాభిషేకంచేసి, తాను బొందితో స్వర్గానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.



అందుకోసం అతను వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళి, ఆ మహామునికి నమస్కారంచేసి, ''మహాత్మా, ఈ శరీరంతోనే నాకు స్వర్గసౌఖ్యాలు అనుభవించాలనిపిస్తున్నది. అప్సరలతో తిరుగుతూ, నందనోద్యానంలో విహరిస్తూ, గాంధర్వ గానం వినాలనిపిస్తున్నది. అందుకు తగిన యజ్ఞం ఏదన్నా ఉంటే చెప్పు.'' అన్నాడు.

''అయ్యా, మానవ మాత్రులకు స్వర్గంలో ఉండే అవకాశంలేదు. యజ్ఞాలు చేసిన వాళ్ళు చచ్చి స్వర్గానికి పోవటం ఉన్నదే, కాని నీ కోరిక పొసగేదికాదు. యజ్ఞం చేసినందువల్ల వచ్చే శరీరంతో అప్సరలతో సుఖించవచ్చు. బొందితో నిన్ను స్వర్గానికి పంపేశక్తి నాకు లేదు.'' అన్నాడు వసిష్ఠుడు, వెనకటి కోపాన్ని మరిచిపోకుండా.

దానికి త్రిశంకుడు, ''సరే, నీకు అంత గర్వమైతే, నాకు కావలసిన యజ్ఞాన్ని నేను ఇంకొక పురోహితుడి చేత చేయించుకుంటాను,'' అన్నాడు.

వసిష్ఠుడు ఈ మాటకు మండిపడి, ''దుర్మార్గుడా! నాకు కోపం తెప్పిస్తావా? నీలాగా గోవధ చేసి, బ్రాహ్మణ కన్యను అపహరించిన వాడికి ఇంకో శరీరం ధరించినా స్వర్గం లభించదు! నువు మళ్ళీ చండాలుడివైపో!'' అని శపించాడు.

వెంటనే త్రిశంకుడికి చండాలుడి రూపు వచ్చేసింది. ఆ రూపంతో అతనికి ఇంటికి పో బుద్ధి పుట్టలేదు. భార్య ఎంత పతివ్రత అయినా చండాలుడుగా మారిన భర్తను సహించదు. మంత్రులూ, బంధువులూ కూడా దగ్గిర చేరనియ్యరు. ఇలా బతికేకన్న చావునయం. నిప్పుతోనో, విషంతోనో ఆత్మహత్య చేసుకుంటే, మళ్ళీ వచ్చే జన్మలో కూడా దుఃఖమే వెంటాడుతుంది. అందుచేత ఈ దేహం ఉన్నంత కాలమూ చండాలుడుగానే బతికి కర్మ అనుభవించటం మంచిది అనుకుని, అతను గంగాతీరం చేరి, అక్కడ అరణ్యంలో నివసించసాగాడు.

తన తండ్రికి కలిగిన దుర్గతి హరిశ్చంద్రుడికి తెలిసింది. అతను గంగా తీరానికి తన మంత్రులను పంపాడు. వాళ్లు త్రిశంకుణ్ణి కలుసుకుని, ''మహాత్మా, నీ కొడుకు నిన్ను తీసుకు రమ్మన్నాడు. నువు వచ్చి, వెనకటిలాగే రాజ్యం చెయ్యి. వసిష్ఠుణ్ణి ఎలాగో ఒకలాగ మంచి చేసుకోవచ్చు,'' అన్నారు.

''నేను ఈ అవతారంతో నగరానికి రాను. మీరు వెళ్ళి, నా కొడుకునే రాజ్యం చెయ్యమన్నానని చెప్పండి,'' అన్నాడు త్రిశంకుడు.

మంత్రులు వచ్చి త్రిశంకుడి ఆజ్ఞ తెలపగానే హరిశ్చంద్రుడు రాజ్యాభిషేకం చేసుకుని, పరిపాలన ఆరంభించాడు.

తరవాత త్రిశంకుడు జగన్మాతను ధ్యానిస్తూ గంగాతీరాన తపస్సులో కాలం గడుపుతూండగా, విశ్వామిత్రుడు తన తపస్సు పూర్తిచేసి, తన భార్యనూ, బిడ్డలనూ చూసుకోవటానికి ఆశ్రమానికి వచ్చాడు.

కరువు సంగతి విశ్వామిత్రుడికి తెలుసు. ఆ కరువుకు తన భార్యా, పిల్లలూ ఏమయారో ఆయన ఎరగడు గాని, తాను మాత్రం ఆకలికి తట్టుకోలేక, ఒక చండాలుడి ఇంట ప్రవేశించి, ఆహారం కోసం అతడి కుండలో చెయ్యిపెట్టి, దొంగతనం



చేస్తూ దొరికిపోయాడు. అప్పుడాయన చండాలుడితో తాను తపస్వినని, ఆకలి బాధకు తట్టుకోలేక దొంగతనానికి పాల్పడ్డాననీ చెప్పుకుని, తన ప్రాణం నిలబెట్టుకున్నాడు.

''అయ్యా, ఇది కుక్కమాంసం. నువు ఎలా తింటావు?'' అని చండాలుడు విశ్వామిత్రుణ్ణి అడిగాడు.

''ఆకలి ధర్మం ఎరగదు. కుక్క మాంసమని నాకు తెలుసు. నేను దాన్ని తినటం పాపమైతే, ఆ పాపం వాన దేవుడిది!'' అన్నాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు ఇలా అనగానే ఏనుగు తొండాలంత ధారలతో వాన కురిసింది.

విశ్వామిత్రుడు బయలుదేరి ఇంటికి వచ్చాడు. భర్త అడిగిన మీదట భార్య తమను త్రిశంకుడు ఎలా ఆదుకున్నాడో చెప్పింది. త్రిశంకుడు వసిష్ఠుడి గోవును చంపినది కూడా తమకోసమేననీ, దాని ఫలితంగా అతను శాపగ్రస్తుడయాడనీ ఆమె చెప్పేసరికి, విశ్వామిత్రుడు అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, ''రాజా, నువు నా భార్యకూ, బిడ్డలకూ ఉపకారం చేశావు. నీకు ప్రత్యుపకారం చేస్తాను,'' అన్నాడు.

త్రిశంకుడు వసిష్ఠుణ్ణి అడిగినట్టే తనను బొందితో స్వర్గానికి పంపమని విశ్వామిత్రుణ్ణి అడిగాడు. వసిష్ఠుడి శాపం పోగొట్టటానికి విశ్వామిత్రుడు యజ్ఞం చేయింతామనుకున్నాడుగాని వసిష్ఠుడు మునులను యజ్ఞానికి పోనివ్వలేదు. యజ్ఞం సాధ్యంకాలేదు.

అప్పుడు విశ్వామిత్రుడు తన తపశ్శక్తి అంతా త్రిశంకుడికి ధారపోసి, ''ఇక నువు స్వర్గానికి వెళ్లిపో. నిన్ను ఎవడూ ఆపలేడు!'' అన్నాడు.

విశ్వామిత్రుడు తనకు ధారపోసిన తపశ్శక్తితో త్రిశంకుడు పక్షిలాగా ఎగురుతూ స్వర్గం కేసి వెళ్ళాడు.

చండాలుడి ఆకారంలో ఒక మనిషి స్వర్గం కేసి వస్తూ ఉండటం చూసి, దేవతలు ఇంద్రుడితో ఆ మాట చెప్పారు. ఇంద్రుడు వెళ్ళి, ''చండాలుడివి! స్వర్గానికి ఎలా వస్తావు?'' అని త్రిశంకుణ్ణి తోసేశాడు.

త్రిశంకుడు తిరిగి భూమి మీదపడుతూ, ''దేవతలు నన్ను స్వర్గం నుంచి తోసేస్తున్నారు!'' అని అరిచాడు.

వెంటనే విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో త్రిశంకుణ్ణి దారిలో ఆపి, కింద పడకుండా చేశాడు. అంతేగాక ఆయన త్రిశంకుడి కోసం మరో స్వర్గాన్ని సృష్టి చేశాడు. ఈ సంగతి తెలిసి ఇంద్రుడు విశ్వామిత్రుడితో కొత్తసృష్టి చేయవద్దని చెప్పి, త్రిశంకుడికి కొత్త శరీరం ఇచ్చి, తన వెంట తిన్నగా స్వర్గానికే తీసుకుపోయాడు.





# దేవీ భాగవతం

విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి స్వర్గానికి పంపేసిన అనంతరం త్రిశంకుడి కొడుకు హరిశ్చంద్రుడు రాజ్యంచేయ నారంభించాడు. అయితే అతనికి సంతానం కలగలేదు. అతడు తన పురోహితుడైన వసిష్ఠుడితో, "మహాత్మా, నువు దైవజ్ఞుడివీ, మంత్రవేత్తవూనూ. అందుచేత, నాకు సంతానం కలగని కారణం ఏమిటో ఆలోచించి చెప్పు. అందుకు కారణం నా ప్రారబ్ధం కాదుగద?" అని దీనంగా అన్నాడు.

"సంతానం లేకపోవటం కన్న గొప్ప దుఃఖం లేని మాట నిజమే. వరుణుడు సంతాన కారకుడుగా ప్రసిద్ధికెక్కిన వాడు. అందుచేత ఆ వరుణుణ్ణి పూజించి సులభంగా సంతానం పొందవచ్చు. మనుష్యయత్నం లేకుండా దైవం అనుకూలించలేదు గదా!" అన్నాడు వసిష్ఠుడు.

ఆ మాటమీద హరిశ్చంద్రుడు గంగా తీరాన ఘోర తపస్సు చేశాడు. ఆ తపస్సుకు వరుణుడు సంతోషించి ప్రత్యక్షమై, ఏమి వరం కావాలని హరిశ్చంద్రుణ్ణి అడిగాడు.

హరిశ్చంద్రుడు తన్మయత్వం చెందుతూ, ఒక కొడుకును ప్రసాదించి, తనకు సంతాన హీనత్వం పోగొట్టమన్నాడు.

"చక్కని కొడుకును, సద్గుణశీలుణ్ణి ఇస్తాను. కాని వాణ్ణి నువు నాకు బలి పశువుగా ఇయ్యవలసి వుంటుంది." అన్నాడు వరుణుడు చిరునవ్వుతో.

25. హరిశ్చంద్రుడి కథ



హరిశ్చంద్రుడికి చెంపపెట్టు తగిలినట్టయింది. కాని ఏమీ చెయ్యలేక, "గొడ్డుమోతు అనిపించుకునే కన్న అదీ కొంత నయమే! మీరు కోరినట్టే చేస్తాను. కొడుకును ప్రసాదించండి!" అన్నాడు.

"తప్పకుండా కొడుకు కలుగుతాడు. ఇంటికి వెళ్ళు!" అన్నాడు వరుణుడు.

హరిశ్చంద్రుడు ఇంటికి తిరిగివచ్చి, తన పట్టమహిషి అయిన శైబ్యతో జరిగిన సంగతి చెప్పాడు. ఆమె కూడా సంతోషించింది.

తరువాత ఆమె గర్భాన పది నెలలకు మన్మధుడి లాటి కొడుకు పుట్టాడు. హరిశ్చంద్రుడు తన కొడుక్కు రోహితుడని పేరు పెట్టి జాతకర్మ చేయించి, బ్రహ్మాండమైన ఉత్సవం ఏర్పాటు చేశాడు. దానికి వరుణుడు ఒక బ్రాహ్మడి రూపంలో వచ్చి, స్వస్తి వచనం చెబుతూ తాను ఎవరైనదీ బయటపెట్టి, "నేనిచ్చిన వరంతో నీకు సంతాన హీనత అనే దోషం పోయింది. కాబట్టి, చిత్తశుద్ధితో నీ కొడుకును యజ్ఞపశువును చేసి నాకు బలిపెట్టు!" అన్నాడు.

హరిశ్చంద్రుడికి పుట్టెడు దిగులు పట్టుకున్నది. లేకలేక కలిగిన చంటివాణ్ణి వరుణుడికి ఎలా బలి ఇయ్యటం? వరుణుడు ఒకంత వదలడు. దేవతలతో కూడిన పని! చేతులారా కొడుకును చంపుకుంటే ఆ శోకం జీవితాంతమూ పోయేదికాదు.

ఇలా అనుకుని హరిశ్చంద్రుడు కొంత ధైర్యం కూడగట్టుకుని, వరుణుణ్ణి వినయంగా, "దేవా, తండ్రికి పురిటిమైల పదిరోజులూ, తల్లికి నెలరోజులూ వుంటుంది గదా? ఈ లోపల మేం యజ్ఞదీక్ష పూనేది ఎలా?" అని అడిగాడు.

"అలా అయితే నెలదాటగానే వస్తాను," అని చెప్పి వరుణుడు వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడికి పోయిన ప్రాణం వచ్చినట్టయింది. అతను బ్రాహ్మణులకు

గోవులూ, నువ్వులూ, బంగారమూ దానం చేసి, కొడుకును చూసుకుని మురిసి పోయాడు.

మాసం గడిచింది. వరుణుడు మళ్ళీ బ్రాహ్మణవేషంలో వచ్చి యజ్ఞం చెయ్యమన్నాడు.

హరిశ్చంద్రుడు బరువెక్కిన గుండెతో వరుణుడికి నమస్కారం చేసి "తమరి రాక వల్ల నా యిల్లు పావనమయింది. పిల్లవాణ్ణి యజ్ఞపశువుగా ఎలా చెయ్యటం? దంతాలు రాని పశువు బలికి పనికిరాదు గదా?" అన్నాడు.

"సరే, పిల్లవాడికి దంతాలు రాగానే నాకు బలిపెట్టు!" అని వరుణుడు వెళ్ళిపోయాడు.

కొంతకాలం గడిచినాక పిల్లవాడికి పళ్ళు కనిపించాయి. వరుణుడు వచ్చి, యజ్ఞం చెయ్యమని కూర్చున్నాడు. హరిశ్చంద్రుడు వరుణుడికి సమస్త మర్యాదలూ చేసి, "తమకు తెలియనిదేమున్నది? చౌలమూ, పుట్టు వెంట్రుకలు తీయటమూ జరగని కుర్రవాడు యజ్ఞపశువుగా పనికిరాడని పెద్దలు చెబుతారు. ఆ రెండూ కాగానే తమకు కుర్రవాణ్ణి బలి ఇస్తాను!" అన్నాడు హరిశ్చంద్రుడు.

"నువు కొడుకు మీది మమకారంతో నోటికి వచ్చినట్టు అబద్ధాలాడుతూ, నన్ను తెగ తిప్పుతున్నావు. నువు కపటివి. పుట్టు వెంట్రుకలు తీయగానే కుర్రవాణ్ణి





నాకు బలి యియ్యకపోయావో, నిశ్చయంగా నీకు ఘోరమైన శాపం యిస్తాను. మహాత్ముడైన ఇక్ష్వాకుడి వంశాన పుట్టి, మాట నిలబెట్టుకోలేక పోయాడన్న అపకీర్తి తెచ్చుకోకు! వస్తా!'' అంటూ వరుణుడు వెళ్ళిపోయాడు.

మరికొంత కాలం గడిచింది. రోహితుడికి పుట్టు వెంట్రుకలు తీసే వయసు వచ్చింది. హరిశ్చంద్రుడూ, భార్యా, తొడమీద కూర్చుని కుర్రవాడూ చూడాకరణం వేడుకలో ఉండగా వరుణుడు వచ్చి, ''రాజా, పిల్లవాడికి పుట్టువెంట్రుకలు తీయిస్తున్నావు గద! ఆలస్యం దేనికి? యజ్ఞం ప్రారంభించు,'' అన్నాడు.

హరిశ్చంద్రుడు తడువుకోకుండా, ''ఆ మాట నాకు గుర్తులేక పోలేదు. కాని ఈ పిల్లవాడు యాగపశువుగా పనికిరాడు. ఉపనయనం జరిగితే గాని వీడికి ద్విజత్వం రాదు. అంతదాకా వీడు నాలుగో వర్ణం వాడి కిందనే లెక్క, కర్మ బాహ్యుడు,'' అన్నాడు.

బ్రాహ్మడికి ఎనిమిదేళ్ళకూ, క్షత్రియుడికి పదకొండేళ్ళకూ, వైశ్యుడికి పన్నెండేళ్ళకూ ఉపనయనం జరగాలని శాస్త్రాలు నిర్ణయించాయి గనక, పదకొండో ఏట రోహితుడికి ఉపనయనం జరిపించి, శాస్త్రోక్తంగా యజ్ఞం చేసి, అందులో వాణ్ణి బలిపశువును చేసి ఇచ్చుకుంటాననీ, ఇప్పటికి వెళ్ళిరమ్మనీ హరిశ్చంద్రుడు వరుణుడితో అన్నాడు.

వరుణుడు ఈ మాటకు తృప్తిపడి వెళ్ళిపోయాడు. తరవాత హరిశ్చంద్రుడు తన కొడుకును చూసుకుని అనందిస్తూ కాలం వెళ్ళబుచ్చాడు.

కాలక్రమాన కుర్రవాడికి పదేళ్ళు నిండి, పదకొండవ ఏడు ప్రవేశించింది. హరిశ్చంద్రుడు గుండె పీచుపీచుమంటూ, వాడికి శాస్త్రోక్తంగా ఉపనయనం జరిపించాడు.

వరుణుడు వచ్చి యజ్ఞం చెయ్యమని కూర్చున్నాడు.

"యజ్ఞం చెయ్యవలసినదే. నేను కాదనను. కాని కుర్రవాడు ఇప్పుడే వేద విద్య ఆరంభించాడు. నన్ను అనుగ్ర హించి, వాడి విద్యాభ్యాసం పూర్తి కానియ్యండి. వాణ్ణి మీకు అవశ్యం బలి ఇస్తాను!" అని హరిశ్చంద్రుడు ప్రాధేయ పడ్డాడు. వరుణుడికి కోపం వచ్చింది.

"నీ నక్క వినయాలతో జాప్యం చేస్తూ వస్తున్నావు. కొడుకు మీది మమకారం తెంచుకోలేక నన్ను ఇలా చేస్తావా? అయినా నీ మాట నమ్మి ఈ సారికి వెళు తున్నాను. నీ కొడుకు వేదవిద్య ముగియ గానే వస్తాను," అని వరుణుడు వెళ్ళి పోయాడు.



కొంతకాలం గడిచింది. "వరుణుడు వచ్చి కూర్చుంటాడు కాబోలురా, దేవుడా!" అని పుట్టెడు దిగులులో మునిగి పోయిన హరిశ్చంద్రుణ్ణి చూసి రోహితుడు, "ఎందుకలా విచారంగా వున్నావు?" అని తండ్రిని అడిగి, కారణం తెలుసుకున్నాడు.

రోహితుడికి ప్రాణభయం పట్టు కున్నది. వాడు మంత్రి కొడుకుల సలహా మీద అరణ్యంలోకి పారిపోయాడు. వరు ణుడు వచ్చి ఏమంటాడోనన్న భయంతో హరిశ్చంద్రుడు వాడికోసం వెతికించాడు. కాని రోహితుడి జాడ తెలియలేదు.

ఇంతలో, యజ్ఞం చెయ్యమంటూ వరుణుడు రానేవచ్చాడు.

హరిశ్చంద్రుడు భయంతో కంపించి పోతూ వరుణుడికి మొక్కి, "నా కొడుకు చావుకు భయపడి పారిపోయాడు. నేనేం చెయ్యను? వాడికోసం అడవులూ, కొండలూ, పల్లెలూ వెతికించాను. లాభం లేకపోయింది. తమరు ఏం చెయ్యమంటే అది చేస్తాను. చివరకు దోషిని నేనే అయాను," అన్నాడు.

"నన్ను ఇంత మోసం చేస్తావా? జలోదరంతో తీసుకో!" అంటూ హరిశ్చంద్రుణ్ణి శపించి, వరుణుడు వెళ్ళి పోయాడు.



మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు, హరిశ్చంద్రుడు కొడుకు జాడ తెలియక పోవటంతో బాటు వరుణుడి శాపం తగిలి బాధపడసాగాడు.

ఒక సంవత్సరం గడిచాక, రోహితుడికి తండ్రి రోగం గురించి తెలిసి ఇంటికి పోబోతుండగా, ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి, వాణ్ణి ఆపి, ''ఎందుకు పోతావు? నీ తండ్రి తన రోగం నయం కావటం కోసం యజ్ఞం చేసి, నిన్ను వరుణుడికి బలి ఇస్తాడు. నీ తండ్రి చచ్చిపోయిన దాకా ఆగి తరవాత వెళ్ళి నిశ్చింతగా రాజ్యం ఏలుకో,'' అని సలహా ఇచ్చాడు.

మరొక సంవత్సరం గడిచింది. తన తండ్రి జబ్బుతో చాలా బాధపడుతున్నట్టు తెలిసి, రోహితుడు చావటానికి కూడా సిద్ధపడి మరొకసారి ఇంటికి బయలుదేరాడు. కాని ఈ సారి కూడా ఇంద్రుడు అతన్ని పోవద్దన్నాడు.

హరిశ్చంద్రుడు మాత్రం జలోదర వ్యాధి బాధ భరించలేక, దానికేదన్నా ఉపాయం చూడమని వసిష్ఠుణ్ణి అడిగాడు.

''వరుణుడు బలికోరేది నీ కొడుకును గదా? కొడుకులు పది రకాలున్నారు. అందులో కొనుక్కున్నవాడు కూడా ఒక రకం కొడుకే. అందుకని ఎవడినన్నా కొడుకుగా కొనుక్కుని, వరుణుడికి వాణ్ణి బలిపెట్టి, శాపం నుంచి విముక్తి పొందు,'' అని వసిష్ఠుడు సలహా ఇచ్చాడు.

హరిశ్చంద్రుడు సరేనని, తన కోసం ఒక కొడుకును కొనుక్కురమ్మని తన మంత్రిని పంపాడు. ఆ మంత్రి వెతకగా, వెతకగా కటిక దరిద్రుడైన అజీగర్తుడు అనే బ్రాహ్మణుడు తగిలాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు, శునఃపుచ్ఛుడూ, శునశ్శేఫుడూ, శునోలాంగూలుడూ అనే వాళ్ళు.

అజీగర్తుడితో హరిశ్చంద్రుడి మంత్రి, ''అయ్యా, మా రాజు రోగవిముక్తుడు

కావటానికి నరమేధం చేయ తలపెట్టాడు. బలిపశువుగా నీ కొడుకులలో ఒక్కణ్ణి నూరు గోవులకు అమ్ముతావా?'' అని అడిగాడు.

కటిక దరిద్రుడైన అజీగర్తుడు ఈ మాటకు పరమానందం చెంది, తన పెద్ద కొడుకును తప్ప మిగిలిన ఇద్దరిలో ఎవరినైనా అమ్మటానికి సిద్ధపడ్డాడు. మూడో వాణ్ణి తల్లి ఇయ్యనన్నది. అందుచేత ఆ బ్రాహ్మణుడు తన రెండో కొడుకైన శునశ్శేపుణ్ణి హరిశ్చంద్రుడి మంత్రికి అమ్మాడు. మంత్రి వాణ్ణి తీసుకుపోయి హరిశ్చంద్రుడికి ఇచ్చాడు.

శునశ్శేపుణ్ణి యజ్ఞపశువును చేసి యూపస్తంభానికి కట్టారు. రాజు యాగదీక్ష పూనాడు. ఇది చూసి మునులందరూ చాలా నొచ్చుకున్నారు. శునశ్శేపుడు తనకు రానున్న చావు తలచుకుని తెగ ఏడుస్తున్నాడు.

కుర్రవాణ్ణి వధించవలసినవాడు జాలిపడి, వాణ్ణి తాను చంపలేనంటూ దూరంగాపోయాడు.

హరిశ్చంద్రుడు సదస్యులను చూసి, ''ఇప్పుడు ఏం చెయ్యాలి?'' అని అడిగాడు. సభలో కలకలం బయలుదేరింది. శునశ్శేపుడు గుండెలు తరుగుకు పోయేటట్టు ఏడుస్తున్నాడు.

అంతలో సభాసదుల మధ్యనుంచి అజీగర్తుడు చివాలున లేచి, ''రాజా, ఈ బలిపశువును నేను వధిస్తాను. నాకు



ముందిచ్చిన దానికన్న రెట్టింపు గోవులు ఇస్తావా ?'' అని అడిగాడు.

హరిశ్చంద్రుడు సరేనన్నాడు. సభలో హాహాకారాలు చెలరేగాయి.

''వీడు బ్రాహ్మణుడు కాడు, పిశాచం! లాభంకొద్దీ కొడుకును హత్యచేయ సిద్ధపడిన మహా పాపి!'' అంటూ అజీగర్తుణ్ణి అందరూ తిట్టిపోశారు.

ఇంతలో విశ్వామిత్రుడు అక్కడికి వచ్చి, శునశ్శేపుణ్ణి చూసి జాలిపడి, ''హరిశ్చంద్రా, ఈ పాపిష్ఠి యజ్ఞం మాను. నీ ప్రాణం నీకు ఎంత తీపో, వీడికి వీడి ప్రాణం అంత తీపి కాదా? శాపం పొందిన నీ తండ్రిని నేను స్వర్గానికి పంపాను. అందుకైనా ఈ బ్రాహ్మణ పుత్రుణ్ణి విడిచిపెట్టు!'' అన్నాడు.

''అయ్యా, జలోదరం బాధ భరించలేకుండా ఉన్నాను. దయచేసి యాగభంగం చెయ్యకండి. నేనీ కుర్రవాణ్ణి యజ్ఞపశువుగా కొనుక్కున్నాను.'' అన్నాడు హరిశ్చంద్రుడు.

విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. అతను శునశ్శేపుణ్ణి సమీపించి, ''ఈ రాజు నిన్నేం చెయ్యగలడు? నేను నీకొక మంత్రం చెబుతాను. దానితో నీకు సుఖం కలుగుతుంది!'' అన్నాడు.

విశ్వామిత్రుడు చెప్పిన మంత్రాన్ని శునశ్శేపుడు జపించే సరికి, వరుణుడు ప్రత్యక్షమై, శునశ్శేపుణ్ణి విడిపించి, యజ్ఞం ముగిసినట్టు ప్రకటించి, హరిశ్చంద్రుడికి వ్యాధి పోగొట్టాడు.

శునశ్శేపుడు సభకు నమస్కారంచేసి, ''అయ్యలారా, ఇప్పుడు నా తండ్రి ఎవరో మీరు నిర్ణయిస్తే, నేను ఆయన వెంట పోతాను.'' అన్నాడు.

కొందరు శునశ్శేపుడి తండ్రి హరిశ్చంద్రుడనీ, కొందరు అజీగర్తుడేననీ, మరికొందరు వరుణుడనీ, రకరకాలుగా చెప్పారు.

వసిష్ఠుడు మాత్రం విశ్వామిత్రుడే శునశ్శేపుడి తండ్రి అన్నాడు. ఆ కుర్రవాడు విశ్వామిత్రుడి వెంట వెళ్ళిపోయాడు.






హరిశ్చంద్రుడు తలపెట్టిన నరమేధం విశ్వామిత్రుడి ధర్మమా అంటూ సుఖాంతం అయినాక, ఒకనాడు ఇంద్రుణ్ణి చూడటానికి ఇంద్రసభకు వసిష్ఠ, విశ్వామిత్రులిద్దరూ వచ్చారు. వసిష్ఠుడి వంటి మీద అనేక బహుమానాలుండటం చూసి విశ్వామిత్రుడు ఆశ్చర్యంతో, "ఎవరు నిన్ను ఇంతగా సన్మానించారు?" అని అడిగాడు.

వసిష్ఠుడు గర్వంతోకూడిన సంతోషంతో, "చంద్రుడి లాంటి సత్యహరిశ్చంద్రుడు మా శిష్యుడేగా! అతనికి సరి వచ్చే రాజులు ఎవరున్నారు గనక? రాజసూయ యాగం చేసి, అంతులేని దక్షిణలిస్తూ, నన్ను సత్కరించాడు! నిజం చెప్పటంలో గాని, దాతృత్వంలో గాని, శౌర్యంలో గాని, ధర్మాచరణలో గాని ఏ యుగంలోనూ, పద్నాలుగు లోకాలలోనూ హరిశ్చంద్రుడితో పోలగల రాజు లేడు," అంటూ హరిశ్చంద్రుణ్ణి తెగ పొగిడాడు.

వసిష్ఠుడు హరిశ్చంద్రుణ్ణి ఆకాశానికెత్తటం చూసి విశ్వామిత్రుడికి మండుకొచ్చి, "వట్టి అబద్ధాల కోరునూ, కపటినీ ఇంత గొప్ప చేసి చెబుతావేమిటి? ఈ హరిశ్చంద్రుడు వరుణుణ్ణి మోసగించలేదూ? ఈ కబుర్లకేం? పందెం ఒడ్డి నిరూపిస్తాను, హరిశ్చంద్రుడు అసత్యవాది, దుర్మార్గుడు, దాత కాడు! అలా నిరూపించలేకపోతే నా పుణ్యమంతా

**26. హరిశ్చంద్రుడి కష్టాలు**



నశించిపోవాలి ; నిరూపిస్తే నీ పుణ్యం నశించటానికి ఒప్పుకుంటావా?'' అన్నాడు.

ఇద్దరిమధ్యా మాటా, మాటా పెరిగింది. పంతం కొద్దీ ఇద్దరూ పందెం ఒప్పుకుని, తమతమ ఆశ్రమాలకు తిరిగివచ్చారు.

ఒకనాడు హరిశ్చంద్రుడు అరణ్యంలో తిరుగుతూ ఒక స్త్రీని చూశాడు. ఆమె ఘోరంగా ఏడుస్తున్నది. ఆమెను చూసి జాలిపడి హరిశ్చంద్రుడు, ''ఈ భయంకర మైన అరణ్యంలో నువు ఒంటరిగా ఎందుకున్నావు? నీ భర్త ఎవరు? నా రాజ్యంలో క్రూరులూ, రాక్షసులూ లేరు. నీకు దుఃఖం కలిగించిన వాడెవడో చెబితే వాడి అంతు చూస్తాను,'' అన్నాడు.

హరిశ్చంద్రుడు అడిగిన దానికి ఆ స్త్రీ ఇలా జవాబు చెప్పింది :

''రాజా, విశ్వామిత్రుడు అనే ముని నా కోసం తపస్సు చేస్తూ నన్ను బాధ పెట్టుతున్నాడు.''

ఆ మాట విని హరిశ్చంద్రుడు, ''నువు విచారించకు. నిన్ను తన తపస్సుతో బాధ పెట్టుతున్న ఆ విశ్వామిత్రుడి చేత తపస్సు మాన్పిస్తాను,'' అని ఆమెకు మాట ఇచ్చి విశ్వామిత్రుడి ఆశ్రమానికి వెళ్ళి, ఆయనతో, ''మహామునీ, ఎందుకు తపస్సు చేసి, దేహపీడకు గురి అవుతావు? నేను రాజ్యం చేస్తూండగా, పాపబుద్ధితో లోకపీడ కోసం ఇలా తపస్సు చెయ్యటానికి వీలులేదు. ఈ పని మాను! ఇందువల్ల పుణ్యమా? పురుషార్థమా?'' అన్నాడు.

విశ్వామిత్రుడు ఆ ప్రదేశం విడిచి ఇంకెక్కడికో వెళ్ళిపోయాడు. అదివరకు వసిష్ఠుడితో తాను ఘర్షనపడిన మీదట ఇప్పుడు హరిశ్చంద్రుడు తన తపస్సు నిలుపు చెయ్యటంతో విశ్వామిత్రుడి ఆగ్రహం మిన్ను ముట్టింది. ఆయన హరిశ్చంద్రుణ్ణి మోసం చెయ్య నిశ్చయించి, ఒక రాక్షసుణ్ణి పంది రూపంలో పంపకం చేశాడు. అది హరిశ్చంద్రుడి ఉపవనంలో వచ్చిపడి అక్కడి భటులను అడలగొట్టి, పూలమొక్కలన్నిటినీ



ధ్వంసం చేసింది. మాలలు కట్టేవాళ్ళు దాన్ని బాణాలతో కొట్టినా అది చలించలేదు. అది మామూలు పంది కాదని తెలుసుకుని, వాళ్ళు పారిపోయి రాజుతో మొరపెట్టుకున్నారు.

హరిశ్చంద్రుడు గుర్రం ఎక్కి, కొందరు సైనికులను వెంట బెట్టుకుని, ఉపవనానికి వెళ్ళి, దూరంగా గుర్రు గుర్రు మంటున్న పందినీ, అది ధ్వంసం చేసిన పూలమొక్కలనూ చూసి, కోపం ఆపుకోలేక, దాని మీద బాణాలు కురిపించాడు. అది చావకపోగా, కనబడుతూ, అదృశ్యమవుతూ, హరిశ్చంద్రుణ్ణి నానా తిప్పలూ పెట్టింది. చివరకు అది అరణ్యంలోకి పారిపోతుంటే, హరిశ్చంద్రుడు దాన్ని వెంటతరిమాడు.

పోగా, పోగా అరణ్యమధ్యంలో ఒక సెలయేరు తగిలింది. అడవిపంది జాడ లేదు. హరిశ్చంద్రుడు తన గుర్రాన్ని నీరు తాగించి, తాను తాగి, తిరిగి పోవటానికి దారి ఏదా అని ఆలోచిస్తూండగా, విశ్వామిత్రుడు అక్కడికి వృద్ధబ్రాహ్మడి రూపంలో వచ్చాడు. హరిశ్చంద్రుడు నమస్కరించగా విశ్వామిత్రుడు దీవించి, ''రాజువు గదా, నిర్జనమైన ఈ ప్రదేశానికి ఒంటరిగా ఎందుకు రావలసి వచ్చింది?'' అని అడిగాడు.

హరిశ్చంద్రుడు వృద్ధబ్రాహ్మణ రూపంలో ఉన్న విశ్వామిత్రుడికి, పంది విషయమంతా చెప్పి, ''తిరిగి పోవటం ఎలాగో తెలియటం లేదు. దయచేసి దారి చెప్పండి!'' అని అడిగాడు.

దానికి విశ్వామిత్రుడు, ''రాజా, ఇది ఒక పుణ్యతీర్థం. ఇందులో స్నానం చేసి, పితృదేవతలకు తర్పణాలు వదిలి, శక్తి కొద్దీ దానధర్మాలు చెయ్యాలి. నీకు తోచినది నాకు దానం ఇచ్చావంటే, నీకు దారి చూపుతాను!'' అన్నాడు.

దానికి హరిశ్చంద్రుడు ఇలా అన్నాడు: ''స్వామీ, నువు ఏది కోరితే అది దానం ఇస్తాను. ఏం కావాలి? బంగారమా,



గుర్రాలా, భూఖండమా, ధనమా? ఇంతకు పూర్వం రాజసూయం చేసినప్పుడు, మునుల సమక్షంలో, ఎవరేది కోరినా ఇస్తానని దీక్షపట్టాను. నువా మహా పురుషుడివి! ఈ తీర్థమా పవిత్రమైనది. నువు ఏది కోరినా ఇయ్యవచ్చు."

"రాజా, నువు అంత గొప్పవాడివే! సూర్యవంశంలో త్రిశంకుడి కొడుకువై పుట్టిన నిన్ను గురించి నీ అంతటి వాడు లేడని వసిష్ఠుడు కూడా అనగా విన్నాను. అతను అబద్ధమాడతాడా? నువు మహా దాతవు, భూమికంతటికి రాజువు. నా కొడుకు వివాహం జరిపించు," అన్నాడు విశ్వామిత్రుడు.

ఆయన మాయతో ఒక పదేళ్ళపిల్లనూ, ఒక యువకుణ్ణీ సృష్టించి తెచ్చి, "వీళ్ళే పెళ్ళి కావలసిన వధూవరులు. వీళ్ళకు పెళ్ళి చేస్తే రాజసూయ యాగం చేసిన దానికన్న ఎక్కువ పుణ్యం!" అన్నాడు.

హరిశ్చంద్రుడు సరేనని ఒప్పుకుని, ఆ ముసలిబ్రాహ్మడి రూపంలో ఉన్న విశ్వామిత్రుడు చూపించిన దారిన తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

విశ్వామిత్రుడు తన ఆశ్రమానికి వచ్చి, ఆ వధూవరులకు పెళ్ళిచేసి, హరిశ్చంద్రుణ్ణి చూడబోయే సరికి అతను అగ్ని గృహంలో ఉన్నాడు.

"మంచి సమయానికే వచ్చాను. నాకు ఇస్తానన్న దానం ఇచ్చెయ్యి," అన్నాడు వృద్ధబ్రాహ్మణ వేషంలో ఉన్న విశ్వామిత్రుడు.

"నువు ఏది కోరుకుంటే అదంతా ఇస్తాను. నీ కోరిక చెప్పు," అన్నాడు హరిశ్చంద్రుడు.

"నీకు ఎదురుగా ఉన్న అగ్నిహోత్రుడు సాక్షిగా నీ రాజ్యం యావత్తూ ఏనుగులూ, గుర్రాలూ, మొదలైన సమస్త సంపదలతోనూ, నాకు ఇచ్చెయ్యి!" అన్నాడు విశ్వామిత్రుడు.

హరిశ్చంద్రుడు ముందూ, వెనకా ఆలోచించకుండా, "ఇచ్చాను," అన్నాడు.

అప్పుడు విశ్వామిత్రుడు, ''దక్షిణలేని దానం వృథా! అందుచేత ఈ దానానికి తగిన దక్షిణ కూడా ఇచ్చి, కృతార్థుడి వికా!' అన్నాడు.

''ఆ దక్షిణ ఎంత ఉంటుంది?'' అని హరిశ్చంద్రుడు అడిగాడు.

''రెండు బారువల బంగారం దక్షిణగా ఇయ్యి,'' అన్నాడు విశ్వామిత్రుడు.

''అలాగే ఇస్తాను,'' అని హరిశ్చంద్రుడు మాట ఇచ్చాడు.

విశ్వామిత్రుడి కపటం చూసి హరిశ్చంద్రుడికి ఆశ్చర్యం కలిగింది. రాజ్యం ఇచ్చిన తరవాత దక్షిణ కూడా కావాలని ఆయన అంటే అమాయకంగా ఇస్తానన్నాడు. ఉన్నదంతా దానం చేసినాక రెండు బారువల బంగారం ఎక్కడి నుంచి తెచ్చేటట్టు? కాలవైపరీత్యం కాకపోతే, తపస్సు చేసుకునేవాళ్ళు ఎక్కడైనా ధనలోభంతో యితరులను, ఇలా మోసగిస్తారా?

ఈ విధంగా చింతలో మునిగి ఉన్న భర్తను చూసి రాణి, అతని విచారానికి కారణం అడిగింది. హరిశ్చంద్రుడు ఆమెకు క్లుప్తంగా జరిగినది చెప్పి, ఆ రాత్రి భోజనం చెయ్యకుండానే గడిపాడు.

తెల్లవారుతూనే విశ్వామిత్రుడు వచ్చి, ''రాజ్యం వదిలి ఎక్కడికైనా వెళ్ళు. నా కిస్తానన్న దక్షిణ మాత్రం త్వరగా ఇచ్చెయ్యి,'' అన్నాడు.



''ఉన్నదంతా ఇచ్చాను. వెళ్ళిపోతాను. దక్షిణ ఇప్పుడు ఇచ్చేస్థితిలో లేను గనక, వ్యవధిగా ఇస్తాను,'' అని హరిశ్చంద్రుడు తన భార్యనూ, కొడుకునూ చూసి, ''మనం ఇక్కడ ఉండరాదు, పదండి!'' అన్నాడు.

ముగ్గురూ కట్టు గుడ్డలతో బయలుదేరారు. తమ రాజుకు జరిగిన మోసం తెలిసి, పౌరులు కంట తడి పెట్టుతూ, విశ్వామిత్రుణ్ణి తిట్టిపోశారు.

వెళ్ళిపోతున్న హరిశ్చంద్రుణ్ణి వెంట తగిలి విశ్వామిత్రుడు, ''నా దక్షిణ ఇచ్చెయ్యి. ఇయ్యటం ఇష్టం లేకపోతే



ఇయ్యనని చెప్పు! నేను మరొకసారి అడగను. అంతేకాదు, కావాలంటే నువ్విచ్చినదంతా నీకు తిరిగి ఇస్తా. అలా కాక మాట నిలబెట్టుకోదలిస్తే బంగారం ఇచ్చెయ్యి!'' అన్నాడు.

''అయ్యా, నీ ఋణం తప్పక తీర్చుతాను. లేకుండా అన్నం ముట్టగలనా? నన్ను చూసి అందరూ నవ్వరా? కొంచెం ఆగితే, దైవం అనుకూలించి నాకు దొరికిన ధనం దక్షిణ కింద ఇస్తాను,'' అన్నాడు హరిశ్చంద్రుడు.

దానికి విశ్వామిత్రుడు, ''రాజా, పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. నీకు ధనం ఎక్కడ దొరుకుతుంది? సమస్త ధనానికీ మూలమైన రాజ్యం ఇప్పుడు నాది! ఇలా వంకర టింకరగా అబద్ధాలాడక, ఇయ్యనని చెప్పెయ్యి, నేను మళ్లా నిన్ను అడగను! ఆ తరవాత నీ యిష్టం నీది!'' అన్నాడు.

హరిశ్చంద్రుడికి రోషం వచ్చింది.

''నేను అబద్ధం ఆడుతున్నానా? డబ్బు గురించి అంత శంకదేనికి? నా శరీరం అమ్మి అయినా నీ బంగారం నీ కిస్తాను. నన్ను పీడించనవసరం లేదు. ఆరోగ్యవంతులం ముగ్గురం ఉన్నాం. కొనేవాడెవడైనా ఈ అయోధ్యలో ఉంటే చూడు. లేదూ, కాశీలో మమ్మల్ని అమ్మి నీ దక్షిణ ఇస్తాను,'' అంటూ హరిశ్చంద్రుడు ముందుకు సాగాడు.

అందరూ కాశీ చేరారు. హరిశ్చంద్రుడు గంగా స్నానం చేసి, తర్పణాలు విడిచి, తన వెంట బ్రాహ్మణ రూపంలో ఉన్న విశ్వామిత్రుడితో, ''అయ్యా, మా ముగ్గురిలో ఎవరినో ఒకరిని అమ్మి నీ ఋణం తీర్చుకో,'' అన్నాడు.

''నెల రోజులుగా నన్ను నీ వెంట తిప్పుతున్నావు, ఏమైనా న్యాయంగా ఉన్నదా? నా దక్షిణ నా కిచ్చి మరీ కదులు! నీ కీర్తి దక్కుతుంది!'' అన్నాడు విశ్వామిత్రుడు.

''అయ్యా, నెల ఇంకా నిండలేదు. సాయంకాలం దాకా గడువు ఉన్నది

కొంచెం ఆగితే నీ ఋణం తీరుస్తాను,'' అన్నాడు హరిశ్చంద్రుడు.

"వెళ్ళి, మళ్లీ వస్తాను. నా ఋణం తీర్చకపోయావో శపిస్తాను,'' అంటూ విశ్వామిత్రుడు వెళ్లిపోయాడు.

సాయంకాలం లోగా రెండు బారువల బంగారం ఇయ్యకపోతే శపిస్తానని భయ పెట్టి విశ్వామిత్రుడు వెళ్ళిపోయాక, హరి శ్చంద్రుడు అయోమయంలో పడ్డాడు. అడిగితే ఇచ్చే సంపన్నులైన మిత్రులుంటే కూడా తాను చెయ్యిచాచలేడు, అటువంటి మిత్రులు లేరు సరేసరి. బ్రాహ్మడి ఋణం తీర్చకుండా తాను చచ్చిపోవటం జరిగితే, బ్రాహ్మణ ధనం అపహరించిన నేరానికి పురుగై పుట్టాలి! అందుచేత తనను తాను అమ్ముకోవటం తప్ప గత్యంతరం లేదు.

ఇలా ఆలోచిస్తూ, విచారంగా ఉన్న భర్తను చూసి హరిశ్చంద్రుడి భార్య శైబ్య, "రాజా, సత్యవంతుడికి సమానుడు మరె వడూ ఉండడు. మాట తప్పిన వాడు పిశా చంతో సమానం. సత్యం పాలించు. యయాతి నూరు అశ్వమేధాలు చేసి, తరవాత రాజసూయం చేసి, దాని ఫలితంగా స్వర్గానికివెళ్ళి, ఒక్క అబద్ధం ఆడిన కారణంగా అధోగతి పాలయాడని చెబుతారు!'' అన్నది.

ఆమె మాట విని హరిశ్చంద్రుడు, "నువు ఏదో చెప్పదలచుకున్నట్టున్నావు. ధైర్యంగా చెప్పెయ్యి!'' అన్నాడు.

దానికి శైబ్య, "భార్య అనేది సంతానం కోసం. నా నుంచి నీకు ఆ ఫలితం లభిం చింది గదా. నన్ను ఎవరికైనా అమ్మి, ఆ బ్రాహ్మడి ఋణం తీర్చరాదా ?'' అన్నది.

ఈ మాటకు హరిశ్చంద్రుడికి, దుఃఖం పొంగి వచ్చింది. ఎంతో ప్రియంగా మాట్లాడి తనను ఆనంద పరిచే భార్య ఇలాటి కఠోరమైన మాటలు అనటం అత నికి విధివైపరీత్యంగా తోచింది. దుఃఖా వేశంతో హరిశ్చంద్రుడికి స్పృహ పోయింది.





# దేవీ భాగవతం

హరిశ్చంద్రుడి భార్య దుఃఖించింది. ప్రపంచమంతా ఏలి, బ్రాహ్మణులకు అంతులేని దానాలిచ్చి, సత్యసంధుడని కీర్తి తెచ్చుకుని, ఇంద్రుడికీ, విష్ణువుకూ సమానుడని అనేక సార్లు అందరిచేతా అనిపించుకున్న వాడికి ఇలాటి దుస్థితి ఎందుకు కలిగిందో ఆమెకు అర్థం కాలేదు. దుఃఖావేశంలో ఆమె కూడా మూర్ఛపోయింది.

తల్లిదండ్రులు ఇలా మూర్ఛలో ఉంటే కొడుకు రోహితుణ్ణి ఆకలి బాధిస్తున్నది. నాలుక ఎండిపోతున్నది. తింటే గాని ప్రాణం నిలిచేటట్టు లేదు. తనకు ఏదైనా కావాలని వాడు తల్లితండ్రులను ఏడుస్తూ అడుగుతున్నాడు!

అంతలో విశ్వామిత్రుడు యముడి లాగా వచ్చి, మూర్ఛపోయి ఉన్న హరిశ్చంద్రుడి ముఖాన చన్నీరు చల్లి స్పృహ తెప్పించి, "అన్నమాట నిలుపుకోదలిస్తే నా దక్షిణ నా కియ్యి! సూర్యాస్తమయం లోపల నా దక్షిణ నా కియ్యక పోయావో నిన్ను నిశ్చయంగా శపిస్తాను!" అన్నాడు రౌద్రంగా.

విశ్వామిత్రుడు ఇలాఅని వెళ్ళిపోయిన కొద్ది సేపటికి అటుగా ఒక బ్రాహ్మణుడు వేదాధ్యయన పరుడు వచ్చాడు. అతని వెనక చాలామంది బ్రాహ్మణులున్నారు.

హరిశ్చంద్రుడి భార్య ఆ బ్రాహ్మణ్ణి చూసి తన భర్తతో, "చాలా మందిని వెంటవేసుకుని వస్తున్నాడు బ్రాహ్మడు!



అతన్ని అడిగితే డబ్బు ఇస్తాడేమో ? రాజు మిగిలిన మూడు వర్ణాల వారికి తండ్రి వంటివాడు గనక, కొడుకుల నుంచి ధనం పుచ్చుకోవటంలో తప్పేమీ ఉండదు !'' అన్నది.

దానికి హరిశ్చంద్రుడు, ''క్షత్రియ జన్మ ఎత్తిన నేను చెయ్యి జాచి ఎలా యాచిస్తాను ? పుచ్చుకునే అధికారం బ్రాహ్మలకే ఉంటుంది. వారు మిగిలిన వర్ణాల వారికి గురువులు. గురువులను యాచించరాదు గదా !'' అన్నాడు.

''కాలమూ, యోగమూ అనే వాటిని బట్టి మానావమానాలూ, దానం ఇచ్చి పుచ్చుకోవటాలూ జరుగుతాయి. కాకపోతే ధర్మాన్ని పోషించ వలసిన బ్రాహ్మణుడు ఇంత దురన్యాయం చేస్తాడా ?'' అన్నది రాణి.

దానికి హరిశ్చంద్రుడు, ''దేవీ, కత్తితో నాలుక అయినా కోసేసుకుంటాను గాని, ఒకర్ని 'దేహీ !' అని అడుగుతానా ? త్రిశంకుడి కొడుక్కు అంత దైన్యమా ? చేతనైతే భుజబలంతో ధనం సంపాదిస్తాను గాని, యాచించి డబ్బు సంపాదించను !'' అన్నాడు.

''యాచించటానికి అభ్యంతరమైతే నన్ను అమ్మి, నీ కీర్తి కాపాడుకో. అమ్మినా, అందల మెక్కించినా, దించినా, అన్నిటికీ భార్య అనే వస్తువు పనికి వస్తుంది గదా !'' అని భార్య అనే సరికి, హరిశ్చంద్రుడికి దుఃఖం పొర్లివచ్చింది.

అది చూసి ఆమె హరిశ్చంద్రుణ్ణి ఓదార్చుతూ, ''జూదానికి కాదు, తాగుడుకు కాదు, భోగానికి కాదు సత్యం నిలబెట్టుకునేటందుకు భార్య నమ్మటం తప్పా ?'' అంటూ అనేక విధాల నచ్చజెప్పి, హరిశ్చంద్రుణ్ణి ఒప్పించింది.

అప్పుడు హరిశ్చంద్రుడు ఆమెతో, ''సరే, నీ మాట విని, ఎవడూ చెయ్యని పని చేస్తాను. ఏ యుగంలోనైనా భార్యను అమ్ముకున్న పాపాత్ముడు ఉంటాడా ? భాగ్యహీనుణ్ణి గనక నలుగురిలోనూ తల

వంపులు అయే పని చేయక తప్పదు,''
అన్నాడు.

అతను తన భార్యను ఒక చోట నిల బెట్టి, గద్గద స్వరంతో, దారిన పొయ్యే వారితో ఇలా అన్నాడు :

''నాగరికులారా! కరుణామయులారా! ఈమె నా భార్య. ఎవరైనా కొనదలిస్తే అమ్ముతాను. తగిన డబ్బు ఇయ్యగల వారుంటే ముందుకు రండి!''

త్వరలోనే అతని చుట్టూ వింతగా జనం పోగై, భార్యను అమ్ముకోవలసి నంత అగత్యం ఏం వచ్చిందని అడిగారు.

వారికి హరిశ్చంద్రుడు, ''అయ్యా, సగం చచ్చి ఈ పాడు పనికి ఒడిగట్టాను! పాపాత్ముణ్ణి! పరమ కిరాతకుడైన రాక్ష సుడి లాటి వాణ్ణి! నా పేరు తలిస్తేనే పాపం! అలాటి నన్ను గురించి మీకు దేనికి? కావలిస్తే ఈమెను తగిన ధర ఇచ్చి కొనుక్కోండి!'' అని గట్టిగా అరుస్తూ చెప్పాడు.

విశ్వామిత్రుడు మరొక ముసలి బ్రాహ్మడి రూపంలో వచ్చి, ''డబ్బు కట్టుకు పోయినంత ఉన్నది. పెళ్ళాం మహా సుకుమారి, పని చేయలేక చాలా అవస్థపడుతున్నది. అడిగినంత ధనం ఇస్తాను, నిజంగా నీ భార్యను అమ్ము తావా?'' అని అడిగాడు.



హరిశ్చంద్రుడికి జవాబు చెప్పటానికి నోరు రాలేదు.

మళ్ళీ విశ్వామిత్రుడే, ''ముప్పై రెండు లక్షణాలూ గల స్త్రీ విలువ కోటి అనీ, పురు షుడి విలువ అర్బుదం (వెయ్యికోట్లు) అనీ శాస్త్రాలు చెబుతున్నాయి గనక, ఈ స్త్రీని ఆ ధరకు కొని ఇంటికి తీసుకు పోతాను!'' అన్నాడు.

హరిశ్చంద్రుడికి నోట మాట లేదు.

బ్రాహ్మడికి కోపం వచ్చింది. అతను డబ్బు హరిశ్చంద్రుడి ముందు పోసి, అతని భార్యతో, ''నువు ఇప్పుడు నా దాసివి. పదపోదాం!'' అంటూ జుట్టుపట్టి లాగాడు.



తనను బలాత్కారంగా ఈడ్చుకు పోతున్న బ్రాహ్మడితో ఆమె, "అయ్యా! నన్ను విడిచిపెట్టు. నేను నా కొడుకుని విడవలేను. పతివ్రతను. నన్ను తాకకు," అన్నది.

రోహితుడు కూడా, "అమ్మా! అమ్మా!" అని పెద్దగా ఏడ్చాడు, తల్లి వెంటబడి.

"ఫో!" అని ఆ బ్రాహ్మడు కుర్రవాణ్ణి కొట్టాడు.

అది చూసి హరిశ్చంద్రుడి భార్య బ్రాహ్మడితో, "అయ్యా, నన్ను కొన్నట్టుగానే, నా కొడుకును కూడా కొను. నాకు వాడొక్కడే కొడుకు. వాడికి దూరమై నేను పనిపాటలు సరిగా చెయ్యలేను!" అన్నది.

దానికి ఆ బ్రాహ్మడు ఒప్పుకుని, రోహితుడు మగవాడు గనక అతని మూల్యం వెయ్యి కోట్లూ ఇచ్చి, తల్లికొడుకులను తన వెంటరమ్మన్నాడు.

ఆ ఇల్లాలు తన భర్తకు ప్రదక్షిణం చేసి, తన తల అతని కాళ్ళమీద పెట్టి, ఏడుస్తూ, "ఎన్ని జన్మలకైనా ఈయనే నాకు భర్త కావాలి!" అన్నది.

ఆమె రానున్న కష్టాలను ఎలా ఎదుర్కొంటుందో, తాను లేకుండా ఎలా బతుకుతుందో హరిశ్చంద్రుడు ఊహించలేకపోయాడు. తన కొడుకు తనకు దూరమవుతున్నాడన్నది హరిశ్చంద్రుణ్ణి చాలా బాధించింది. రాజ్యం త్యాగం చెయ్యటం కన్న పుత్రత్యాగం చాలా దుర్భరంగా తోచింది.

కొంతసేపు చూసి ఆ బ్రాహ్మడు తన బానిసలను కొట్టి లాక్కుపోతుంటే హరిశ్చంద్రుడు ఏమీ చెయ్యలేక పోయాడు! అతని శోకం మిన్నుముట్టింది. ఆ స్థితిలో విశ్వామిత్రుడు శిష్యులతో సహా వచ్చి, "అబద్ధం ఆడదలచక పోతే నా దక్షిణ నా కియ్యి!" అన్నాడు.

హరిశ్చంద్రుడు తన భార్యనూ, కొడుకునూ అమ్మిన తాలూకు ధనాన్ని విశ్వా

మిత్రుడికి ఇచ్చాడు. అది చాలదన్నాడు విశ్వామిత్రుడు. ఆయన సాయంకాలం దాకా మిగిలిన ధనానికి గడువు ఇచ్చి వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడు తనను తాను అమ్ముకోవటానికి సిద్ధపడ్డాడు. ఇంతలో ఒక వికృతాకారుడైన చండాలుడు అటుగా వచ్చి, హరిశ్చంద్రుడితో, "చూడు, నేను ప్రవీరు డనే చండాలుణ్ణి. నా కింద పని చేస్తావా? శవాల మీది గుడ్డలు తీయటం ఆ పని" అన్నాడు.



"నేను బ్రాహ్మణ, క్షత్రియులకు మాత్రమే అమ్ముడు పోతాను!" అన్నాడు హరిశ్చంద్రుడు.

"అమ్ముడుపోతానన్న వాడివి ఇప్పుడు మాట తప్పిస్తున్నావు. అబద్ధం ఆడేవాడికి అనేక మార్గాలు!" అన్నాడు ప్రవీరుడు.

అబద్ధం ఆడాననిపించుకోవడం కన్న చండాలుడికి అమ్ముడు పోవటమే మేలనుకున్నాడు హరిశ్చంద్రుడు. ఇంతలో తన బాకీ వసూలు చేసుకోవటానికి విశ్వామిత్రుడు అక్కడికి రానే వచ్చాడు. ఇక హరిశ్చంద్రుడికి అమ్ముడుపోక తప్పలేదు. ఆ పరిస్థితిలో హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి కాళ్ళ మీద పడి, "స్వామీ, మరొకరెందుకు? మీకే అమ్ముడవుతాను. మీ ఋణం కింద నన్ను కొనుక్కొని, మీ ఇష్టం వచ్చినట్టు నా చేత చేయించుకోండి!" అని ప్రాధేయపడ్డాడు.

"అలాగా? అయితే సరే!" అని విశ్వామిత్రుడు చండాలుడితో, "ఈ మనిషి నాకు బానిస అయాడు. కాని నాకు యితడితో పనిలేదు. నాకు డబ్బు కావాలి. ఇతన్ని నువు కొనుక్కో!" అన్నాడు.

ప్రవీరుడు విశ్వామిత్రుడికి వేలకొద్దీ రత్నాలూ, ముత్యాలూ, అంతులేని బంగారమూ ఇచ్చి, హరిశ్చంద్రుణ్ణి తన బానిసగా కొనుక్కున్నాడు. ఎలాగైతేనేం, హరిశ్చంద్రుడికి ఋణవిముక్తి కలిగింది.

హరిశ్చంద్రుడు పారిపోతాడేమోనని, చండాలుడు అతన్ని కట్టిమరీ తీసుకు



పోయాడు. నాలుగురోజులు హరిశ్చంద్రుణ్ణి కట్టి ఉంచి, తరవాత కట్లు విప్పి శవాలమీది గుడ్డలు తీసుకు రావటానికి నియోగించాడు చండాలుడు.

ఊరికి దక్షిణాన శ్మశానం ఉన్నది. హరిశ్చంద్రుడు అక్కడికి వెళ్ళాడు. శవాలు వస్తూంటాయి. వాటి దహనానికి డబ్బు వసూలు చెయ్యాలి. రాత్రీ, పగలూ వచ్చే శవాలను చూస్తూండాలి.

ఇలా ఉండగా ఒకనాడు రోహితుడు తన యజమాని అయిన బ్రాహ్మడి కోసం సమిధలు ఏరుతూ, ఒక పుట్ట ఎక్కి, పాము కాటు తిని, పడిపోయాడు. ఈ వార్త అతని తల్లికి చేరింది. ఆమె మతి పోయి ఏడుస్తూ కూర్చుంటే, ఆమెను కొన్న బ్రాహ్మడు, "బోలెడంత డబ్బు పోసి నిన్ను కొన్నది పని చెయ్యటానికా? ఏడుస్తూ పొర్లిగింతలు పెట్టటానికా? లక్ష్మి వచ్చే వేళ ఏడుస్తావా?" అని తిట్టాడు.

ఆ మాటలు ఏవీ అర్థంకాక ఆమె మరింతగా ఏడ్చింది. అయితే ఆ బ్రాహ్మడు అర్ధరాత్రి దాకా ఆమె చేత ఇంటి చాకిరి చేయించి గాని, కొడుకు శవాన్ని చూసుకోవటానికి పోనియ్యలేదు. వెళ్ళేటప్పుడాయన ఆమెతో, "నీ కొడుకును తెల్లవారే లోపల దహనం చేసి తిరిగిరా! ఆలస్యం చేసేవు!" అన్నాడు.

అర్ధరాత్రి వేళ ఆమె కొడుకును వెతుక్కుంటూ బయలుదేరి, రోహితుడి శవాన్ని చూసి, గుండె పగిలేటట్టు వైన వైనాలుగా ఏడవసాగింది. ఆమె వద్దకు తలార్లు వచ్చి "ఇది పిల్లల్ని చంపుకు తినేదిలా గున్నది, పిశాచి!" అని జుట్టు పట్టుకుని చండాల వాటికకు లాక్కుపోయి, ప్రవీరుడి (వీరబాహుడి) తో, "దీన్ని వధించు!" అని చెప్పారు. వాడు తన బానిస అయిన హరిశ్చంద్రుణ్ణి పిలిచి, ఆమెను వధించమన్నాడు, కత్తి ఇచ్చి.

హరిశ్చంద్రుడు తన భార్యను గుర్తించక, తను చేయబోతున్నపనికి విచారిస్తూ,

"ఏమమ్మా! నేను నీ తల నరక బోతున్నాను!" అన్నాడు.

"అయ్యా! నా కొడుకు చచ్చి పోయాడు. వాణ్ణి తెచ్చి దహనం చేసిన దాకా ఆగు!" అన్నదామె.

హరిశ్చంద్రుడు, సరే అన్నాడు.

ఆమె వెళ్ళి కొడుకు శవాన్ని తెచ్చి, ఏడుస్తూ కూర్చున్నది. హరిశ్చంద్రుడు తన విధి చొప్పున శవంమీది బట్ట లాగేసు కున్నాడు.

కాని ఆమె తన భార్యే నన్న సంగతి క్రమంగా హరిశ్చంద్రుడికి స్ఫురించింది. అయితే ఆ చచ్చిన కుర్రవాడు తన కొడుకే! అతను కూడా దుఃఖం అపుకో లేక ఏడవసాగాడు. అతను తన భర్తే నని ఆమెకు కూడా క్రమంగా తెలిసింది. తమ గతి చివరకు ఎలా అయినదీ ఇద్దరూ గ్రహించారు. హరిశ్చంద్రుడు కొడుకు శవాన్ని కౌగలించుకుని మూర్ఛపోయాడు.

తరవాత తన పాట్లన్నీ ఆమె తన భర్తకు చెప్పుకున్నది. ఆమె అతన్ని తన విధి నిర్వర్తించమనీ, తన తల నరకమనీ అన్నది. కాని హరిశ్చంద్రుడికి జీవితం మీద రోత పుట్టింది. అతను తన భార్యతో సహా కొడుకు చితిమీద కాలిపోవటానికి నిర్ణయించు కున్నాడు.

చితి పేర్చి దానిమీద కొడుకు శవాన్ని ఉంచి, భార్యాభర్తలు దేవిని ధ్యానిం చుతూ చితికి నిప్పు పెట్టబోతుండగా, బ్రహ్మ మొదలుగాగల దేవతలు ఇంద్రు డితో సహా వచ్చి తమను తాము తెలుపు కుని, చచ్చిపోయిన రోహితుడిపై అమృత వర్షం కురిపించారు. వాడు బతికి లేచాడు.

ఇంద్రుడు హరిశ్చంద్రుణ్ణి స్వర్గానికి ఆహ్వానించాడు. యముడు తానే చండా లుడి రూపం ధరించినట్టు హరిశ్చంద్రు డితో అన్నాడు.

తరవాత హరిశ్చంద్రుడు తన కొడు కును రాజుగా చేసి, తాను తన భార్యతో ఇంద్రుడి వెంట స్వర్గానికి వెళ్ళాడు.

—(అయిపోయింది)

